# చతుర

అక్టోబర్ 1978

సంపుటి 1 సంచిక 9

## ఈ నెల సమగ్ర నవల

పెళ్లయిన వెంటనే పట్నానికి కాపురానికి వచ్చిన నవ వధువు సీత. లేమిలో పెరిగి భావి జీవితాన్ని గురించి రంగుల కలలెన్నో కన్న సీత క్రొత్త కాపురంలో యదార్థ జీవిత సత్యాల ముందు అవన్నీ భగ్నం కాగా పట్టుదలతో వాటిని నిజం చేసుకోజూసింది. ఆమె కృషి ఫలించి అనతి కాలంలోనే సాహిత్య, కళా రంగాల్లో కీర్తితో పాటు ఆశించనంతటి ఆదాయం కూడా పొందగలిగింది. కలలుకన్న సౌకర్యాలన్నీ కాళ్ల ముందుకే వచ్చి వాలాయి. అయినా అకస్మాత్తుగా ఆ రంగుల ప్రపంచం నుండి తనంతట తానుగా......

# విముక్తి

...... పొంది, పాత జీవితాన్నే ప్రేమించటానికి సిద్ధ పడింది. అందుకామెను ప్రేరేపించిన పరిస్థితులేమిటి ? అనుభవాలెలాంటివి?

## శీలంశెట్టి రమాదేవి

చిత్రించిన ఆధునిక యువతి యధార్థ జీవిత దృశ్యం ఈ నెల చతుర సమగ్ర నవల 'విముక్తి.'

## ఈ నెల ముఖపత్రం

సాంప్రదాయిక చిత్రకళలో ఆసియా కంతటికీ అగ్రగాములు చైనా, జపాన్ కళాకారులు. చైనాలో వస్త్రంపై రకరకాల రూపాలను అతిసూక్ష్మ వివరాలతో కూడా నేతపని చేయగల నైపుణ్యం ఏనాడో పరాకాష్ట నందుకుంది. అలాగే ఎంబ్రాయిడరీ పనితనం కూడా.

ఈ నెల 'చతుర' ముఖపత్రం 'వెన్నెలలో గృహోన్ముఖురాలైన జెస్తయువతి' చిత్రం సిల్కు వస్త్రంపై చేసిన ఎంబ్రాయిడరీ పనితనానికి ఒక ఉదాహరణ మాత్రమే. చైనాలోని కియాంగ్సు ప్రాంత నాన్‌టుంగ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ పరిశోధనా సంస్థలోని కళాకారులు రూపొందించారీ చిత్రాన్ని.

## రెండవ కవరు

ఒకప్పుడు సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ కాలంలో ఇటాలియన్ కళాకారులు కళా, వాస్తు రంగాలలో అపూర్వ సృష్టికి పునాదులు వేశారు. ఆధునిక యుగంలో కూడా ఆ ప్రత్యేకతను నిలబెట్టుకుంటున్నారు. చిత్రంలో ఉన్న అత్యంతాధునిక భవనం అమెరికాలోని డెట్రాయిట్ 'రినైజాన్స్ సెంటర్'. ఇక్కడ ప్రస్తుతం ఇటాలియన్ వాస్తుశిల్పులు రూపొందించిన 'మోడల్స్' ప్రదర్శన జరుగుతోంది. ఆ మోడల్స్‌లో ఇదీ ఒకటి.

## మూడవ కవరు

జర్మన్ మ్యూజియంలోని ఒక దారు శిల్పం.

## నాలుగవ కవరు

కర్ణాటక రాష్ట్రపు ప్రఖ్యాత శిల్పం.

చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# వారసుడు

సుబ్బారావు భోజనం ముగించి ముందు హాల్లోకి వచ్చి, అలవాటుగా వక్కపొడి వేసుకుని, సిగరెట్ పాకెట్ తెరిచి చూసి ఆశ్చర్య పోయేడు. నిండు సిగరెట్ పాకెట్ టేబుల్ మీద పెట్టి వెళ్ళితే దాన్లో ఓ సిగరెట్ తగ్గింది. గతకొన్ని రోజులుగా ఇలాగే జరుగుతోంది. రోజూ తన సిగరెట్లు ఎవరో తస్కరిస్తున్నారు! తమ్ముడు రవి చేస్తున్నాడనేందుకు అవకాశం లేదు. వాడు ఇంట్లో లేనప్పుడు రెండు మూడు సార్లు సిగరెట్లు మాయమయ్యాయి. తనే కాల్చేసి మర్చిపోతున్నాడా? అని అనుకుందామన్నా వీల్లేదు. ఒకటి రెండు సార్లు సిగరెట్ల చౌర్యం గురించి జాగ్రత్తగా పరిశీలించేందుకు లెక్కపెట్టి టేబుల్ మీద ఉంచటం భోజనం తర్వాత చూస్తే దాన్లో సిగరెట్లు మాయం కావటమూ జరిగింది.

సుబ్బారావుకి తనుసిగరెట్లు కాల్చడం ప్రారంభించిన రోజులు గుర్తొచ్చాయి. తన కప్పుడు పద్నాలుగేళ్ళు. తండ్రిజేబు నుంచి దొంగతనంగా తీసి కాల్చడంతో మొదలయింది అలవాటు. నిండా పన్నెండేళ్ళులేని తన సుపుత్రుడే ఈ పని చేస్తున్నాడా?? అనుమానం రావటమే అలస్యం నిఘావేసి, ఓ రాత్రి పెరట్లో చెట్ల చాటున కూర్చుని సిగరెట్ కాలుస్తున్న కుమారరాజాని రెడ్ హాండెడ్‌గా పట్టుకున్నాడు సుబ్బారావు.

కడుపు మండిపోయి కాలరుచ్చుకుని ఎడాపెడా వాయించేశాడు కూడా! ఆవేశం తగ్గేక నిదానంగా ఆలోచించేడు సుబ్బారావు. చిన్న తనంలో తన తండ్రి కొట్టినంత మాత్రాన తను సిగరెట్లు మానేశాడా? నాన్న మీద కోపంతో ఇంకా సిగరెట్లు కాల్చటం అధికం చేశాడు. అంచేత తనూ తెలివిగా వ్యవహరించి, తన కొడుకు మనసును మార్చగలగాలి.

కుమార రత్నానికి అపరిమితమైన భక్తి, నమ్మకం ఉన్న భగవద్గీత తెచ్చి "పెళ్ళయ్యేదాకా సిగరెట్లు కాల్చను" అని ప్రమాణం చేయించాడు. అప్పటికి గానీ సుబ్బారావు మనసు కుదుట పడలేదు.



ఓ వారం తర్వాత అడుగులో అడుగ లేస్తూ వచ్చి "నాన్నా!" అని గొణిగిన కుమారుణ్ని చూసి పేపర్ చూస్తున్న సుబ్బారావు ఏమిటన్నట్లు కళ్ళెగరేశాడు.

"పిల్లైనంత త్వరలో నాకు పెళ్ళిచేసేయ కూడదూ?" నసిగాడు కుమార రత్నం.

అనుకోని సంఘటనకి సుబ్బారావుకి తల గిర్రున తిరిగి నట్లయింది.

—మురికిపుడి ప్రకాశరావు

# 1+1 = ?

ఓ పెద్ద మందుల కంపెనీలో ఎకౌంట్స్ అసిస్టెంట్ ఉద్యోగానికి ఖాళీ ఏర్పడింది. ఆ పోస్టుకి మగాళ్ళ కంటే ఆడవాళ్ళైతేనే ఒళ్ళు దగ్గరుంచుకుని పని చేస్తారనే ఉద్దేశంతో మహిళా అభ్యర్థినుల్ని ఇంటర్వ్యూకి పిలిచేరు.

ఓ అమ్మాయి లోపలికొచ్చింది. ఆమె వివరాలు అడిగి తెలుసుకుని లెక్కల్లో ఆమె తెలివితేటల్ని పరీక్షించేందుకు మేనేజర్ చివర్లో ఒక ప్రశ్న వేశారు.

"ఒకటీ, ఒకటీ కలిస్తే ఎంత?"

"రెండు" తడుముకోకుండా సమాధాన మిచ్చిందామె.

"మీరు వెళ్ళొచ్చు. నెక్స్ట్!" అన్నారు మేనేజర్.

రెండో యువతినీ అలాగే అడిగేరు.

"పదకొండు" తెలివిగా జవాబిచ్చిందీయువతి.

"ఓ.కె. వెళ్ళొచ్చు - తర్వాత..."

మూడో సుందరి నవ్వుతూ లోపలికొచ్చింది.

మళ్ళీ అదే ప్రశ్న.

ఓస్ ఇంతేనా అన్నట్టు చూసి 'మూడు' అంది.

ఆమే వెళ్ళిపోయింది బైటికి.

ఇదంతా చూస్తున్న హెడ్ గుమస్తాకి అయోమయంగా ఉంది. మెల్లగా మేనేజర్‌గారి దగ్గరికిచేరి "సార్... చిన్న సందేహం" అన్నాడు.

"ఏమిటీ నన్నూ ఇంటర్వ్యూ చేస్తావా?" నవ్వుతూ అన్నారు మేనేజర్.

"అలాంటిదేం కాదుసార్! ఆ ముగ్గురమ్మాయిల్నీ ఒకే రకం ప్రశ్న వేశారు. మూడు రకాల సమాధానాలు చెప్పేరు. ఇంతకీ వాళ్ళలో ఎవర్ని నిర్ణయించదల్చుకున్నారు?" అనుమానం వెళ్ళగక్కేడు.

'ఒకటీ, ఒకటీ కలిస్తే రెండు' అని మొదటి అమ్మాయి చెప్పింది. ఆ జవాబు చిన్న పిల్లలూ చెప్పగలరు. 'ఒకటీ, ఒకటీ కలిస్తే పదకొండు' అంది రెండో ఆమె. కాస్త తెలివి ఉపయోగించిందనే




చెప్పాలి. మూడో యువతి మాత్రం 'ఒకటీ, ఒకటీ కలిస్తే మూడు' అంది. దీనిలో అంతరార్థం చాలా ఉంది. జీవితాన్ని బాగా స్టడీచేసిన వాళ్ళే ఆ జవాబు చెప్పగలరు. తనకు వివాహ మవుతుంది. ఇద్దరూ కలసి ఏడాదికల్లా ముగ్గురవుతారు. అలాంటప్పుడు తనకి ఉద్యోగం తప్పని సరిగా అవసరం అనే భావం కూడా ఆమె జవాబులో ధ్వనిస్తుంది. అందుకే ఆమెకే ఈ ఉద్యోగం ఇవ్వదల్చుకున్నాను. అంతేగాక ఆమెకు




మరో అదనపు అర్హత ఉంది. ఆమె నా భార్యకు చెల్లెలు, నాకు మరదలు. ఆమెకు ఉద్యోగం ఇవ్వకపోతే నా సంసారం సజావుగా నడవదు. ఇదీ సంగతి!" పరమ రహస్యాన్ని వెల్లడించారు మేనేజరు.

**—కొండూరి కమల కుమారి**

# మామూళ్ళు

ఇంట్లో అందరూ సినిమాకెళ్ళే హడావుడిలో ఉన్నారు. ఎనిమిదేళ్ళనానిగాడు ఇదేం పట్టనట్టు ప్రక్కింటి ప్రభుగాడితో ఆడుకుంటున్నాడు.

"ఏరా! సినిమాకి రావా?" అటుగా వచ్చిన మామయ్య ప్రశ్నకు రానన్నట్లు తల అడ్డంగా ఊపాడు నానిగాడు.

"వెరీగుడ్! ఇంద ఈ పావలా ఉంచుకో!" మామయ్య ఇచ్చిన పావలాని మౌనంగా అందుకున్నాడు. కాసేపటికి అక్కయ్య వచ్చింది.

"అదేమిట్రా ఇంకా అలాగే ఉన్నావు త్వరగా బైలుదేరు?"

"నేను సినిమాకి రావటం లేదు"

"ఈ బుద్ధి ఎప్పట్నుంచీ..మంచిదేలే అంటూ ఓ అర్ధ రూపాయి ఇచ్చింది.

మరో రెండు నిమిషాలకు అటుగా వచ్చిన తాతయ్య "ఏరా నానీ!సినిమా అనగానే ఎగిరి గంతేసి, అందరికన్నా ముందుండే నువ్వు ఇంకా అలా ఉన్నావేం?" అన్నాడు.

"నేను రావటం లేదు తాతయ్యా!"

"అంతా నా పోలికేరా! చిన్నప్పుడు నేనూ ఇంతే. నాకు నచ్చేవురా నానీ... ఇంద రూపాయి, ఏమన్నా కొనుక్కో!"

లోపలినించి వచ్చిన నాని వాళ్ళ నాన్నగారు "నానీ అలిగావా ఏమిటీ–సినిమా కెళదాంరా!" ముద్దుగా అడిగారు.

"ఊహు...నేను రావటంలేదుగా!" బుంగమూతి పెట్టిన నానిగాణ్ని ముద్దెట్టుకుని "పిచ్చి వెధవా! ఇంటి దగ్గరే కూర్చుని తెలుగు పుస్తకం చదువుకో! ఇంద చాక్లెట్లు కొనుక్కో!" అంటూ రూపాయిచ్చారు.

"ఇదిగో ఆటోలో మేం వెళ్తున్నాం. వంట పూర్తవగానే రిక్షాలో హాలు దగ్గరి కొచ్చేయ్!" అంటూ గబగబా వెళ్ళిపోయారు.



"ఇక మీ అమ్మ ఎంత ఇస్తుందంటావ్ ?" ఉత్సాహంగా అడిగేడు ప్రభు.

"ఏమీ ఇవ్వదు!" క్లుప్తంగా సమాధానం చెప్పాడు నానిగాడు.

అంతలో వాళ్ళమ్మ వసారాలోకొచ్చి "ఏరా నానిగా! వాళ్ళతో వెళ్ళలేదా వెధవా!" మందలింపుగా అంది.

"లేదమ్మా...నేను నీతోనే వస్తాను"

"సరే మయింది. పద త్వరగా!" నాని గాడి చేయి పట్టుకుంది. "ఒరే ప్రభూ! వస్తారా...రేపు ఎగిరే విమానం కొనుక్కుందాంలే.....టాటా !" అన్నాడు నానిగాడు.

థియేటరు దగ్గర రిక్షాలోంచి తల్లితో పాటు దిగుతూన్న నానిగాణ్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు.

—సుసర్ల సర్వేశ్వరశాస్త్రి

# హెచ్చరిక

కల్నల్ రావుగారికి షాంపేన్ పెగ్గు పడందే ముద్ద దిగదు. ఇంటికి అతిథులొచ్చినా సరే, వాళ్ళకి బలవంతాన ఓ పెగ్గు పోసి, తనో పెగ్గు పోసుకుని భోజనానికి కూర్చుంటాడు.

ఓ రోజు సాయంత్రం కల్నల్‌గారి శ్రీమతి ఆయన్తో చెప్పింది- "షాంపేన్ అయిపోయింది. రేపు ఉదయం మళ్ళీ తెప్పిస్తాను. ఈ రాత్రి మీ ఫ్రెండ్ భోజనాని కొస్తున్నాడుకదా. ఆయన్ని 'షాంపేన్' గురించి బతిమాలకండి" అంటూ. తలూపాడు కల్నల్‌గారు.

అయితే, అతిథిని చూసిన సంతోషంలో ఆ విషయం మర్చిపోయాడాయన. భోజనాల దగ్గర మామూలుగానే,

"షాంపేన్ తాగుదామా?" అంటూ అడిగాడు.

అతిథి ముఖం ఎందుకో ఎరుపెక్కింది ఆ మాట విన్నాక.

"అక్కర్లేదులెండి" అన్నాడు.

"అదేం ?"

"ఇప్పుడు తాగాలన్లేదు"

అయిదు నిమిషాలసేపు బలవంతం చేశాడు రావుగారు. ఫలితం లేకపోయింది. చివరికి ఆ పూట పెగ్గు లేకుండానే భోజనం ముగిసింది.

అతిథిగారు గడప దాటగానే భర్త మీద విరుచుకుపడింది రావుగారి భార్య.

"మీ కసలు బుద్ధుందా?"

"ఏం"

"షాంపేన్ అయిపోయిందని మొదటే చెప్పానా? అతన్ని అలా బలవంతం చేశారు. అతను తాగుదామంటే ఏం చేసేవారు?"

"అరె... రె..." నాలిక్కొరుచుకున్నాడు రావుగారు, "ఆ మాటే మర్చి



పోయాను స్మీ!"

"మీ మతిమరుపు నాకు తెలీనిదా? అందుకే కదా మీరు షాంపేన్ పేరెత్తగానే కాలు తొక్కాను! అప్పుడయినా గ్రహించద్దూ?" చిరాకు పడిందామె.





"ఇది మరీ బావుంది. నువ్వసలు నా కాలు ఎప్పుడు తొక్కావూ?" ఆశ్చర్యపోతూ అడిగాడు కల్నల్ రావుగారు!

-శివ

# హత్యా

బ్రహ్మానందం అప్పుడప్పుడూ బ్రహ్మదేవుణ్ని తిట్టుకుంటూంటాడు తనకి గయ్యాళి భార్యను రాసిపెట్టినందుకు.

ఆవిడ తను చెప్పిన ప్రతి పనినీ వ్యతిరేకంగా చేయటమేకాక తన పరువు బజార్న పెట్టి వేలం వేస్తుంది. పది మందిలో తనకు గడ్డిపరక విలువా లేకుండా చేసింది.

తనమీదే ఆధారపడిన ముసలి తల్లిదండ్రుల్ని ఇంట్లోంచి వెళ్ళగొట్టే వరకూ ఆనందలక్ష్మి నిద్రపోలేదు. పోనీ వార్ని వేరే మరో ఇంట్లో ఉంచి నెలనెలా ఎంతో కొంత పంపే ఏర్పాటు చేసినా అందుకూ అంగీకరించటం లేదు.

భార్యపోరు పడలేక పూర్తిగా విసిగిపోయాడు బ్రహ్మానందం. సహనం నశించింది. చిట్టచివరికి తనైనా ఆత్మహత్య చేసుకోవాలి, లేదా భార్యనైనా హత్య చెయ్యాలనే నిర్ణయాని కొచ్చేడు. తనుచస్తే ముసలి తల్లిదండ్రులు దిక్కులేని వాళ్ళవుతారు. ఇహ ఒకటే మార్గం ఆనందలక్ష్మిని హత్యచేయటం.

'హత్యచేయటం ఎలా ?' అని చాలా రోజులు బుర్ర బద్దలు చేసుకున్నాడు.

ఆఖరికి ఓ మంచి ఉపాయం తట్టింది బ్రహ్మానందంకి.

ఆ రాత్రి ఆనందలక్ష్మి నిండా దుప్పటి కప్పుకుని నిద్రపోతోంది. మెళకువగా ఉందేమోనని బ్రహ్మానందం కొన్ని చప్పుళ్ళు చేశాడు. ఏమీ చలనం లేదు.

ఫర్వాలేదు, బాగా నిద్రపోతోందని నిర్ణయించుకుని నెమ్మదిగా దగ్గరి కొచ్చాడు. వణుకుతూన్న చేతుల్తో తలగడ తీసి ఆనందలక్ష్మిని గట్టిగా అదమ సాగేడు.

అలాగే రెండు నిముషాలు అదిమిపెడితే ఆనందలక్ష్మి శ్వాస శాశ్వతంగా ఆగిపోతుంది. ఇక ఆ రాక్షసిపీడా తనకి తప్పుతుంది పాపం! గుండెఆగి చచ్చిందని అందర్నీ నమ్మించవచ్చు- ఈ ఊహతో



బ్రహ్మంకు మరింత హుషారు వచ్చింది. ఇంకా గట్టిగా అదమ సాగేడు.

ఆనందలక్ష్మికి చిరాకు కలిగింది. ఇందాకట్నుంచీ తన కాళ్ళను అదిమిపెడుతోన్న భర్త ధోరణి అర్థంకాక తటాల్న లేచి కూర్చుంది.

బ్రహ్మానందంకి మళ్ళీ స్పృహ వచ్చే సరికి రెండు రోజులైంది.

-పులవర్తి సుబ్రహ్మణ్యం



# విముక్తి

శీలంశెట్టి రమాదేవి

అది శోభనం గదిలా లేదు.

గది మధ్యలో ఉన్న స్తంభంపక్కనే తాతలనాటి ఓ పందిరి మంచం ఉంది. దానిమీద పరుపూ, పరుపుమీద తెల్లటి దుప్పటీ పరచి వున్నాయ్. ఆ మంచం పక్కనే అంత ఎత్తువున్న ఓ ముక్కాలి పీటమీద స్టీలు ప్లేటూ, దాన్నిండా ఏవేవో మిఠాయిలూ ఉన్నాయి. గదిలో ఓ పక్క వేలాడుతున్న తీగకి కాంతిగా వెలుగుతున్న ఓ లాంతరు ఉంది. ఓ పక్కనున్న తడికెకు సినిమా పోస్టర్లు అంటించి ఉన్నాయి. ఓ మూలగా గోడకానుకొని ఓ పెద్ద కావిడిపెట్టె, దానిమీద మరో రెండు చెక్కపెట్టెలూ ఉన్నాయి.

పందిరి మంచంమీద పడుకొని సిగరెట్ తాగుతూ మధురమయిన ఊహల్లో తేలిపోతున్నాడు మాధవరావ్. టైము చూసుకొన్నాడతను.పది దాటింది. తీరా తను నిద్రపోయాక సీతని గదిలోకి పంపుతారేమో! నవ్వు వచ్చిందతనికి. తను సీతతో ఎన్నో విషయాలు మాట్లాడాలి. తామిద్దరూ కలసి మోయ వల్సిన బరువులూ, బాధ్యతలూ, కష్టాలూ, ఒకటేమిటి ఎన్నో.

ఒకరినొకరు పరిచయం చేసుకోవడం, కొంతవరకయినా అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం, తాము ఎదుర్కోబోయే సమస్యలు చర్చించడం – ఆ తరువాత తీయని సుఖాలు ప్రప్రథమంగా అనుభవించడం ఇవన్నీ జరగవలసి వున్న మొదటి రాత్రిలో ప్రతి క్షణమూ విలువైనదే.

తలుపు దగ్గర గుసగుసలు వినిపించినయ్ మాధవరావుకి. చటుక్కున మంచం మీదనుంచి లేచి కూర్చున్నాడతను. గది తలుపువేపే చూడసాగాడు. సీత లోపలి కడుగిడే మధుర ఘట్టాన్ని వీక్షించడానికి మనసు తహతహలాడుతోంది. బయట గాజుల గలగలలూ, నవ్వులూ—

మరో పదినిమిషాల తర్వాత సీత లోపలికొచ్చింది. ఆమెను చూస్తూనే విభ్రాంతుడయిపోయాడు మాధవరావు. అలంకరణ ఆమె అందానికి ఓ కొత్తదనం తీసుకొచ్చింది. పట్టుచీర కట్టుకొని, కాటుక కళ్ళతో తనకెదురుగ్గా పెళ్ళి చూపులకోసం కూర్చున్న సీతకీ ఈనాటి సీతకీ ఎంతో తేడా కనిపిస్తోంది. ఆనాటి బెదురు, అమాయకత్వం బదులు ఇప్పుడు శృంగారం, ఓ వింత అందం మెరసి పోతున్నయ్ ఆమెలో.

"పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు" సీతతో పాటు లోపలికొచ్చిన నడివయసు స్త్రీ బయటకెళ్ళిపోతూ అంది. ఆ తర్వాత తలుపులు మూసుకుపోయినయ్.

మంచంమీద నుంచి దిగి ఆమెనే తనివితీరా చూస్తూ దగ్గరకు నడిచాడు మాధవరావ్.

"సీతా!" అన్నాడు ఆమె భుజంమీద చేయి వేయబోతూ.

"తలుపు...." అందామె చప్పున వెనక్కుతగ్గి, సిగ్గుతో.

మాధవరావుకి నవ్వొచ్చింది ఆమె ఖంగారు చూసేసరికి. నెమ్మదిగా తలుపు గడియవేసి ఆమె చేయిపట్టుకొని మంచం దగ్గరకు నడిపించుకొచ్చాడు.

"కూర్చో...." అన్నాడు ఆమెకు ఎదురుగా నిలబడి.

"ఊహుఁ..." చిలిపిగా తలూపింది ఆమె.

"ఓహో....నేనే కూర్చోబెట్టాలన్న మాట". అమాంతం ఆమెను కౌగలించుకొని పైకెత్తి మంచంమీద కూర్చోబెట్టాడతను. ఆమె తప్పించుకోడానికి ప్రయత్నించి కుదరక నిస్సహాయంగా కూర్చుండి పోయింది. ఆమె పక్కనే తనూ కూర్చుని ఆమె భుజంచుట్టూ చేయివేసి తనకు దగ్గరగా లాక్కొన్నాడు మాధవరావు.

"ఎవరయినా చూస్తున్నారేమో!" సిగ్గుతో అటూ ఇటూ చూస్తూ అందామె.

"తలుపులు మూసే ఉన్నాయిగా!" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"ష్! అలా గట్టిగా మాట్లాడకండి. వినబడుతుంది వాళ్ళకి.." ఇంకా బిడియంగానే అందామె.

మాధవరావుకి నవ్వాగలేదు. మరింత గట్టిగా నవ్వేశాడు. అతని నవ్వుతో సీత మరీ సిగ్గుపడి అతనికంటుకుపోయింది. అతని గుండెల్లో ముఖం దాచేసుకొంది. ఆమె స్పర్శ అతనికి పులకింతలు కలిగించింది. గాఢంగా ఆమెను గుండెల్లో పొదవుకొని,కొద్దిక్షణాలు తన్మయత్వంతో కళ్ళు మూసుకున్నాడు. ఇద్దరి గుండెలూ ఆవేశంతో ఎగసిపడుతున్నాయి.

"ఇందాకే నాకో విషయం తెలిసింది నీ గురించి. నువ్వో రచయిత్రివటగా!" నవ్వుతూ అడిగాడతను.

ఆమె నవ్వేసింది. "అంతా వట్టిదే మీకెవరు చెప్పారలా అని?"

"అబద్ధాలు చెప్పకు, ఆడపిల్లలు పుడతారు" కొంటెగా అన్నాడతను.

"ఛీ పాడు!"

"మనకు వచ్చిన పెళ్ళి బహుమతుల్లో నీ బహుమతులు కొన్ని పుస్తకాలు వచ్చాయి.వాటిమీద 'వర్ధమాన రచయిత్రి సీతకి' అని రాశారు మీ ఫ్రెండ్స్ ఎవరో..."

"అవి మీరెప్పుడు చూశారు?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"మీవాళ్ళే ఎవరో తెచ్చి చూపించారు..."

"నేనేం రచయిత్రిని కాదు. కథలు రెండు మూడు రాశానుగానీ అందులో ఒకటితప్ప మిగతావి అచ్చవనే లేదు".

"ఏమయినా నువ్వు రచయిత్రివేగా! మరి నాకా కథలు ఎప్పుడు చూపిస్తావ్?"

"మీకూ కథలు చదివే అలవాటు ఉందా?" ఆనందంగా అడిగిందామె.

"అలవాటు లేదుగానీ నీకోసం అలవాటు చేసుకొంటాను". అతని మాటలతో ఆమె మరింత సంతోషపడిపోయింది.

"మీరెన్నైనా చెప్పండి! నేను రచయిత్రిని కాలేనని నాకు నమ్మకం. నాకు కథ రాయడంవస్తే రాసినవన్నీ ఎప్పుడో ప్రచురించేవారు. ఇప్పటికి మరింకెన్నో రాసి ఉండేదాన్ని".

"అలా ఎందుకనుకోవాలి? మన మాగజైన్లు నీస్థాయికి ఎదగలేక పోయాయని ఎందుకనుకోకూడదు?" వ్యంగ్యంగా అన్నాడతను.

ఆ విషయం ఆమె ఇట్టే గ్రహించేసింది.

"మీరు నన్ను హేళన చేస్తున్నారు కదూ?" నవ్వాపుకొంటూ అడిగింది.

"అంత ధైర్యమా నాకు!"

ఆమె నవ్వేసింది.

"నువ్వు ఎలాంటి కథలు రాస్తుంటావు?"

"అంటే?"

"ప్రేమ కథలా, త్యాగాల కథలా, ఎక్స్ప్లాయ్టేషన్ కథలా, అడుక్కు తినేవాళ్ళ కథలా?" ఆమె నవ్వేసింది "ప్రేమ కథలే రాయడం ఇష్టం నాకు! అవే బావుంటాయ్ రాయడానికి! చాలా తేలిక కూడా!"

"ఓహో..." అర్థమయినట్లు అన్నాడతను.

"ఇంక నా కథల గురించి మాట్లాడితే నేను జవాబివ్వను..." నెమ్మదిగా అందామె.

"అరె! అదేమిటి?"

"అవును! లేకపోతే ఏమిటి? నేను ఓ పెద్ద రచయిత్రినన్నట్లు మాట్లాడతారు?" చిరుకోపంతో అందామె.

"అమ్మాయి గారికి కోపం వస్తోందన్న మాట...అంతేనా?" కోపంలో మరింత అందంగా మారిన ఆమె ముఖాన్ని చటుక్కున తన రెండు చేతుల్తో దగ్గరకు లాక్కుని పెదాలమీద ముద్దుపెట్టుకొన్నాడతను. ఆమె నెమ్మదిగా వెనక్కు జరిగింది పెదాలు తుడుచుకొంటూ.

"నీకో విషయం చెప్పనా? చక్కనమ్మ చిక్కినా అందమేనంటారు గుర్తుందా? నీలాంటి అందమయిన అమ్మాయి ఏ పని చేసినా బాగానే ఉంటుంది, మరింక కథలు మాత్రం ఎందుకు బావుండవు? ఇప్పుడు కాకపోతే మరికొద్ది రోజులు పోయాక వాళ్ళే ప్రచురించుకొంటారు! సరే-ఇంక ఆ గొడవ వదిలేద్దాం! ఈ రాత్రి మనం కబుర్లు చెప్పుకొంటూ కాదు గడపాల్సింది..." అంటూ ఆమెను అమాంతం కౌగలించుకొని తన మీదకు లాక్కుంటూ వెనక్కు ఒరిగిపోయాడతను. మిగిలిన రాత్రంతా ఆమెతో చెప్పాలనుకొన్న మాటలెన్నో చెప్పకుండానే గడచిపోయింది.





* * *

ఉదయానికి ఇంచుమించుగా బంధువులంతా వెళ్ళిపోయారు. మాధవరావుకి తల్లీ తండ్రీ సర్వస్వమూ అయిన అత్తయ్య, మామయ్య మాత్రం మిగిలారు.

"ఈ ఇల్లు ఏమాత్రం బావుందలేదనీ, ఇంకెవరిదయినా కొంచెం పెద్ద ఇల్లు విడిదిగా తీసుకొని వివాహం జరిపించమంటే విన్నారు కాదు వాళ్ళు. పెళ్ళికూతురు అమ్మమ్మ కోరికట — తన మనవరాలి పెళ్ళి ఈ ఇంట్లోనే జరగాలని..." మాధవరావుకి ఇబ్బంది కలిగిందేమోనని నొచ్చుకుంటూ అన్నాడు సంజీవయ్య. "పోనీలే మామయ్యా! రెండు మూడు రోజులేగా! ఆ తర్వాత ఇక్కడికి రావాల్సిన అవసరం మాత్రం ఏముంటుంది గనుక! ఈ రెండు రోజులూ ఎలాగోలా సర్దుకొంటేసరి..." ఆ విషయం తేలిగ్గా తీసి పారేస్తూ అన్నాడు మాధవరావు.

"అవునవును! అంతే ..." తనూ సంతృప్తి పడుతూ అన్నాడాయన.

"అయినా మనం చూసింది ఇంటినీ, ఇంటివారినీ కాదుగా! అమ్మాయ్ మనకు అన్ని విధాలా నచ్చింది. మెట్రిక్ పాసయింది. మరీ పల్లెటూరి వాతావరణంలో పెరిగింది కూడా కాదు. గత అయిదారేళ్ళుగా గుడివాడలో వాళ్ళ అక్కయ్య వాళ్ళింటిదగ్గర గడిపింది. కనుక కొంతయినా పట్నం జీవితం గురించి తెలిసే ఉంటుంది. ఆ అలవాట్లూ, ఆ అభి

రుచులూ వేరు కదా ! ఇప్పుడు నీతో హైద్రాబాద్ వచ్చేసినా ఆ అమ్మాయి కంతగా తేడా కనిపించదు. నీకు అన్ని విధాలా అనుకూలవతి అయిన భార్యను తేగలిగామన్న సంతృప్తి మాకు వుందిప్పుడు..."

మాధవరావు మేనమామ వంక అప్యాయంగా చూశాడు.

అతని కళ్ళ ముందు సీత రూపం మెదిలింది. సీత గురించి మిగతా విషయాలేమీ తనకు తెలీవు. తనకు తెలిసిన విషయం ఒక్కటే! ఆమె కళ్ళల్లో విపరీతమయిన ఆకర్షణ వుంది. ఆ కళ్ళల్లోకి చూసిన వారెవరయినా చలించక మానరు. అంతటి ప్రమాదకర మయిన ఆకర్షణ అది. మొదటిచూపులోనే పూర్తిగా ఆమెకు వశుడయి పోయాడు తను. కట్నం తీసుకోకుండా వివాహం చేసుకొనే వాడికే అలాంటి అదృష్టం లభిస్తుంది. వాళ్ళు బీదవాళ్ళు. కట్నం ఇవ్వలేరని తనకుతెలుసు. అదికూడా తన అదృష్టమే! తనలాంటి కట్నం తీసుకోని యువకులకే ఈ అవకాశం ఉంటుంది. మరొకరికి సాధ్యం కాదు.

ఈ విషయంలో తను నిజంగా అదృష్ట వంతుడే! తల్లీ, తండ్రీ, తోబుట్టువులూ, ఆస్తిపాస్తులూ,- ఏమీలేని తనలాంటి నెలకు మూడొందలు సంపాదించుకొనే గుమాస్తాకి మరి సీత లాంటి చదువూ సంధ్యా, అందం చందం ఉన్న ఆడపిల్ల భార్యగా లభించడం అదృష్టం కాదూ?

మధ్యాహ్నం భోజనం చేశాక తిరిగి సీతతో ఒంటరిగా మాట్లాడే అవకాశం కలిగిందతనికి.

"నీతో చాలా మాట్లాడాలి సీతా! అసలు రాత్రే ఎన్నో విషయాలు చెప్పాలను కొన్నాను కాని..." సీత సిగ్గుపడి పోయింది. "అమ్మో! ఇప్పుడు మీతో మాట్లాడుతూ ఈ గదిలో కూర్చొమంటారా? ఇంకేమయినా ఉందా? అంతా నన్ను ఎగతాళి పట్టించేస్తారు..."

"ఈ మాత్రానికేం?" నవ్వాపుకొంటూ అడిగాడు మాధవరావు.

"ఇవాళ రాత్రంతా మీ దగ్గరే కూర్చుని మీరుచెప్పే కబుర్లన్నీ వింటాను. సరేనా?" గదిలో నుంచి బయటకు పారి పోడానికి సంసిద్ధురాలవుతూ అందామె.

మాధవరావు ఇంక చేయగలిగిందేమీ లేకపోయింది.

- ఆ రాత్రి కూడా ఆమె గదిలోకొచ్చే సరికి పదకొండయి పోయింది. అప్పటికే మాధవరావుకి మాగన్నుగా నిద్ర పట్టింది కూడా.

ఆమెచెయ్యి నుదుటిమీద పడగానే తక్కున మెలకువ వచ్చింది అతనికి.

"ఇప్పటిగ్గాని పొద్దుగూక లేదన్న మాట మీకు?" వ్యంగ్యంగా అన్నాడతను.

"మీకు తెలీందేముందీ? మా అమ్మా నాన్నల కయితే చెప్పొచ్చుగాని, చాదస్తం అతిగా ఉన్నవాళ్ళు ఎక్కువయి పోయారు మా బంధువుల్లో..." నెమ్మదిగా అందామె. తను లేవకుండానే ఆమెను కూడా తనమీదకు లాక్కొన్నాడతను. పూర్తిగా అతని మీదకు ఒరిగి పోయింది సీత.

"ఇప్పుడు చెప్పండి, మీరు చెప్ప దలుచు కొన్నవన్నీ..." రహస్యంగా మాట్లాడు తున్నట్లు అందామె, గొంతు మరీ తగ్గించి.

"నువ్వు గట్టిగా మాట్లాడినా ఎగతాళి

పట్టిస్తారా మీ వాళ్ళు?"

సీత నవ్వాపుకొంది "మీకు తెలీదు. మన మాటలన్నీ పొంచి ఎవరయినా వింటూంటారని నాకు అనుమానం..."

"మరేంఫరవాలేదు. విననీ! వాళ్ళకే విసుగుపుట్టి పోతారు..." చిరాగ్గా అన్నాడు మాధవరావు. గట్టిగా మాట్లాడ్డానికి కూడా ఇలా అడ్డంకులు రావడం అతనికి కోపం కలిగించింది.

"ఎల్లుండి మీ ఊరు వెళ్ళాలట కదా మనం?" అడిగింది సీత.

"అవును! మా మామయ్య వాళ్ళింట్లో కొన్ని రోజులు గడపాలి కదా..."

"మరి... మనం... హైదరాబాద్ వెళ్ళేదెప్పుడు?" సంశయంగా అడిగిందామె.

"ఏం ? త్వరగా వెళ్ళిపోవాలని ఉందా ?" నవ్వుతూ అడిగాడు మాధవరావు.

"ఛీ! అది కాదండీ!..." సిగ్గుపడి పోయిందామె.

"శలవు సరిగ్గా పదిరోజులుందింకా పదిరోజుల తరువాత ఎకాఎకిని హైదరాబాద్ వెళ్ళిపోవడమే. ఇల్లుకూడా సిద్ధంగాఉంది. వచ్చేముందే ఒక చిన్న ఇల్లు వెతికి అడ్వాన్సుకూడా ఇచ్చేశాను. ఇల్లు మరీ చిన్నదనుకో ! ఒక గది,వంటిల్లు అంతే. ప్రస్తుతానికి మనకది చాలు కదా! దానికే బోలెడు అద్దె!..."

సీత ఆనందంగా వింటోందతను చెప్పే విషయాలు. అతన్తో హైద్రాబాద్‌లో సంసారం చేయబోతోంది అన్న ఊహే చాలా మధురంగా ఉందామెకు. అంతకు ముందు ఒకే ఒకసారి హైదరాబాద్ చూసిందామె. బందరు హైస్కూల్లో నైన్త్ చదువుతున్నప్పుడు, క్లాసు పిల్లలందరూ కలసి టూర్ వెళ్ళారక్కడికి. ఎంతో అందంగా కనిపించిందా నగరం ఆమెకి. ఆ రోజునుంచీ హైదరాబాద్ నగరంలో ఉండే అదృష్టం కలిగితే బావుండునని కోరుకొంటూనే ఉంది. తనను చూడ్డానికి మాధవరావు వచ్చినప్పుడు, అతను హైదరాబాద్‌లోనే ఉద్యోగం చేస్తున్నాడని తెలుసుకొని సంబర పడిపోయింది. అతనికి తను నచ్చేట్లు చేయమని దేవతలకు మొక్కుకొంది. ఏ దేవతలు కరుణించారోగాని ఆమె కోరిక నెరవేరింది.

"నాకున్న బాధ్యతల గురించే నీతో మాట్లాడాలను కొన్నాను సీతా! మా అమ్మా నాన్నా నా చిన్నప్పుడే పోయారనీ, మా మావయ్యా, అత్తయ్యే ఆరోజు నుంచీ నాకు తల్లిదండ్రులయి నన్ను పెంచి పెద్ద జేశారనీ నీకు తెలిసే వుంటుంది. నాకు ఈ చదువూ సంధ్యా చెప్పించడంతో అసలే అంతంత మాత్రంగా ఉన్న మావయ్య ఆర్థిక పరిస్థితి మరింత దిగజారి పోయింది. ఇంటి చుట్టూ బండెడు అప్పులు, వీటికి తోడు పెరుగుతోన్న పిల్లలు. వరుసగా మూడేళ్ళు వ్యవసాయంలో నష్టపోయాడు. ఈ పరిస్థితుల్లో వివాహం చేసుకోవడం నాకిష్టం లేక పోయింది. వివాహం చేసుకొంటే మామయ్యకు ఆర్థికంగా ఎక్కువతోడ్పాటు ఇవ్వలేనేమోనని నా భయం. కానీ నిన్ను చూశాక నా అభిప్రాయం మార్చేసుకొన్నాను."

"ఎందుకనో?" చిలిపిగా అడిగింది సీత.

"నువ్వు నాకు ఎంతగానో నచ్చావ్ సీతా! ఇంతటి అందగత్తెను నేను ఇప్పుడు కాదంటే మరొకరి సొత్తయి




పోతుందేమోనన్న భయం. అదిగాక నాకెందుకో అనిపించింది, మామయ్య కుటుంబానికి నేను చేయగల సహాయంలో నీవూ తప్పక తోడ్పడగలవని! నీఅందం లాగానే నీ మనసు కూడా ఎంతో గొప్ప దని నా ఊహ! నేనేమీ తప్పుగా అనుకో లేదు కదూ?"

"మీరెలా చెప్తే అలా! మీ కేనాటికీ కాదని చెప్పను..." నెమ్మదిగా అంది సీత.

"ఊహూ! అలా మొగుడు చెప్పిన ఏమాటా కాదనకుండా పడివుండటం కూడా నా కిష్టం లేదు. నీకు నచ్చని విషయాలు నచ్చలేదని చెప్పెయ్యాలి. అప్పుడు మనిద్దరం చర్చించుకొని, ఎవరు సరయిన మార్గాన ఉన్నారో, వారిని సమర్థించాలి. ఎప్పుడూ భర్త చెప్పినట్లే భార్య నడుచుకోవాలని నేననుకోను. కొన్ని విషయాల్లో భార్య భర్తకంటే తెలివిగా ఆలోచించవచ్చు. అలాంటప్పుడు ఆమెని అనుసరించడం అతని న్యాయం" సీత నవ్వేసింది.

"ఏమో! నేనీ విధంగా ఎప్పుడూ ఆలోచించలేదు. మా అమ్మ నాన్న ఎలా చెప్తే అలా నడుచుకొనేది. మా అక్కా అంతే! ఆమెకు బావ చెప్పిందే వేద వాక్యం. మగాళ్ళు లేకపోతే వాళ్ళ జీవితాలే ముగిసిపోతాయేమో అనిపించేది నాకు. వాళ్ళ ప్రభావంవల్లే నాక్కాబోయే భర్త ఎలా శాసిస్తే అలా నడుచుకో వాలని ఏనాడో నిశ్చయించుకొన్నాను"

"మీ ఇల్లేకాదు. నూటికి తొంభై కొంపలింతే! ఈ గొడవ వదిలెయ్‌గానీ ఇంత మీ ఇంటి విషయాలు చెప్పు!..." అడిగాడతను.

"ఏమున్నాయనీ..." సిగ్గుపడుతూ అందామె.

"ఏమీ లేకపోవటమేమిటి? ప్రతి ఇంటికీ ఓ కథ ఉంటుంది మనదేశంలో. మీ ఇంట్లో మీకు ఎలాంటి సమస్యలూ లేవా?"

సీత కొద్ది క్షణాలు ఆలోచించింది.

"ప్రత్యేకంగా ఏమీలేవు. చిన్నచిన్న వేమయినా ఉన్నా అవన్నీ డబ్బు లేక పోపడంవల్ల తలెత్తినవే. ఆర్థికంగా చితికి పోయిన కుటుంబం మాది. పిల్లలెక్కువ, నాన్నగారి ఆదాయం తక్కువ. అంతే! అందుకే ఇద్దరు తమ్ముళ్ళు, చెల్లాయ్‌కీ చదువూ సంధ్యలు సరిగ్గా లేవు..."

"వాళ్ళకి కొద్దో గొప్పో సహాయం చేయాలని నీకు లేదా?" సందేహంగా ఆమె వంక చూస్తూ అడిగాడతను.

"పుట్టింటికి సహాయం చేయాలని ఏ స్త్రీ కుండదు? కాని అవన్నీ ఎలా సాధ్య మవుతాయ్? ముందు మన సంగతి. తరు వాత మీ మావయ్యగారి పిల్లలను చూడా ల్సిన బాధ్యత ఒకటి మీమీద ఉందిగదా?" ఆమె ఆలోచనా విధానం మాధవరావుకి లోలోపల ఆనందం కలిగించింది. ఇదే, ఇలాంటి అర్థం చేసుకొనే భార్యే కావా లని కోరుకొంటూ వచ్చాడు తను. అందం, మనసూ- రెండు సాధారణంగా ఒకచోట ఉండవని తన నమ్మకం. కాని తన భార్య విషయంలోనే తన సమ్మకం తప్పని ఋజువయి పోయింది.

"ఫరవాలేదు సీతా! మనచుట్టూ ఉన్న వాళ్ళందరకూ మనకు చేతనయినంత సహాయం చేద్దాం! అందులో 'నీ,నా' అనే తేడాలు నాకు లేవు. సరేనా?"

తలూపిందామె.

సంతృప్తిగా ఆమె నుదుటి మీద చుంబించి మరింత గాఢంగా తనకేసి

ఆమెను హత్తుకొన్నాడతను.

ఆ పది రోజులు పది క్షణాల్లా గడిచి పోయాయి వారికి.



## 2

ఆ రాత్రే హైద్రాబాద్ ప్రయాణం.

సీత తల్లిదండ్రులు కూడా రైల్వే స్టేషన్ కొచ్చారు ఆమెను సాగనంప డానికి. సీత వెళ్ళి పోతోందన్న బాధ వారి కంతగా లేదు. గతకొద్ది సంవత్సరాలుగా ఆమె అక్కగారింటి దగ్గరే ఉండి చదువు కోవడం మూలాన ఆ ఎడబాటు అలవాటయి పోయింది. అదీ గాక గుండెల మీద కుంపటిలా ఎదిగిన కూతురికి అడిగినంత కట్నం ఇచ్చి వివాహం చేయగలమో, లేదో నన్న భయం ఆమె మీద అనురాగాన్ని చాలా వరకు తగ్గింప జేసింది.

సీతక్కూడా తన తల్లిదండ్రుల్ని వదిలి వెళ్తున్నానన్న బాధ అంతగా లేదు. ఆమె ఆలోచనలన్నీ హైద్రాబాద్ మీదే ఉన్నాయి. అక్కడ ఓ అందమయిన ఇంట్లో తనూ, అతనూ—షికార్లు, సినిమాలు, హోటళ్ళు - ఒకటేమిటి, తను కలలు కన్న జీవితంలోకి అడుగిడ బోతోంది. అంత వరకూ తను అనుభవించిన బీద తనానికి గుడ్‌బై చెప్పేస్తోంది. తనకు నచ్చిన చీరలూ, తినాలనుకొన్న వంటకాలూ, చూడదల్చు కొన్న ప్రదేశాలూ - అన్నిటినీ అనుభవించ బోతోంది.

"సామాన్లన్నీ ఓ సారి లెక్కబెట్టు కోండి. హైద్రాబాద్‌లో దిగేప్పుడు సరి చూసు కొందురుగాని..." అన్నాడు సంజీవయ్య.

మాధవరావ్ స్వయంగా అన్నీ లెక్కించడం ప్రారంభించాడు.

ఒక కావిడి పెట్టె, రెండు సూట్ కేసులు, రెండు పచ్చడి జాడీలు, ఇంకేవేవో సామాన్లున్న అట్ట పెట్టెలు, బిందెలు మొత్తం పదిహేనున్నాయ్.

అసలు వాళ్ళతోపాటు అతని మేన మామ వాళ్ళు కూడా బయల్దేరాలను కొన్నారు. కానీ వాళ్ళందరికీ ఛార్జీలు అనవసరపు ఖర్చు అని ఆలోచించి ఆ ఆలోచన విరమించుకొన్నారు. అందుకు మాధవరావు కూడా మద్దతు ఇచ్చాడు.

గంట ఆలస్యంగా రైలు వచ్చి ఆగింది ప్లాట్‌ఫారం మీద.

"అదిగో అదే హైద్రాబాద్ కారేజ్..." ఎదురుగా ఆగిన స్లీపర్ కోచ్ వంకచూపుతూ అన్నాడు సీత తండ్రి. అందులోనే రిజర్వేషన్ చేయించాడు మాధవరావు. మరు క్షణంలో సామాన్లన్నీ పెట్లో తమకు కేటాయించిన బెర్తులకింద సర్దేశారు. సీత, మాధవరావులు కిటికీ దగ్గర ఎదురెదురుగా కూర్చున్నారు.

"వెళ్ళగానే ఉత్తరం రాయి!..." అన్నాడు సంజీవయ్య.

"అలాగే..." అన్నాడు మాధవరావ్.

"డబ్బు కిబ్బంది కలుగుతే ఉత్తరం రాయి! అంతేగాని అమ్మాయిని ముందే కష్టాలు పెట్టకు." తిరిగి అన్నాడతను.

మాధవరావుకి మేనమామ మీద అభిమానం పొంగిపొరలింది. కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయ్.

ఇప్పుడేకాదు. ఎప్పుడూ ఇదేమాట! తను ఎన్ని కష్టాల్లో ఉన్నా, ఎన్ని ఇబ్బందులు పడుతున్నా మేనల్లుడు మాత్రం సుఖంగా ఉండాలి. ఎంత మందికి దొరుకుతారు ఇంతటి మంచి మనసున్న మామయ్యలు ?

"అలాగే మామయ్యా..."

రైలు కూత వేసింది. అంత వరకూ గంభీరంగా ఉన్న సంజీవయ్య ఇక తట్టుకోలేక పోయాడు. తన కొడుకు కాకపోయినా కొడుకుకంటె ఎక్కువగా చూసుకున్నాడు మాధవరావుని. ఎన్నో కష్టనిష్ఠూరాలు భరించి అతనికి ఏలోటూ లేకుండా చదువు సంధ్యలు చెప్పించాడు. ఉద్యోగస్తుడిని చేశాడు. ఇప్పుడు ఓ ఇంటి వాడిని చేశాడు. ఇక్కడితో తను తీసుకొన్న బాధ్యత ముగిసింది, తన చెల్లెలు కొడుకు కాబట్టి అంతటి బాధ్యత తీసుకోక తప్పిందికాదు. తన భార్య మీనాక్షికది ససేమిరా నచ్చలేదు. "మన పరిస్థితే అంతంత మాత్రంగా ఉంది. ఇంక ఇదోగోడవెందుకు" అంటూ తన వ్యతిరేకతను [illegible]జేసిందిగాని తను ఆమె మాటలు ఖాతరు [illegible]య్యలేదు. కొన్ని రోజులు ఇంట్లో ఘర్షణలూ, వివాదాలు చెలరేగినయ్. చివరకు ఆమే తల ఒగ్గక తప్పిందికాదు. ఈ విషయాలన్నీ మాధవ రావు కూడా తెలుసు. తన మామయ్య తీసుకొన్న బాధ్యత వృధా కాకూడదన్న పట్టుదలతో చదివాడు, ఉద్యోగం సంపాదించుకొన్నాడు. తన శక్తినంతా ధార పోసి మామయ్య కుటుంబాన్ని ఆదు

కోవాలని, ఆ విధంగా తన కృతజ్ఞత తెలియజేసుకోవాలని నిశ్చయించుకొన్నాడు. తనకోసం అత్తయ్యనుకూడా నొప్పించిన మామయ్య, గర్వంగా తలెత్తుకు తిరిగేలా ఆ కుటుంబానికి సహాయం చేసే బాధ్యత తనకుందని నమ్మాడు. ఇంతవరకూ అలాగే చేస్తూ వచ్చాడు.

రైలు కదిలింది.

సంజీవయ్య పైపంచతో కన్నీళ్ళు తుడుచుకొన్నాడు. అది గమనించి మాధవరావుకూ్కడా కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయ్. సీత గమనించకుండా వెంటనే రుమాలుతో కళ్ళు తుడిచేసుకొన్నాడు.

రైలు ఆ ఊరు వదిలేసి చీకట్లోకి జొరబడింది.

మాధవరావు కింద బెర్తులమీద ఇద్దరకూ పక్కలు పరిచాడు. సీతపడుకోకుండా కిటికీలోనుంచి చీకట్లోకి చూస్తూ కూర్చుంది.

"నిద్రరావటంలేదా సీతా !" నెమ్మదిగా అడిగాడతను.

"ఊహు, నేనిలా రాత్రుళ్ళు రైలు ప్రయాణం ఎప్పుడూ చేయలేదు. అంచేత కొత్తగా ఉంది" నవ్వుతూ అందామె.

"మరేం ఫరవాలేదు. పడుకో ! నీకు తెలీకుండానే నిద్రపట్టేస్తుంది ... " పడుకొంటూ అన్నాడతను.

చిన్నగా నవ్వి తనూ పక్కమీదకు ఒరిగిందామె.

రాత్రి రెండు గంటలవరకూ నిద్ర పట్టలేదామెకు. లేచి కూర్చుందామను కొంది గానీ పై బెర్తులమీద ఎవరో నిద్రపోతూండడంతో లేవడం కుదర్లేదు.

ఒకటి రెండుసార్లు మాధవరావు లేచి "ఏమిటి, ఇంకా నిద్రపోలేదా?" అనేసి తను మళ్ళీ నిద్రలో మునిగిపోయాడు.

చివరకు తెల్లారు ఝామున నిద్ర పట్టిందామెకు. మెలకువ వచ్చేసరికి పూర్తిగా తెల్లారిపోయింది. బయట 'కాఫీ, టీ' వాళ్ళ కేకలు వినబడుతున్నాయి. ఎదురుగ్గా మాధవరావు అప్పటికే లేచి కూర్చుని పేపరు చదువుతూ కనిపించాడు. సిగ్గుతోలేచి అతని పక్కనే కూర్చుందామె.

"నిద్ర అయిపోయిందా ?" నవ్వుతూ అడిగాడతను.

"తెల్లారిపోయినా నన్ను లేప లేదేం?" చిరుకోపంతో అడిగింది.

"హైదరాబాద్ చేరుకొనేసరికి ఇంకో అరగంట పడుతుందెలాగూ ! ఇప్పుడే లేపడ మెందుకని ఊరుకున్నాను..."

"ఇదేమి స్టేషను ?" బయటకు చూస్తూ అడిగిందామె.

"సికింద్రాబాద్... అందుకే మన పెట్టంతా ఖాళీ అయిపోయింది..."

సీత పక్కబట్టలన్నీ సర్ది బెడ్డింగ్ చుట్టేసింది.

సామానంతా మరోసారి లెక్కచూశాడు మాధవరావు. అన్నీ సరిగ్గానే ఉన్నాయి. బండి హైదరాబాద్ చేరుకొనేసరికి టైము ఏడయి పోయింది.

సామానంతా ఇద్దరు కూలీల కిచ్చి బయటకు వచ్చారిద్దరూ. టాక్సీ మాట్లాడి అందులో కూర్చున్నారు. విశాలమయిన వీధుల్లోంచి టాక్సీ వెళ్తోంటే ఆనందంతో ఉప్పొంగి పోయింది సీత. తనిప్పుడు హైదరాబాద్ నివాసిని. టాక్సీ కొద్ది నిమిషాలకి ఓ ఇరుకు సందులోకి ప్రవేశించింది. సీత కొద్దిగా నిరుత్సాహ




పడింది. అంతకు ముందు రోడ్ల కిరు వైపులా చూసిన అందమయిన భవనా లన్నీ ఆమె తాము ఉండబోయే భవం తులుగానే ఊహించుకొంటోంది. అంద మైన భవనం, ఛుట్టూ విశాలమయిన ఆవరణ, పూల మొక్కలు — తమదీ అలాంటి ఇల్లే అయివుంటుందని అను కొంది. తీరా టాక్సీ సందులో అన్నీ పెంకుటిళ్ళు, పాత మేడలూ అవడంతో ఆమెలో అసంతృప్తి చోటు చేసుకుంది. రోడ్డుకి ఓ పక్కగా సన్నని మురికి కాలువ.

"ఇక్కడ ఆపు..." టాక్సీ అతన్తో చెప్పాడు మాధవరావు పక్కనే ఉన్న పెంకుటిల్లు చూపుతూ.

ఆ ఇల్లు చూస్తూనే సీత పూర్తిగా నిరుత్సాహ పడిపోయింది. ఆమె ఊహ లకూ ఆ యింటికీ మరీ నక్కకి నాగ లోకానికీ ఉన్నంత తేడా వుంది. వరుసగా కోళ్ళ గూడుల్లా నాలుగయిదు ఇళ్ళున్నాయి ఆవరణలో.

టాక్సీ దిగి తలుపు తెరచి పట్టు కున్నాడు మాధవరావు. దిగి నుంచుంది సీత. టాక్సీ ఆగటం చూసి మిగతా ఇళ్ళల్లోంచి పిల్లలంతా పరుగున వచ్చి టాక్సీ చుట్టూ మూగారు.

కాంపౌండ్లోకి నడిచి మూసి ఉన్న పెంకుటింటి తాళం తీసి సామానంతా, ఇంట్లోకి చేర్చాడు మాధవరావు. సీత లోపలికి నడిచి అయోమయంగా దిక్కులు చూడసాగింది!

ఒకే ఒక్క గది - వెనుక బొమ్మ రిల్లు లాంటి వంటిల్లు! అంతే! ఇది ఇల్లా? ఈ దిక్కుమాలిన ఇంట్లో తను జీవితం గడిపేయాలా? ఇంత కంటే నరకం ఇంకేమయినా ఉంటుందా? తన భర్త మరీ ఇంత అధ్వాన్నపు కొంప ఎందుకు తీసుకున్నట్లు? బహుశా కారు చవకయి వుంటుంది. ఏదేమయినా వీలయినంత త్వరలో ఈ ఇల్లు వదిలే యాలి. తాముండబోయే ఇల్లు తానూ హించు కొన్నంత అందంగా లేక పోయినా కనీసం తన ఊహలకు దగ్గరగా నయినా ఉండాలి.

"ఎలా వుంది సీతా ఇల్లు" నవ్వుతూ అడిగాడు మాధవరావు.

జవాబు చెప్పకుండా నవ్వి ఊరు కొంది సీత.

"పైపు ఆ చివరి ఇంటి ముందుంది ఈ ఆవరణలోని అయిదు కుటుంబాలకూ అదొక్కటే పంపు ... అది సరేగానీ నువ్వు త్వరగా రెడీ అవుతే అలా హోటల్ కెళ్ళి ముందు కాఫీ, టిఫినూ కానిచ్చి వద్దాం! వంట సంగతి తర్వాత చూసుకోవచ్చు..." తనూ రెడీ అవుతూ అన్నాడు మాధవరావు.

అయిష్టంగానే బట్టలు మార్చుకొంది సీత. ఈలోగా మాధవరావే ఓ బిందెతో నీళ్ళు తీసుకొచ్చి వంటింట్లో ఉంచాడు. దానినానుకొనిఉన్న బాత్రూమ్లో ఇద్దరూ మొఖం కడుక్కొన్నారు. త్వరగా తల దువ్వుకొని చీర మార్చుకొంది సీత

ఇద్దరూ ఇల్లు తాళంవేసి రోడ్డు మీద కొచ్చారు. ఆ సందులో నుంచి ఫర్లాంగు దూరం నడిస్తేగాని మెయిన్ రోడ్డు చేరు కోలేక పోయారు. టాక్సీలో రావడం మూలాన అంతదూరం కనిపించలేదు పొద్దున. మెయిన్ రోడ్లో పక్కనే ఉన్న ఓ హోటల్లోకి నడిచి ఫామిలీ రూమ్లో కూర్చున్నారు. కాఫీ, టిఫినూ

ముగించి మళ్ళీ ఇల్లు చేరుకునే సరికి టైము తొమ్మిదిన్నరయి పోయింది.

సామాన్లన్నీ త్వర త్వరగా సర్దేశాడు మాధవరావు. గోడ కానించి ఉన్న మంచం వాల్చి దానిమీద తాము తెచ్చిన పరుపు పరిచాడు. బెడ్డింగ్‌లో నుంచి దిళ్ళు, దుప్పట్లు తీసి పక్క వేశాడు. సీత అది తన ఇల్లు కానట్లే అతను చేసేదంతా నిర్లిప్తంగా చూస్తూ కూర్చుండి పోయింది.

ఇల్లంతా ఓకొలిక్కి వచ్చాక అతను సీత వేపు చూశాడు. ఆమె అలాగే గోడ కానుకొని తనవంకే చూస్తుండటం గమనించి ఆమె దగ్గరకు నడిచాడు. ఆమె ముఖాన్ని రెండు చేతుల్తోనూ పట్టుకొని నెమ్మదిగా ఆమె పెదాల మీద చుంబించాడు. చటుక్కున అతనికి దూరంగా జరిగింది సీత అటూ ఇటూ భయంగా చూస్తూ.

"ఇక్కడ మనని కనిపెట్టే వాళ్ళెవ్వరు లేర్లే! ఆ భయమేం అక్కర్లేదు. అది సరేగాని ఏమిటలా 'డల్' అయి పోయావ్? ఈ వాతావరణమేమీ నచ్చలేదా ఏమిటి ఖర్మ?" నవ్వుతూ అన్నాడతను.

సీత మాట్లాడలేదు.

అమాంతం ఆమెని రెండు చేతులోనూ గాలిలోకి లేపి ఎత్తుకెళ్ళి మంచం మీద పడుకోబెట్టాడు. తనూ మంచం మీదే కూర్చుని ఆమె లేవకుండా రెండు చేతులూ అడ్డం పెట్టాడు.

"నన్ను లేవనీండి..." బతిమాలుతున్న ధోరణిలో అందామె.

"ఊహూ! నువ్వేం ఆలోచిస్తున్నావో చెప్పేవరకూ నువ్విలా కదలకుండా పడుకొని ఉండాల్సిందే"..

"బావుంది! నా కేం ఆలోచనలుంటాయ్? అబద్ధ మాడేసింది.

"ఏమీ లేకపోతే, ఏం మాట్లాడవేం మరి?"

"ఏముందని మాట్లాడడానికి?"

"నువ్వేం ఆలోచిస్తున్నావో నేనే చెప్తాను! సరేనా?"

"చెప్పండి చూద్దాం..." నవ్వాపుకొంటూ అంది సీత.

"ఈ ఇల్లేమిటి, ఈ లోకమేమిటి? ఇలాంటి ఇంట్లో నేనెలా ఉండగలను? తక్షణం ఈ ఇల్లు మారిపోవాలి అనుకొంటున్నావ్ కదూ!" నవ్వుతూనే అడిగాడు.

సీత భయపడి పోయింది. తన మనసులోని ఆలోచనలన్నీ తెలిసినట్లే చెప్పేస్తున్నారేమిటీయన? ఇంద్రజాలం లాంటి దేమయినా వచ్చా ఏమిటి కొంపతీసి! ఈ మనిషితో తను జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే తన మూలాన మనసు కష్టపెట్టు కుంటారేమో!

"అదేం కాదు! నేనాలోచిస్తోంది మా వాళ్ళ గురించి! మళ్ళీ వాళ్ళను ఎప్పుడు చూస్తానా అని..." అబద్ధం చెప్పేసిందామె.

"ఓహో! ఇక్కడి కొచ్చి మూడు గంటలయినా కాలేదు, అప్పుడే గాలి తిరిగిందన్న మాట! బావుంది...."

"మీరేం వెక్కిరించనక్కర్లేదు గానీ మరో బిందెడు నీళ్ళు తీసుకురండి! నేను వంట ప్రారంభిస్తాను....."

"వంటా?—ఠ ఠ్! ఇవాళ వంట చేయడానికి వీల్లేదు. ఈ రోజంతా నీకు విశ్రాంతే! రేపు వంటకి ప్రారంభోత్సవం చేద్దాం! ఇవాళ అందుక్కావలసిన

ఏర్పాట్లన్నీ చేసుకోవాలి! మరి కాసేపాగి అలా బజారుకెళ్ళి ఓ మాంచి హోటల్లో భోజనం చేసి అక్కడి నుంచీ సాయంత్రం వరకూ మనక్కావలసిన వస్తువులన్నీ షాపింగ్ చేసుకొని తిరిగి వద్దాం! ఆ తరువాత మళ్ళీ హోటల్లో భోజనం, సెకండ్‌షో సినిమా.

ఎలావుంది ప్రోగ్రామ్ ?..."

"ఏం బావుండలేదు..." నవ్వాపుకొంటూ అంది సీత.

"బావుండలేదా ?" ఆమెకు చక్కిలిగిలి పెడుతూ అన్నాడు మాధవరావు.

మధ్యాహ్నం ఆటోలో ఆబిడ్స్ చేరుకున్నారిద్దరూ. అక్కడ ఓ ఖరీదయిన హోటల్లో భోజనం చేశారు. అచ్చం తను సినిమాల్లో చూసినహోటల్లా కనిపించింది సీతకది. ఆ హోటల్లో భోజనం చేస్తున్న మిగతా స్త్రీల కట్టు బొట్టులూ, ఖరీదయిన చీరలు అన్నీ ఆమె దృష్టిని అమితంగా ఆకర్షించాయి. వాళ్ళతో పోల్చుకొంటే తను ఎంతో అనాకారిలా కురూపిలా అనిపించసాగింది. తనే కాదు మాధవరావూ అంతే! ఇంకా పాతకాలం మనిషి లాగానే ఉన్నాయతని దుస్తులు. కనీసం కొంతయినా ఇద్దరిలోనూ వెంటనే మార్పు రావాలి. అందుకు తనే ప్రయత్నించాలి. రోడ్డు వెంబడి నడుస్తూ కూడా కనబడ్డ ప్రతి వస్తువునీ తమకున్న వాటిలో పోల్చి చూసుకొని నిరాశ పడుతోందామె.

సాయంత్రం అయిదయేసరికి షాపింగ్ ముగించుకొని ఇల్లు చేరుకొన్నారిద్దరూ. ఇల్లు మారాల్సిన మాట నిజమే గాని ఆ విషయం అప్పుడే మాధవరావు నడిగితే బావుండదు. ఓ నెలపోయాక దాని విషయం చూసుకోవచ్చు. అంత వరకూ ఎలాగోలా ఈ ఇంట్లోనే ఎడ్జస్ట్ అయిపోక తప్పదు అనుకొని సరిపెట్టుకొందామె.



## 3

పదిహేను రోజులు బాగానే గడచిపోయాయి మధ్యలో రెండుసార్లు ఆమెను తన స్నేహితుడు రెడ్డి ఇంటికి తీసుకెళ్లాడు మాధవరావు. రెడ్డి, మాధవరావు చిన్నప్పటి నుంచీ కలసి చదువుకున్నారు. రెడ్డి మాధవరావుతో పాటు ఇంటర్మీడియెట్‌తో చదువాపక ఇంజనీరింగ్ చదివి ఒక విదేశీ సంస్థలో ఇంజనీర్ ఉద్యోగం చేస్తున్నాడు. వస్తుతః అతను ఆస్తిపరుడు కావడంవల్ల హైదరాబాదు నగరంలో జీవితం మరింత సుఖకరమయిందతనికి. అయిదువందల అద్దెతో ఓ అందమయిన ఇల్లు తీసుకొన్నాడు. ఇంట్లో ఖరీదయిన సామాన్లు, రిఫ్రిజరేటరు, రికార్డ్ ప్లేయరు, ఓ నౌకరు— అతని దర్జా, భోగం చూసి సీత ఆశ్చర్యపోయింది. మాధవరావుకి అంత ధనికులయిన స్నేహితులుంటారని ఆ మె ఎప్పుడూ ఊహించుకోలేదు. రెడ్డి కున్న ఆ అదృష్టంలో సగం తమకుంటే తనెంత సంతోషించేది ? రెడ్డి భార్యకున్న నగలు చీరెలు కూడా ఆమెకు కళ్ళు మిరుమిట్లు కలిగించాయి. వెంటనే తమ పరిస్థితి గుర్తు

కొచ్చి కృంగి పోయిందామె. వాళ్ళకి తమకి ఎంత తేడా? ఎక్కడికి పోవాలన్నా స్కూటరు. చేతి నిండా డబ్బు, ఏ పని చేయాలన్నా చేతికింద నౌకరు–అలావుండాలి జీవితం! దాన్నే అదృష్టం అంటారు. ఏమీలేని దురదృష్ట జీవితం కొనసాగించడం కంటె, అంతం చేసుకోవడం ఉత్తమం. ఇది తన తిరుగులేని అభిప్రాయం. లేకపోతే కనీస సుఖాలు అనుభవించలేని బ్రతుకు బ్రతికీ ఫలితం ఏముంది? చివరికెలాగూ అందరూ మృత్యుదేవతకు ఆహుతి కాక తప్పదు కదా! మరి బ్రతికుండే ఈ కొద్దిరోజులూ దరిద్రం అనుభవించలేక నానాపాట్లూ పడుతూ బ్రతకడం దేనికి?

ఫస్ట్ తారీఖు సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికొస్తూనే జేబులో నుంచి కొన్ని నోట్లు తీసి సీత చేతిలో ఉంచాడు మాధవరావు.

"ఏమిటిది?" ఆశ్చర్యంగా అడిగింది సీత.

"జీతం..." చిరునవ్వుతో అన్నాడు మాధవరావు.

"అదిసరే... నాకెందుకిది!"

"నా పనల్లా నెలయ్యేసరికిజీతంతెచ్చి నీ చేతి కివ్వడం అంతే! ఆ తరవాత దాన్నెలా సరి పెట్టుకోవాలి అనేది నీ విషయం. నాకేం సంబంధం లేదు" నవ్వుతూ అన్నాడతను.

"బావుంది... నాకేం తెలుస్తుంది?" ఆలోచిస్తూ అందామె. నిజానికి అతనలా జీతమంతా తెచ్చి తనకివ్వడం, తనకే ఖర్చుచేసే అధికారం ఇవ్వడం ఆమెకు చాలా ఆనందాన్ని కలిగించింది. తను ఎలాగోలా ఎంతోకొంత కూడబెట్టి తనలో అణగారి పోతున్న కోరికలకి ప్రాణం పోసేందుకు ప్రయత్నించాలి.

"రెండు నెలలు ఖర్చుపెడితే–అదే తెలుస్తుంది."

"ఇంతకూ మొత్తం ఎంత ఇది?"

"మూడొందల తొంభయ్..."

ఆ డబ్బు తీసికెళ్ళి అల్మారాలో ఉంచిందామె. వంటింట్లోకి నడిచి స్టౌమీద కాఫీ తయారుచేసి తీసుకొచ్చి అతని కందించింది.

"సీతా! నా జీవితంలో ఇంతవరకూ ప్రతినెలా మామయ్య వాళ్ళకు రెండు వందల చొప్పున పంపుతూ వచ్చాను. అఫ్‌కోర్స్ ఇకనుంచీ అంతపెద్ద మొత్తం పంపటం కుదరదనుకో! అయినా ప్రతినెలా ఎంతో కొంత పంపితే బావుంటుంది. నీకు చెప్పాను కదా మామయ్యకు నేనెంతో ఋణపడి ఉన్నానని! ఈ విధంగా నయినా మామయ్య ఋణం తీర్చేసుకొంటే ఆనందంగా ఉంటుంది.

"మీ ఇష్టం! మీరెలాచెప్తే అలా..." చిరునవ్వుతో అందామె, పైకయితే అలా అనేసిందిగాని లోలోపల ఆలోచనలు చెలరేగుతున్నాయామెకి. ఇంటిఅద్దె అరవై రూపాయలు, కరెంటుకి, నీళ్ళకూ పది హేను, ఇదికాక ఆయన మామయ్యా గారింటికి కొంత– ఇవన్నీపోతే ఇంక తమకు మిగిలే దేముంటుందనీ? ఉన్న మొత్తం నెలంతా రేషన్‌కీ, మిగతా సరుకులకూ సరిపోతుంది. అంతే! తన చీరలకూ, సినిమాలకూ, సరదాలకూ–ఇంతే సంగతులు చెప్పేయాలి. నిజానికి మాధవరావు మేనమామ ఇకనుంచీ తనకేమీ డబ్బు పంపవలసిన అవసరం లేదని మాధవరావుతో చెప్పటం తను వింది. అయినాగాని ఇక్కడేవో ధన




రాసులున్నట్లు ఈ మనిషి ఇంకా ఎంతో కొంత పంపాలి అని పట్టు బట్టటం అవివేకం తప్పితే మరేమీ కాదు.

ఆ రాత్రంతా ఈ విషయమే ఆలోచిస్తూ గడిపిందామె. ఉదయానికి ఆమె ఆలోచనలు ఓ కొలిక్కి రాలేదు,

"నేనోమాట చెప్తాను వింటారా?" మాధవరావు కాఫీ తాగుతోంటే అందామె.

"ఎన్ని మాటలయినా సరే వింటాను..."

"ప్రతినెలా ఏ పాతికో పరకో మీ మామయ్య గారికి పంపుతూంటే- మనకేమో ఇబ్బందీ- ఆయనకేమో ఎటూ-దేనికీ చాలని మొత్తం- దీని బదులు ఎప్పుడయినా ఓ సారి కొంచెం పెద్ద మొత్తమే పంపితే ఆయనకూ ఉపయోగ పడుతుంది. మనకూ సంతృప్తి ఉంటుంది. ఏమంటారు?" భయం భయంగానే అంది.

మాధవరావు కొద్దిక్షణాలు ఆలోచించాడు. సీత మాటల్లో అనౌచిత్యం ఏమీ కనిపించ లేదతనికి. ఈ పద్ధతి అద్భుతం అనిపించింది. గత కొద్ది రోజులుగా తనూ ఆలోచిస్తున్నాడు గానీ ఈ మాత్రం ఉపాయం తనకు తట్టనే లేదు. 'సీత తనకంటె తెలివయినది' అనుకొన్నాడతను. నిజంగా ఆ విషయం అతనికి ఆనందం కలిగించింది. తన భార్య తనకంటె తెలివిగలదయితే లాభం తనకేగా! అన్ని విషయాలకూ తనే తల పగలకొట్టు కోవాల్సిన అవసరం ఉండదు.

"చాలా బాగుందిసీతా ఈ ఆలోచన! అలాగే చేద్దాం! కాని ప్రతినెలా ఎంతో కొంత దాయాల్సిన బాధ్యత మాత్రం నీదే..."

"అదంతా నేను చూసుకొంటానుగా..."తనమాట నెగ్గినందుకు సంతోషంతో పొంగి పోతూ అందామె.

ఆ సాయంత్రం అతనొచ్చేలోగా ఓ తెల్లకాగితం తీసుకొని లెఖ్ఖలురాసి కనీసం యాభై రూపాయలు మిగిలే విధంగా బడ్జెట్ తయారు చేసింది. ఆ యాభై రూపాయలు దేనికి వినియోగించాలా అని ఆలోచిస్తూ కూర్చుంది గాని ఎటూ పాలు పోవడంలేదు. ఇంట్లో లేని వస్తువులు-అవసర మయినవి- చాలా ఉన్నాయి. కాకపోతే ఏది ముందు కొనాలో ఏది తరువాతో తేల్చుకోలేక పోతోంది.

డెకోలం మంచాలు, డ్రెస్సింగ్ టేబిల్, డైనింగ్ టేబిల్, స్టీల్ అల్మారా, సోఫాసెట్, గార్డెన్ చైర్స్, రేడియో, గోడగడియారం, గాస్‌స్టవ్, స్కూటర్, రిఫ్రిజరేటర్, రికార్డ్ ప్లేయర్,- ఇవన్నీ ముఖ్యంగా తనక్కావాలి. వీటిల్లో ఏది ముందో ఏది వెనకో తనకేం తెలుస్తుంది?

సాయింత్రం ఇద్దరూ షాపింగ్‌కి బయల్దేరారు. మార్కెట్‌లో ఓ పెద్ద షాపు ముందున్న బోర్డుమీద "ఏ వస్తువయినా సులభ వాయిదాల పద్ధతి మీద మీ స్వంతం చేసుకోండి"అన్న అక్షరాలు కనిపించాయి.

"ఏమండీ! అది చూశారా?" బోర్డు వంక ఉత్సాహంగా చూస్తూ అందామె.

మాధవరావు తక్షణం బోర్డువంక చూసి "ఎందుకు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"పదండి! వాయిదాల పద్ధతి అంటున్నాడుగా! చూద్దాం అసలు..." ఆమె ఉత్సాహాన్ని భంగ పరచడం ఇష్టంలేక ఆమెతోపాటు ఆషాపులోకి నడిచాడతను.

లోపల సీత కలలు కంటున్న వస్తువులన్నీ కన్నుల పండువుగా కనిపిస్తున్నాయి. అన్నిటి ధరలూ అడుగుతూ పోతూంటే వివరంగా, ఓపిగ్గా చెప్తున్నాడు షాపు యజమాని.

"ఏమండీ అద్దండున్న ఆ డ్రెస్సింగ్ టేబిల్ తీసుకుందామండీ..." బ్రతిమాలుతున్న ధోరణిలో అందామె.

"కాని సీతా- ప్రతినెలా మనం యాభై రూపాయల చొప్పున ఎలా కట్టగలం చెప్పు?" ఇబ్బందిగా అన్నాడు మాధవరావు. నిజానికితనకి అలాంటి అలంకార వస్తువులు కొనడం అయిష్టం! కానీ సీత మనసు నొప్పించడం అంతకంటే అయిష్టం.

"మీకెందుకండీ! ఎలాగోలా నేను మిగులుస్తాగా!"

"నీయిష్టం! నీకంత ధైర్యం ఉంటే నాకేం అభ్యంతరం లేదు..."

వెంటనే యాభై రూపాయలు షాపు వాడికి కట్టేసి ఇంటి అడ్రస్ ఓ కాగితం మీద రాసి షాపు యాజమానికిచ్చిందామె.

"రేపు ఉదయం మనిషికిచ్చి పంపిస్తాను" అన్నాడతను.

ఆ రాత్రంతా ఆమె ఆ డ్రెస్సింగ్ టేబిల్ గురించే ఆలోచించింది. అదెక్కడ ఉంచాలీ, దాని సొరుగుల్లో ఏమేం నింపాల్సిందీ–

"*మనలాంటి దురదృష్ట వంతులకు* అలాంటి వస్తువులు అనవసరం సీతా! అవి ఏ అందమయిన బంగళాల్లోనో ఉండాలి గాని మనం ఉన్నలాంటి దిక్కుమాలిన కొంపల్లో కాదు. ఇలాంటి చోట

అది కూడా వెల వెలా పోతుంటుంది. అదీగాక మనకు అలాంటివి కొనుక్కునేంత తాహతు కూడా లేదు. ఈ యాభై రూపాయలయినా మామయ్యకుపంపగలిగి ఉంటే నేనెంతో సంతోషించే వాడిని..."

తన మనసులోని మాటలన్నీ బయట పెట్టాడు మాధవరావు.

సీత మనసు చివుక్కుమంది. తన కోరికల నన్నింటినీ నాశనం చేసుకొని మరొకరికి–అదీ తనకు సంబంధం లేని వాళ్ళకోసం పాటు పడాలా? అలాంటప్పుడు మరి తనని వివాహం ఎందుకు చేసుకొన్నట్లో. ఓవంట మనిషిలా ఉంచడానికా? అంటే ఇది వివాహం పేరుతో వంట మనిషిని కొనుక్కోవడమన్న మాట.

"సరే పోనీలెండి! రేపొద్దున వెళ్ళి డ్రస్సింగ్ టేబిల్ వద్దని చెప్పేసి పద్దాం! నిష్ఠూరంగా అందామె.

"కేవలం ఈ డ్రస్సింగ్ టేబిల్ గురించే నేను మాట్లాడడం లేదు సీతా! మనమున్న పరిస్థితి గురించి చెబుతున్నాను అంతే! నీ మనసు కష్టపెట్టాలనీ, నీ ఇష్టాలు గౌరవించకూడదనీ నాకు లేదు. నువ్వు కోరిందల్లా పొందేట్లు చేయడం నాకు మాత్రం ఆనందం కాదూ? భార్య సుఖపడాలనీ, అన్నివిధాల సంతృప్తి పరచాలనీ ఏ భర్త కోరుకోడు. కాని ఈ 'లేమి' మూలంగా అలాంటి వన్నీ కప్పడిపోతాయ్. లేనిపోని అపోహలు, అపార్థాలూ వెలికి వస్తాయ్. మనిద్దరం ఒకరినొకరు సంపూర్తిగా అర్థం చేసుకొనే వాళ్ళమయితే మన మధ్య ఉన్న అను

రాగాన్నీ, అనుబంధాన్నీ ఈ 'లేమి' ఏమీ చెయ్యలేదు."

సీత అతని మాటలు ముగ్ధురాలయి వింటోంది. అతని మాటల్లో ఎంతో నిజం కనిపించిందామెకి. నిజమే భార్యని సుఖపెట్టాలని ఏ భర్త అనుకోడు? తామున్న పరిస్థితుల మూలాన మాధవరావు బాధ పడుతున్నాడు. అంతే గాని తను డ్రస్సింగ్ టేబిల్ కొన్నందుకు కాదు. కానీ ఒక విషయం మాత్రం నిజం. ఈ 'లేమి' అనేది జీవితాంతం ఉండేదే. తనే వీలు చూసుకొని తనక్కావలసిన వన్నీ అమర్చుకోవాలి. అన్నీ భర్తతో చెప్పి అతని మనసు నొప్పించడం అవివేకం. హఠాత్తుగా ఆమెని తన కౌగిట్లోకి లాక్కున్నాడు మాధవరావు.

"సీతా! నా మీద కోపంగా ఉందా?" ఆమె కళ్ళల్లో కళ్ళుంచి అడిగాడతను.

"కోపమెందుకూ? మీరేమన్నారనీ ఇప్పుడు?" తేలిగ్గా నవ్వేస్తూ అందామె. మిగిలిన రాత్రి మధురంగా గడచి పోయింది వారికి.



# 4

"రేపు రెడ్డినీ, అతని భార్యనూ మనింటికి డిన్నర్‌కి పిలిచాను...." అన్నాడు మాధవరావు ఆ రోజు ఆఫీస్ నుంచి ఇంటి కొస్తూనే.

"వస్తానన్నారా?" సంతోషపడుతూ అందామె. తన డ్రస్సింగ్ టేబుల్ రెడ్డి భార్యకు చూపించాలని ఆమెకు ఎంతో కోరికగా ఉంది.

"ఓ! ఆదివారమేగా! తప్పక వస్తామన్నారు..."

ఆ క్షణం నుంచే హడావుడి పడి పోయింది సీత. ఇల్లంతా నీట్‌గా సర్దటం, డోర్‌కర్టెన్లు ఉతికి ఆరేయడం— అన్నీ—

ఆమె శ్రమ చూస్తుంటే మాధవరావుకి నవ్వొచ్చింది. తామున్న స్థితికంటె ఓ మెట్టుపైన ఉన్నట్లు కనబడాలని మనుషులు ఎందుకు ప్రవర్తిస్తారో అతని కెప్పుడూ అర్థంకాని విషయమే!

క్రింది తరగతివాడు మధ్య తరగతి వాడిలాగా కనిపించడానికి ప్రయత్నిస్తాడు. మధ్య తరగతి వాడు మరింత ఉచ్చస్థితిలో ఉన్నట్లు నటిస్తాడు. ఆపై తరగతి వాడు లక్షాధికారి లాగానూ, లక్షాధికారి కోటీశ్వరుడు లాగానూ...

మర్నాడు మధ్యాహ్నం పన్నెండింటి కల్లా స్కూటర్ మీద రెడ్డీ-అతని భార్య సుభాషిణీ వచ్చేశారు.

"ఇల్లు చిన్నదయినా బాగా నే ఉందిరా!" అన్నాడు రెడ్డి నీట్‌గా ఉన్న ఆ గదిని చూస్తూ.

"ఇదంతా మా ఆవిడ ప్రతాపంలే! రోజుకి పన్నెండు గంటలు ఇల్లు సర్దడం లోనే సరిపోతుందామెకు" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"ఈ డ్రస్సింగ్ టేబిల్ బావుంది. ఎంతకొన్నారు?" సుభాషిణి సీత నడగనే అడిగింది. గర్వంతో ఉప్పొంగి పోయింది సీత. ఈ క్షణం కోసమే అదికొన్న దగ్గర్నుంచీ ఎదురు చూస్తో

దామె.

"మూ డొం ద ల తొంభయ్" ప్రకటించిందామె.

"చాలా బావుంది. ఎక్కడ కొన్నారు ?"

"నాంపల్లి దగ్గర అదేదో షాపులో...

వచ్చినదగ్గర్నుంచీ సీత దృష్టి నాకర్షించిన విషయం సుభాషిణి కట్టుకున్న చీర. చాలా అద్భుతంగా ఉందా చీర. నల్లని రంగు మీద పచ్చని చారలు, తెల్లని పూలూ, సన్నగా పాము కుబుసంలా ఉంది. ఆ చీరగురించి వివరాలు తెలుసుకోవాలనీ. తనూ వీలయితే అలాంటి చీరని స్వంతం చేసుకోవాలనీ ఉవ్విళ్ళూరుతోందామె. భోజనాలయినాక ఆ అవకాశం రానే వచ్చింది. ఇద్దరి టాపిక్ చీరల మీదకు మళ్ళింది.

"మీ చీర చాలా బావుంది. ఎంతకు కొన్నారు?" అడిగింది సీత.

"నూట అరవై. అమెరికన్ జార్జెట్ ఇది" అంది సుభాషిణి.

సీత నిరాశ పడిపోయింది ఆ ధర వింటూనే. అంత ధరా ? అంత ఖరీదు పెట్టి చీరకొనుక్కోవడం తనకెలాసాధ్యమవుతుంది ? ఎనిమిది నెలలవరకూ డ్రస్సింగ్ టేబిల్‌కి వాయిదాలు కట్టటంతోనే సరిపోతుంది. ఏదేమయినా భర్త నడగాలి. అలాంటి చీర కొనిపెట్టమని. ఆ మాత్రం భార్యకు చీర కొనివ్వలేకపోతే ఎలా ?

"నువ్వు అదృష్టవంతుడివోయ్ మాధవరావ్! అన్ని విధాలా అనుకూలవతి అయిన భార్య దొరికింది" అన్నాడు రెడ్డి నవ్వుతూ.

"మరీ ఎదురుగ్గా పొగడకురా ! మీ చెల్లాయికి గర్వం ఎక్కిపోతుంది" తనూ నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"సీత అలా మారిపోయే మనిషికాదులెండి" కల్పించుకొంటూ అంది సుభాషిణి.

"వచ్చే ఆదివారం మీరిద్దరూ మా యింటికొచ్చేయండ్రా! మాంచి ప్రోగ్రామ్ ఏర్పాటు చేస్తాను" అడిగాడు రెడ్డి.

"మొన్నేగా వచ్చింది" నసిగాడు మాధవరావు.

"మొన్న కేవలం డిన్నర్‌కేగా వచ్చింది. ఈ సారి మా ఫ్రెండ్ కారు తీసుకొస్తున్నాను. అందరం ఎటేనా పిక్‌నిక్ వెళ్దాం. పెళ్ళయి నెలదాటిపోయింది. ఇంతవరకూ మా చెల్లాయిని ఎక్కడకూ తీసుకెళ్ళలేదు నువ్వు. మా చెల్లాయ్ కాబట్టి పోనీలెమ్మని ఊరుకుంది. అదే మరొకరయితే జుట్టు పట్టుకొని హనీమూన్‌కి లాక్కెళ్ళే వాళ్ళు" కోపం నటిస్తూ అన్నాడు రెడ్డి.

"అరేయ్ నువ్వన్నీ లేనిపోనివి రేపెట్టిపోకు! నువ్వెళ్ళగానే అవన్నీ చేస్తారా, లేదా అంటూ నన్ను దులిపేస్తుంది" బతిమాలుతున్నట్లు అన్నాడు మాధవరావు.

"అలాగే అబద్ధాలు చెప్పండి" చిరుకోపంతో మాధవరావు వంకచూస్తూ అంది సీత. అనేసిందిగాని ఆమె మనసులో నిజంగానే రెడ్డి మాటలు పనిచేయటం ప్రారంభించాయి.

తను అనేక కథల్లోనూ, నవలల్లోనూ 'హనీమూన్' గురించి చదివింది. సినిమాల్లో చూసింది. కానీ నిజజీవితంలో

ఎక్కడా కనిపించటం లేదు. ఎంత సరదాగా ఉంటుందనీ ఆ హనీమూన్. సుందరమైన దృశ్యాల మధ్య విహరించడం, ఖరీదయిన హోటల్లో మకాం, అసలు జీవితానికి నిర్వచనం హనీమూనేనేమో! మరి అంతటి ముఖ్యమైన అంశం కేవలం నవలలకూ, కథలకూ, సినిమాలకే పరిమితమైపోయిందెందుకనో! తన స్నేహితురాలు జయలక్ష్మికి వివాహమయింది. వెంటనే భర్తతో కాపరానికి వెళ్ళిపోయింది కూడా! దాన్నడిగితే దానికి 'హనీమూన్' లేదట. బోలెడు డబ్బవుతుంది, వద్దు' అన్నాట్ట వాళ్ళాయన. ఇందిర కూడా అంతే! తను చెప్పేవరకూ దానికి హనీమూన్ అంటే ఏమిటో తెలిస్చావలేదు. వాళ్ళే కాదు. తమ బంధువుల్లో చాలామంది వివాహాలకు వెళ్ళింది తను. ఎక్కడా 'హనీమూన్' ప్రసక్తేలేదు.

"మీరు హనీమూన్‌కి డార్జిలింగ్ వెళ్ళారు కదూ!" అడిగాడు మాధవరావు.

"అవును! చాలా బావుంటుందిలే అక్కడ!ఉదయాన్నే లేవగానే మంచుతో నిండి కనిపించే 'కాంచనగంగ' శిఖరం ఎంత అందంగా ఉంటుందో తెలుసా? గంటల తరబడి చూస్తూ కూర్చోవచ్చు. నాకయితే ఆ ప్రదేశం వదలి రాబుద్ధి కాలేదనుకో?"

"అక్కడే ఉండి పోవాల్సింది" నవ్వుతూ అంది సుభాషిణి.

"నన్నొకచోట ఉండనిస్తే కదా నువ్వు" ఆమెవంక చూస్తూ అన్నాడు రెడ్డి. అందరూ నవ్వేశారు.

మరి కాసేపు కూర్చుని రెడ్డి, సుభాషిణి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిన స్కూటరు వంకే, అది కనబడనంత వరకూ చూస్తూ నిలబడి పోయింది సీత.

తమకీ స్కూటర్ ఉంటే ఎంతబావుంటుంది? ప్రతి రోజూ సాయంత్రం స్కూటర్‌మీద ఇద్దరూ సరదాగా టాంక్ బండ్‌కీ, సినిమాలకీ హాయిగా తిరగొచ్చు కదా? తను వెనుక సీటు మీద కూర్చుని మాధవరావు నడుము పట్టుకొంటే అదో థ్రిల్! ఇవన్నీ తీరేదెప్పుడు? అనుభవంలో కొచ్చేదెప్పుడు? ఇలాంటివన్నీ ఈ వయసులో అనుభవించలేకపోతే వయసుమళ్ళాక సరదాలేముంటాయనీ?

"ఏమిటి అక్కడే నిలబడిపోయావ్" వెనగ్గావచ్చి ఆమె భుజంమీద చేయివేసి నొక్కుతూ అడిగాడు మాధవరావు.

సీత ఆలోచనలు వదిలి ఈ లోకంలో కొచ్చింది. లోపలకు నడిచి మంచం మీదకు ఒరిగిపోయింది.

"సీతాదేవిగారు ఏదో ఆలోచిస్తున్నారు" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"స్కూటరు ఎంత ఖరీదుంటుందండీ?" అమాయకంగా అడిగిందామె. మాధవరావుకి నవ్వాగలేదు.

"ఎందుకుట?" అన్నాడు పరిహాసంగా.

తను చెప్పే ప్రతి విషయం అదో నవ్వులాటలా తీసిపారేయడం ఆమెకు కోపం కలిగిస్తోంది.

"మీరేమీ చెప్పద్దులెండి! బుద్ధి తక్కువయి అడిగాను" చిన్నబుచ్చుకొంటూ అందామె.

"అరెరె! ఈ మాత్రానికే అంత

కోపమా ?" ఆమెను దగ్గరకు లాక్కో బోయాడతను. సీత అతనిని సున్నితంగా తోసివేసి వెనక్కు జరిగింది.

"సరేలేవోయ్! చెప్తున్నాను!ఆ కోపం ఫోజు తీసెయ్. స్కూటరు ఖరీదు సుమారు ఆరువేలవుతుంది మనం అంత డబ్బు ఈ జన్మలో కూడబెట్టలేము. పోనీ ఆ స్కూటర్లు కూడా కుట్టుమిషన్ల లాగా వాయిదాల పద్ధతిలో ఇస్తారాఅంటే ఆ సౌకర్యమూ లేదు. అంచేత మనం స్కూటరు ఈ జన్మలో కొనలేము. ఈ పరిస్థితిలో స్కూటరెంత అని నువ్వడగుతోంటే నవ్వొచ్చింది. అది కూడా నా తప్పేనా?" సర్ది చెప్పడానికి ప్రయత్నిస్తూ అన్నాడతను.

సీతకు కోపం చల్లారలేదు.

"అసలు ఈ విషయమే కాదు లెండి! నేనేది అడిగినా మీరు హేళన చేస్తూనే ఉంటారు. మనిషికి ఆశ ఉండటంలో తప్పేముందీ? ఏ వస్తువు కోసమయినా ఆశపడితేనే దాన్ని పొందడం సాధ్యమవుతుంది. అన్నిటికీ 'ఇది మనవల్ల కాదు' అని నిరుత్సాహపడితే అది అలాగే అయిపోతుంది. ఆశలనేవి లేకపోతే ఇంక జీవితం మీద ఆసక్తి ఏముంటుంది?" నిష్ఠూరంగా అందామె.

"ఐయామ్ సారీ సీతా! నీ మనసు నొప్పిస్తున్నాను కదూ?" దగ్గరగానడిచి ఆమె చుబుకం పట్టుకొని తల పైకెత్తి ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడతను.

సీత అతనివంక చూసేసరికి సీత కోపమంతా మంచులా విడిపోయింది. అతని గుండెలమీదకు వాలిపోయి మెడకింద గాఢంగా చుంబించింది.

ఆదివారం ఉదయమే ఇద్దరూ రెడీ అయి రెడ్డి ఇంటికి చేరుకున్నారు.

"మీ కోసమే ఎదురు చూస్తున్నాను. రండి" లోపలకు ఆహ్వానించింది సుభాషిణి.

"రెడ్డిలేడా ?" ఇల్లంతా చూస్తూ అడిగాడు మాధవరావు.

"ఊ హూ! కారు తీసుకురావడానికెళ్ళారు. ఇంకో అరగంటలో వచ్చేస్తారు" అందామె.

సీత సుభాషిణితో పాటు వంటింట్లోకి నడిచింది.

అక్కడ మరో స్త్రీ వంట చేస్తోంది.

"మనకొక్కావలసినవన్నీ నేను చేయడం కష్టమని వంట మనిషిని పిలిపించాను" నవ్వుతూ అంది సుభాషిణి.

సీత ఆశ్చర్యపోయింది.

నలుగురికి వంట చేయడానికి ఓ వంట మనిషా? ఎంత సుఖకరమైన జీవితం ఆమెది ?

సరిగ్గా అరగంటయేసరికి బయట కారు హారన్ మోగింది. భర్తతోపాటు తనూ హాల్లోకి నడిచింది సీత.

రెడ్డి కారు దిగి లోపలికొచ్చాడు.

ఆ కారు వంకే కళ్ళప్పగించి చూస్తూ నిలబడి పోయింది సీత. ఎంతో అందంగా ఉందా కారు. ఆ కారు మీద ఒక్కసారి ప్రయాణించేస్తే జీవితం ధన్యమయిపోతుందనేంత అద్భుతంగా ఉంది. అలాంటి కార్లో ప్రయాణం చేయడం ఎంతమందికి సాధ్యం. కేవలం తనభర్త స్నేహితుడివల్ల తనకా అదృష్టం కలుగబోతోంది. ఈ మాత్రానికి కూడా నోచుకోని వాళ్ళెంతమంది లేరు?

"ఈ కారు వాడు అమ్ముతాననంటున్నాడు. నేను పాతికవేల కడిగాను.

వాడు నలభయ్‌కి తక్కువ అమ్మనంటున్నాడు. చూద్దాం? కొన్నాళ్ళు పోతే వాడే దిగి వస్తాడని ఆగాను. బావుండలేదూ కారు?" మాధవరావుతో అంటున్నాడు రెడ్డి. సీత గుండెలు వేగంగా కొట్టుకో సాయిగా. సుభాషిణి వాళ్ళు ఆ కారు కొనుక్కోబోతున్నారా ? ఆమె మీద హఠాత్తుగా ఈర్ష్య కలిగిందామెకి. ఎంత అదృష్టం! స్కూటర్ గురించి ఆలోచించడానికి కూడా తను అర్హురాలు కాదు. సుభాషిణి, స్కూటరు వదలి కారు కొంటోంది. మరికాసేపటి తర్వాత కారులో అందరూ బయల్దేరారు. ఫ్రంట్ సీట్లో రెడ్డి, సుభాషిణీ కూర్చున్నారు. వెనుక సీట్లో తామిద్దరూ. కారు విశాలమయిన రోడ్ల మీదనుంచి దూసుకు పోతోంటే ఆనందంతో పొంగి పోతోంది సీత. డబుక్కున ఏదయినా లాటరీ తగిలితే ఎంత బావుంటుంది? ముందు ఇలాంటి కారే కొనేస్తుంది తను! మిగతా విషయాలు తరువాత! గండిపేట చేరుకొంది కారు.

అక్కడి ప్రకృతి దృశ్యాలు పరవశత్వం కలుగ జేస్తున్నాయి. ఎంత అందంగా, ప్రశాంతంగా ఉందిక్కడ. ఇలాంటి దృశ్యాలు సినిమాలో చూడటమే గాని ప్రత్యక్షంగా చూడటం ఇదేమొదటి సారి.

రెడ్డి టేప్ రికార్డర్ తీసి మంచిపాటలు వినిపించసాగాడు. అందులో సుభాషిణి పాడినపాట కూడా ఉంది.

సీతకు మళ్ళీ ఈర్ష్య కలిగిందామె మీద.

భర్త అంటే రెడ్డిలా ఉండాలి! ఎంత ప్రేమ అతనికి భార్యమీద! ఆమె మీద ఈగ వాలనివ్వడు. ఆమెను కాలు కింద పెట్టనీడు. ఓ స్త్రీ కోరుకునే అన్ని వస్తువులూ ఆమెకోసం అమర్చాడతను.

మాధవరావు వంక చూసిందామె. రెడ్డి పక్కనే కూర్చుని దూరంగా ఎటో చూస్తున్నాడతను. అతనికీ తన భర్తకీ ఎంత తేడా? ఖరీదైన బట్టలతో మెరిసి పోతున్నాడు రెడ్డి. వెలవెలపోతున్న కాటన్ బుష్‌షర్టూ, నలిగిన పాంటుతో తన భర్త రెడ్డి దగ్గర నౌకర్లా ఉన్నాడు. రెడ్డి టేప్ రికార్డర్ పెట్టి ఆనందిస్తోంటే తన భర్త ప్రకృతి దృశ్యాలు కూడా చూడకుండా ఏదో ఆలోచిస్తున్నాడు. ఆసలామనిషిలో ఏ కోరికాలేదు. ఏ ఆశలూ లేవు. ఉన్నదానితోనే సంతృప్తి, లేనిదాని గురించి అసలు ఆలోచనేలేదు.

మధ్యాహ్నం అందరూ భోజనాలు ముగించారు.

సుభాషిణే వడ్డించింది అందరికీ! ఎన్ని రకాల వంటకాలు! అవి కూడా సినిమాలలో చూడటమే! డబ్బున్న జీవితాలకూ.లేని జీవితాలకూ ఎంత తేడా! ప్రతి విషయంలోనూ, కొట్టొచ్చేటంత తేడా కనబడుతోంది.

సాయంత్రం వరకూ పేకాట ఆడి, కాసేపు ఈతకొట్టి తిరిగి ఇంటికి బయల్దేరారు వాళ్ళు.

సీతకసలు ఉత్సాహమేలేదు. ఆ పిక్నిక్ ఆమెకు మానసిక ఉల్లాసం కలిగించలేదు. సరికదా మరింత కృంగదీసిందామెని. మరెన్ని సుఖాలకు తను దూరంగా ఉందో అప్పుడే తెలిసిందామెకి.

రోజులు గడచిన కొద్దీ ఆమెకు మనశ్శాంతి కరవయిపోసాగింది. జీతం




ఎటూ చాలటంలేదు. వాయిదాల పద్ధతిలో తీసుకొన్న డ్రస్సింగ్ టేబిలూ, రేడియో, సోఫా సెట్టూ- వీటికి డబ్బు కట్టేసరికి ప్రాణంమీదకొస్తోంది. దాంతో మాధవరావు అప్పులు చేయక తప్పటం లేదు. జీవితంలో ఏనాడూ అప్పు చేయలేదతను. ఇప్పుడు సీత తెలివి తక్కువ పనుల వల్ల తను అప్పుకి బయల్దేరడం అతనికి బాధ కలిగించింది.

సీతతో మనస్ఫూర్తిగా మాట్లాడలేక పోతున్నాడతను. సీత కూడా ఈ విషయం గ్రహించుకొంది. అయినా అతనిని పట్టించుకో దల్చుకోలేదామె. తనేమీ కాని పనులు చేయడం లేదు. అవన్నీ కొనడం తన స్వార్థానికి కాదు. తమ ఇంటిని తనక్కావలసిన పద్ధతిలో తీర్చి దిద్దుతోంది. అంతే! అందుకు కొంత వరకూ తమ తాహతుకి మించిన ఖర్చు అయితే అవ్వొచ్చు. అలాంటి పరిస్థితుల్లో- ఈ సమస్యలనెలా పరిష్కరించు కోవాలా అని ఇద్దరూ కూడబలుక్కొని ఆలోచించు కోవాలిగాని ఆయన తనమీద అలిగితే ఏంలాభం? అలా అలిగినంత మాత్రాన తమ సమస్యలు పరిష్కారమవుతాయా?

నిజానికి తనూ రేయింబవళ్ళు తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచడం ఎలా అని ఆలోచిస్తూనే ఉంది. ఈ మధ్యే ఒక ఉపాయం కూడా తట్టింది తనకి. తను మెట్రిక్ పాసయింది. కనుక ప్రయత్నిస్తే ఎక్కడోచోట- ఎంత చిన్న ఉద్యోగ మయినా దొరకకపోతుందా? ఉద్యోగం చేస్తే తప్పేముంది? ఎంత మంది ఇల్లాళ్ళు ఉద్యోగాలు చేయడం లేదు. తమ కాంపౌండ్‌లోనే ఇద్దరు ఇల్లాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు. ఒకామె టీచరు. మరొకామె టైపిస్ట్. వాళ్ళిద్దరూ పాసయింది కూడా మెట్రిక్కే. కాకపోతే టీచర్ ట్రైనింగ్, టైపు పరీక్షా పాసవబట్టి వాళ్ళకి ఆ ఉద్యోగాలు దొరికాయి. ఈ విషయం భర్త దగ్గర కదపాలనుకుందామె.

"ఏమండీ! నేనో విషయం చెప్తాను, మీరేమీ కోపగించరు కదా?" ఓ రోజు రాత్రి భయంగానే భర్త నడిగిందామె.

"ఏమిటది?" ముక్తసరిగా అడిగాడు మాధవరావు.

"మనకి జీతం ఎటూ చాలటంలేదు. మీరేమో అప్పులు చేయాల్సి వస్తోంది. ఇదంతా నామూలానే అని మీరు అనుకొంటున్న సంగతి నాకు తెలుసు. ఆ విషయం నేనూ ఒప్పుకొంటున్నాను. ఇప్పుడీ ఇబ్బందులు తొలగి పోడానికి నేనో ఉపాయం ఆలోచించాను! నేను ఉద్యోగం చేస్తాను! మీరు ఒప్పుకొంటే" అతనివంకే చూస్తూ అడిగిందామె.

ఉలిక్కిపడ్డాడు మాధవరావు.

అతనెప్పుడూ ఈ విధంగా ఆలోచించలేదు.

సీత ఉద్యోగం చేయడమా? చేస్తే ఎలా వుంటుంది? మిగతా ఉద్యోగం చేసే స్త్రీల స్థితిగతులెలా ఉన్నాయి? ఎవరిదాకానో ఎందుకు? తనాఫీసులో చేస్తోన్న ప్రమీల, శారదల మాటేమిటి? వాళ్ళకేం? బాగానే ఉన్నారు. తమ జీతంతో సంసారం గడుపుతూ భర్తల జీతం బాంకులో దాచుకొంటున్నారు. వాళ్ళకి గౌరవ ప్రతిపత్తులకేం లోపం వాటిల్లిందని? అందరూ గౌరవంగానే చూస్తున్నారు. మరి సీత కూడా

ఉద్యోగం చేస్తేనేం? ఇటు తన ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. అటు తన మామయ్యకు కూడా అదివరలా సహాయం చేయడానికి వీలవుతుంది.

వివాహమయిన తర్వాత ఇంతవరకూ ఒక్క పైస కూడా మామయ్యకు పంపలేకపోయాడు తను. నిజంగా సిగ్గుచేటు! అక్కడ మామయ్య ఎన్ని బాధలు పడుతున్నాడో ఏమో! కేవలం మామయ్య వాళ్ళకోసమయినా సీత ఉద్యోగం చేయాలి! తప్పదు.

"మాట్లాడరేమండీ! మీ కిష్టంలేదా?" అడిగింది సీత అనుమానంగా.

"అబ్బే...ఇష్టం లేక కాదు సీతా! నువ్వు ఉద్యోగంచేస్తే మనకేమయినా ఇబ్బందు లెదురవుతాయా అని ఆలోచిస్తున్నాను..."

"ఇబ్బందు లేముంటాయండీ! మన కింకా పిల్లాపాపా లేరుగా! ఆ తరువాతంటారూ? అప్పటి సంగతి అప్పుడు ఆలోచించుకోవచ్చు..."

"కాని...నీకింత త్వరగా ఉద్యోగం దొరుకుతుందంటావా? కనీసం టైపయినా వస్తేగాని కొంత ఉపయోగం ఉండదు..."

"నేనూ అదే అనుకొంటున్నాను. రేపట్నుంచి టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో జాయినవుతాను. పరీక్షలు పాసవకపోయినా టైపు కొట్టటం ప్రాక్టీస్ అయితే చాలు! కదూ?"

"సరే!అలాగేచెయ్...రేపు ఉదయం నేను ఆఫీసుకెళ్ళేప్పుడు నాతో పాటు వచ్చెయ్. మెయిన్ స్ట్రీట్‌లో టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో మాట్లాడి నిన్ను చేర్పిస్తాను. రోజూ అదే టైము తీసుకొనేట్లయితే ఇద్దరం కలసి బయల్దేర వచ్చు!..." ఉత్సాహంగా అన్నాడు మాధవరావు.



## 5

ఆ మర్నాడే సీత టైపు నేర్చుకోవడం ప్రారంభించింది. అక్కడ మొదట పరిచయమయింది అరుణ. అరుణ రచయిత్రి అని తెలిశాక ఆమె మీద మరింత ఆసక్తి చూపింది సీత.

"ఇంతవరకూ ఎన్ని కథలు రాశారు మీరు?" అడిగింది సీత కుతూహలంగా.

"షుమారు ఇరవై కథలు రాసుంటాను. అవిగాక నవలలు నాలుగు రాశాను...."

"నవలలు నేను చదివానులెండి. కథలే మిస్సయ్యాను..." అంది సీత.

"ఓ రోజు మా ఇంటికి రండి! అన్నీ బైండు చేయించాను. తీసుకెళ్ళి చదువుకుందురుగాని..."

"అలాగే..." సంతోషంగా అంది సీత.

మర్నాడు టైప్ ప్రాక్టీసింగ్ అయిపోగానే అరుణతో అక్కడికి దగ్గర్లోనే ఉన్న వాళ్ళింటికి చేరుకొందామె. వాళ్ళ ఇంట్లో కల్లా అరుణ గదే చాలా నచ్చింది సీతకి. గదిలో చిన్న స్టీలు అల్మారా! దాని నిండా ఖరీదయిన చీరెలు డెకోలాం మంచం, గాడ్రెజ్

టేబిలూ, రివాల్వింగ్ కుర్చీ.

"ఇవన్నీ నా రచనలకు వచ్చిన పారితోషికంతోనే కొనుక్కొన్నాను..." సగర్వంగా అంది అరుణ.

ఈ మాట వింటూనే ఆశ్చర్యపోయింది సీత. రచనలు చేయడంవల్ల కేవలం మంచి పేరు సంపాదించుకోవటమే అనుకొంటూ వస్తూంది తను. కాని ఇప్పుడు అలా అనుకోవడం తప్పని ఋజువు అయిపోయింది. పేరేకాకుండా డబ్బు కూడా సంపాదించవచ్చని తనకిప్పుడే తెలిసింది.

తనకథలు బైండ్ చేయించినపుస్తకం ఒకటి తీసి చదవమని సీతకిచ్చిందామె. ఇల్లు చేరుకొని వెంటనే ఆ కథలు చదవ సాగిందామె. సాయంత్రం లోపల అన్ని కథలూ చదవడం పూర్తి అయిపోయింది. అయితే ప్రతి కథ లోనూ ఏదో ఒక లోపం కనిపించసాగిందామెకి. అదే తను రాసి ఉన్నట్లయితే అంతకంటే అద్భుతంగా రాయగలిగి ఉండేదనిపించింది.

అంతలోనే చటుక్కున ఓ ఆలోచన మెరపులా మెరసింది!

అవును; తను మళ్ళీ కథలు రాయడం మొదలు పెడితే? తనకెందుకో నమ్మకం ఉంది. తను ఖచ్చితంగా అరుణ కంటె బాగా రాయగలదని. ప్రయత్నించి చూస్తే నష్టమేముంది? అప్పటికప్పుడే పుస్తకాల షాపుకెళ్ళి ఒక తెల్లకాగితాల కట్టకొనుక్కొచ్చిందామె. త్వరగా వంట ముగించేసి కాగితాలు ముందేసుకు కూర్చుంది. కథావస్తువు ఏం తీసుకోవాలో అర్థంకాలేదామెకి. తనకు తెలిసిన వారందరి గురించి ఆలోచించింది. హైస్కూల్లో చదివినప్పుడు జరిగిన సంఘటనలూ - విన్న సంఘటనలూ అన్నీ గుర్తుకి తెచ్చుకోడానికి ప్రయత్నించ సాగింది. ఎలాగైతేనేం, చివరకు రెండు మూడు కథావస్తువులు తయారయాయి. అందులో నుంచి ఒకటి ఎన్నుకొని రచనకు ప్రారంభోత్సవం చేసింది. దిద్దటాలూ, కొట్టివేతల్తో మొత్తానికి సాయంత్రానికి మూడొంతుల కథ పూర్తయిపోయింది, పూర్తి అయిపోయేదేగాని మాధవరావు ఆఫీసునుంచి వచ్చేయడంతో కథకి బ్రేకుపడిపోయింది.

"ఏమిటి కష్టపడి రాస్తున్నావ్? మీ ఇంటికి ఉత్తరమా!" అడిగాడు మాధవరావు.

"కాదు" నవ్వుతూ అందామె.

"మరేమిటి?"

"చెప్పుకోండి చూద్దాం!"

అతను కొద్ది క్షణాలు ఆలోచించాడు గానీ ఏమీ తట్టలేదు.

"ఏమో! నాకేమీ తట్టడంలేదు.నువ్వే చెప్పేసెయ్యరాదూ?" ఆమె దగ్గరగా నడుస్తూ అడిగాడతను.

సీత ఏమీ చెప్పలేదు. అతనే చొరవగా ఆమె చేతిలోని కాగితాలు తీసుకొని ఆత్రుతగా చదవసాగాడు. రెండులైన్లు చదవగానే అతనికి అర్థమయిపోయింది.

"ఓహో! నువ్వు కథలు మళ్ళీ ప్రారంభించావన్నమాట! మరి ఈ విషయం రహస్యంగా ఎందుకుంచినట్లు?" ఆమెను రెండు చేతుల్తో చుట్టేస్తూ అన్నాడతను.

"బావుంది. కథలు రాస్తే సరిపోయిందా ఏమిటి? వాటి నెవరయినా ప్రచురించుకోవద్దూ!"

"ఎందుకు వేసుకోరు? చాలా బాగా స్టార్ట్ చేశావ్ కథని. అసలు కథంతా

"చదవనీ ఓసారి..." కాగితాలు పట్టుకొని కుర్చీలో కూర్చున్నాడతను. సీత ఆనందంగా లోపలకు పరుగెత్తి అతనికి కాఫీ తీసుకొచ్చి అందించింది.

రాసినంత వరకూ చదివి కాగితాలు తిరిగి ఆమెకందించాడతను.

"చాలా బాగా రాశావ్ సీతా! ముగింపు ఏమిటా అని నాకు చెడ్డ కుతూహలంగా ఉందిప్పుడు. నేను బెట్ కడతాను సీతా! ఈ కథని తప్పక ప్రచురిస్తారు చూస్తూండు..." సంతోషంతో ఉప్పొంగిపోతూ అన్నాడతను.

"ఏమో చూద్దాంగా..." నవ్వుతూ అంది సీత.

ఆ రాత్రి భోజనాలవగానే మళ్ళీ కాగితాలు ముందేసుకు కూర్చుందామె. కథ పూర్తయేసరికి రాత్రి12 గంటలయింది. అంతవరకూ కేవలం ఆమె రాసిన కథ చదవాలని మేలుకుని కూర్చున్న మాధవరావు తనకు తెలీకుండానే నిద్రలోకి జారిపోయాడు. అతన్ని లేపటం ఇష్టంలేక కాగితాలన్నీ డ్రస్సింగు టేబిల్ మీదుంచి తనూ పడుకొని నిద్రపోయిందామె.

ఉదయం ఆమెకు మెలకువ వచ్చేసరికి మాధవరావు అప్పటికే లేచి తను రాసిన కథ చదువుతూ కనిపించాడు.

"ఎలావుంది ?" అడింగిందామె అతను చదవటం పూర్తవగానే.

"చాలా చక్కగా ఉంది. మరి ఇంత మంచి నేర్పుంచుకొని ఇంత కాలం రాయకుండాఎందుకూరుకున్నావ్!" అడిగాడు మాధవరావు ప్రశంసాపూర్వకంగా చూస్తూ.

"నిజంగా బాగుందని పొగుడుతున్నారా, లేక పెళ్ళాం కథ కనుక పొగడాలని పొగుడుతున్నారా ?" అనుమానంగా అడిగిందామె.

"బావుంది, బయటి వాళ్ళనయితే పొగడాలిగాని, నీకెందుకు అబద్ధాలు చెప్తాను ?" ఇది ఏ పత్రికకు పంపదల్చుకున్నావ్ ?"

అతని మాటల్తో ఆమెకు ఆనందం పొంగి పొరలింది.

అతనిని తన కథ అంతగా ఆకర్షిం




చిందంటే తను ధైర్యంగా రచనలు చేయ వచ్చన్న మాట!

"ఏమో! ఇంకా ఏ పత్రికకు పంపేది నిర్ణయించుకోలేదు చాలా ఉన్నాయిగా! పోనీ మీరు సజెస్ట్ చేయ కూడదూ!"

అతను కొద్దిసేపు ఆలోచించాడుగానీ ఏదీ తేలలేదు.

"పోనీ- ఓ పనిచేయ్! సాయంత్రం వరకూ ఆగు! మా ఆఫీసులో ఒకతను కథలు రాసేవాడున్నాడు. అతన్నడుగుతాను ఏ పత్రిక్కి పంపమంటాడో! ఏమంటావ్!"

"సరే- మర్చిపోకుండా కనుక్కొరండి..."

"నువ్వు సాయంత్రం వరకూ ఏం జేస్తూంటావ్ మరి?"

"ఏముంది? మామూలే- రైపూ..."

"రైపు నుంచి రాగానే మరో కథ ప్రారంభించు. మా వాడంటూంటాడు. రచయిత అవాలంటే ఒక కథ రాసి ఊరుకో కూడదుట. ప్రచురించబడినా లేకపోయినా కొన్ని వందల కథలు ఏకధాటిన రాయాలట. వాటిలో ఏ ఒక్కటి ప్రచురింపబడినా ఇంక ఆ రచయితకు ఢోకాలేదట" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

సాయంత్రం అతనొచ్చేలోగా మరో కథ రాయడంలో నిమగ్నమయి కనిపించిందామె.

"వెరీగుడ్! అదీ స్పిరిటంటే... మా ఫ్రెండ్‌ని కనుక్కొచ్చాను. ఈ మాస పత్రికకు పంపమన్జెప్పాడు. వీళ్ళు కొత్త రచయితలను బాగా ప్రోత్సహిస్తున్నారట. అడ్రస్ కూడా రాసిచ్చాడు..." అంటూ ఓ కాగితం ఆమె చేతికిచ్చాడు.

ఆ సాయింత్రమే ఆమె రాసిన కథ పోస్టులో ప్రయాణమయింది. ఇరవై రోజుల తర్వాత పోస్ట్‌మన్ ఆ మాస పత్రిక ఇంటికి తెచ్చిచ్చేసరికి ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరయింది సీత. ఆ పత్రిక నుంచి కథ ప్రచురింపబోతున్నట్లు ఏదయినా ఉత్తరంలాంటిది వస్తుందేమో అని ఇన్నిరోజులూ ఎదురు చూస్తూ కూర్చుంది. కానీ ఏకంగా పత్రికే వచ్చేసింది. త్వరగా పత్రిక పేజీలు తిరగేసిందామె. మొదట్లోనే తను రాసిన కథ కొట్టొచ్చే అక్షరాలతో కనిపించేసరికి సంతోషంతో ఉక్కిరిబిక్కిరయిపోయింది. తన పేరు చూస్తున్న కొద్దీ ఆనందం ఎక్కువయిపోతోంది. కనీసం తెలియ జేయకుండా ప్రచురించేశారేమిటి? అది కూడా ఇరవై రోజుల్లో అంటే తన కథ అంతగా నచ్చిందా వాళ్ళకు? వెంటనే పక్కింటి వాళ్ళకి ఆ విషయం చాటించి పత్రికచూపిందామె. మరికొద్ది సేపట్లో ఆ కాంపౌండంతా ఆశ్చర్యంలో మునిగిపోయారు. తమ కాంపౌండ్‌లోనే ఓ రచయిత్రి ఉండటం వారికి గర్వకారణంగా కూడా ఉంది. మాధవరావు ఆఫీసునుంచి ఎప్పుడు ఇంటికొస్తాడా, ఈ విషయం ఎప్పుడు చెప్పాలా అని ఆత్రుతతో ఎదుర్చూడసాగిందామె. మాధవరావు ఆ రోజు మరో అరగంట ఆలస్యంగా ఇల్లు చేరుకొన్నాడు. అతని చేతిలో స్వీట్ పాకెట్ కనిపించిందామెకి

"కంగ్రాచ్యులేషన్స్" అన్నాడతను ఇంట్లోకి వస్తూనే.

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగింది సీత.

"నీ కథ పడిందిగా" తన చేతిలోని

మాసపత్రిక ఆమెకందిస్తూ అన్నాడతను.

"అరె! మీకెలా తెలిసింది? మనింటికి ఈ పత్రిక పంపించారు..." ఇంటి కొచ్చిన పత్రిక కూడా తీసి చూపుతూ అందామె.

"షాపులో పత్రిక వేలాడుతోంది. తిరగేసి చూశాను. ముందే నీ పేరు కని పించింది. వెంటనే ఓ కాపీ కొనుక్కొ చ్చేశాను. ఈ శుభ సమయంలో 'తీపి' తినిపిస్తావని ఈ స్వీట్ పాకెట్ కూడా తెచ్చాను..." నవ్వుతూ స్వీట్ పాకెట్ ఆమె కందించాడతను. అందులో నుంచి ఓ గులాబ్ జామ్ తీసి అతని నోటికందించి సీత.

"మరి నీకు స్వీటు నేను తినిపిస్తాను" తనో స్వీటు అందుకొని ఆమె నోట్లో పెట్టాడతను.

ఆ కథ ప్రచురింపబడటం ఎంతో ప్రోత్సాహం కలిగించిందామెకి. ఆ తరు వాత పదిహేను రోజుల్లోనూ నాలుగు కథలు రాయగలిగింది. వాటన్నిటిని చదివి ఎంతో మెచ్చుకొన్నాడు మాధవ రావు. అన్నీ వివిధ పత్రికలకూ పోస్ట్ చేయించింది సీత.

"ఇలాక్కాదోయ్! కథ రాయడం కంటే నవలలు రాయడం తేలికట! మా ఫ్రెండ్ చెప్తూండే వాడు' నవలెందుకు ప్రయత్నించకూడదు?" అడిగాడు మాధవరావు.

"అమ్మో! నేను నవల రాయగలనా?" ఆశ్చర్యంగా అడిగింది

"అలా అనుకొంటూ కూర్చుంటే అసలేమీ రాయలేవు. ప్రయత్నించి చూడాలి!..." ప్రోత్సాహకరంగా అన్నా డతను.

ఆ రోజునుంచే ఆమె నవల గురించి ఆలోచన మొదలు పెట్టింది.

"ఇవిగో! మంచి నవలాకారిణివి అవా లంటే ముందు ఇలాంటి మంచి నవలలు చదవాలట!" అంటూ ఓ డజను ఇంగ్లీష్ నవలలు తీసుకొచ్చి ఇచ్చాడు మాధవ రావు. ఇంగ్లీష్ అర్థం చేసుకోవడం కొంచెం కష్టమయినా షుమారుగా కథ తెలిసిపోతూనే ఉంది. అక్కడక్కడ మరీ తెలీని చోట మాధవరావు సహాయం చేస్తున్నాడు.

ఒకటి రెండు కథలు మినహా ఆమె పంపించిన కథలన్నీ వివిధ పత్రికల్లో ప్రచురింపబడినాయి. కొన్ని పత్రికలు పదిహేను రూపాయలు, మరికొన్ని ముప్ఫయ్, ఇంకొన్ని యాభై రూపాయలు చొప్పున ప్రతిఫలం అందజేసినాయి. ఆ డబ్బుమీద సర్వాధికారాలూ తనకే ఉంచుకొందామె. అన్నీ కలిపి నూట ఎనభయ్ రూపాయిలవ్వగానే రెడ్డి భార్య సుభాషిణి కట్టుకొన్న లాంటి చీర ఒకటి కొనేసింది. అది కట్టుకొన్న రోజు తను ఎంతో విజయం సాధించినట్లు అనిపించిం దామెకి.

అప్పటికే ఆమె పేరు ఆ చుట్టు ప్రక్కల మార్మోగి పోయింది. చాలా మంది స్త్రీలు ఆమెతో స్నేహం చేయ డానికి ఉవ్విళ్ళూరసాగారు.

మత్తుపానీయాల కంటే ఎక్కువ మత్తు కలిగించేది పొగడ్త. సీతని విప రీతంగా పొగిడే అభిమానులు ఏర్పడ్డారు.

ఈ పరిస్థితుల్లో ఆమె మొదటి నవల ఒక మాస పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడటం మొదలయింది.నిజంగా ఆ నవల తెలుగు దేశంలో గొప్ప సంచ లనం కలిగించింది. అసంఖ్యాకమయిన ఉత్తరాలు ఆ నవలను పొగుడుతూ

 

అందుతున్నాయి.

నవల సగం కూడా ప్రచురింపబడక ముందే ఆమెకు ఇతర పత్రికల నుంచి

రచనలు పంపమని అభ్యర్థిస్తూ ఉత్తరాలు వచ్చాయి.

ఈ పరిస్థితి ఇద్దరికీ అమితమయిన ఆశ్చర్యానందం కలిగించింది.

"నువ్వు మరీ గొప్ప రచయిత్రివయి పోతున్నావోయ్! ఇక నాతో మాట్లాడే తీరిక ఉంటుందో ఉండదో" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"అలాంటి మాటలంటే ఊరుకొనేది లేదు" చిరుకోపంతో అంది సీత.

ఓ నెల తర్వాత మధ్యాహ్నంపూట తీరికగా ఏదో కథ రాసుకొంటూండగా బయట ఆటో ఆగిన చప్పుడయింది. ఓ వ్యక్తి ఆటోదిగి కాంపౌండ్‌లోకొచ్చి అక్కడ ఆడుకొంటున్న పిల్లలతో 'సీతగారిల్లు ఎక్కడ' అని అడగడం కూడా వినిపించిందామెకి.

ఒక్క ఉదుటున లేచి రాసుకొంటున్న కాగితాలన్నీ ఓ మూలకు సర్దేసింది. తన కోసం వచ్చే అపరిచిత వ్యక్తి ఎవరా అన్న ఆశ్చర్యం ఆమెని ఆవహించింది.

ఈలోగా అతను గడపదగ్గరకు రానే వచ్చాడు. సీత అతనివంక ప్రశ్నార్థకంగా చూసింది.

"నమస్కారమండి! రచయిత్రి సీతగారు మీరేననుకొంటాను..." చిరునవ్వుతో నమస్కరిస్తూ అన్నాడతను.

"అవును" ప్రతి నమస్కారం చేస్తూ అందామె.

"నా పేరు ఈశ్వర్రావు. మాలినీ పబ్లిషింగ్ కంపెనీ ప్రొప్రయిటర్ని".

అతనికి తనతో పనేమిటో అర్థం కాలేదు సీతకి.

"రండి. కూర్చోండి" అంది ఆహ్వానిస్తూ.

అతను లోపలకు నడిచి సోఫాలో కూర్చున్నాడు. ఒకవేళ ఇతనికి తన కథలంటే ఇష్టమేమో! బహుశా తనని చూసిపోడానికని వచ్చుంటాడు. అతన్ని గురించి ఊహించుకుంటోంది సీత.

"మీ సీరియల్ నవల చాలామందికి నచ్చింది..." అతను చిరునవ్వుతో అన్నాడు.

"థాంక్యూ" తనూ నవ్వేస్తూ అంది.

"ఆ నవల విషయం మాట్లాడ్డానికి వచ్చాను" కొద్దిక్షణాలాగి నెమ్మదిగా అన్నాడతను.

సీతకేమీ అర్థం కావటంలేదు. బాగుందన్నాడు, తను 'థాంక్యూ' చెప్పేసింది. ఇంకా ఏం మాట్లాడాలి దాన్ని గురించి? ఒకవేళ అందులోని సన్నివేశాల గురించి చర్చిస్తాడా?

ఆమె ఏమీ మాట్లాడకపోయేసరికి తిరిగి అతనే మాట్లాడాడు.

"మీరు ఆ నవల పబ్లిషింగ్ హక్కులు ఎవరికయినా ఇచ్చారా?"

ఆ గొడవేమిటో సీతకు బొత్తిగా తెలీలేదు. పబ్లిషింగ్ హక్కులేమిటి? అవి నవలను ప్రచురిస్తున్న మాసపత్రిక వాళ్ళకుండవా? వాళ్ళు ఎంతో కొంత తనకి ప్రతిఫలంగా ఇస్తారుకదా! అయినా ఈ గొడవలన్నీ తనకేం తెలుసు? ఆయన వచ్చాక మాట్లాడమంటే సరి!

"ఈ విషయాలన్నీ మావారు వచ్చాక మాట్లాడితే బావుంటుంది" నెమ్మదిగా అందామె.

"అంటే ఎవ్వరికీ ఇవ్వలేదన్న మాటేగా?"

సీత ఏమీ మాట్లాడలేదు.

"పోనీ మీ వారు ఎప్పుడొస్తారో చెప్పండి! ఆ టైముకొస్తాను" అతనే అన్నాడు చివరకు.

"సాయంత్రం అయిదున్నరకల్లా వచ్చేస్తారు".

"సరే! ఆ టైముకొస్తాను. ఒకవేళ ఆలస్యమయినా కొద్దిసేపు నాకోసం వేచి ఉండమని చెప్పండి ఆయనకు. నేను మళ్ళీ రాత్రి బస్‌కి వెళ్ళిపోవాలనుకొంటున్నాను".

"అలాగే!"

అతను వెళ్ళిపోయాడు. ఆ సాయంత్రం మాధవరావు ఇంటికొస్తూనే ఈ విషయం చెప్పిందామె—

"ఈశ్వర్రావనీ అదేదో పబ్లిషింగ్ కంపెనీ యజమానట– నా నవల హక్కులు ఎవరికయినా ఇచ్చారా అని అడిగాడు. ఆ విషయాలన్నీ నాకు తెలీదు, మావారితో మాట్లాడమని చెప్పి పంపించి వేశాను".

మాధవరావుకి నవ్వాగలేదు.

"భలేదానివే! నవలలు రాసేదానివి ఓ పబ్లిషర్‌తో మాట్లాడలేవా! బహుశా నీ నవల పబ్లిషింగ్ హక్కులు కొనడానికి వచ్చి ఉంటాడతను. అతన్నలా గెంటేస్తే ఎలా? ఎంతో కొంత డబ్బొస్తుందికదా నీకు".

"నిజంగానా?" విస్మయంతో అడిగిందామె.

"అవునుమరి! లేకపోతే పబ్లిషర్‌కి నీతో ఏంపని?"

"ఎంతిస్తాడతను?"

"అది నీ నవల గొప్పతనం, అతని ఆర్థికస్తోమతమీద ఆధారపడి ఉంటుంది".

వాళ్ళలా మాట్లాడు కొంటూండగానే ఆటో దిగి లోపలికొచ్చాడు పబ్లిషర్.

"రండి! కూర్చోండి" అతన్ని ఆహ్వానించాడు మాధవరావు.

"నమస్తే" అంటూ సోఫాలో కూర్చున్నాడతను.

"ఇప్పుడే మీరొచ్చి వెళ్ళారని చెప్తోంది – ఇంతలో రానే వచ్చేశారు.." నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"మాలినీ పబ్లిషింగ్ కంపెనీ మీకు తెలిసే వుంటుంది. నా కంపెనీయే అది. ఇప్పుడు సీరియల్‌గా వస్తున్న సీతగారి నవలకు పబ్లిషింగ్ హక్కులు కొనే విషయం మాట్లాడ్డానికొచ్చాను" అన్నాడతను.

"ఓహో ..." తల పంకిస్తూ అన్నాడు మాధవరావు.

"ఆ నవల వేరెవరికీ ఇవ్వలేదనుకుంటాను..." తిరిగి అన్నాడతను.

"ఊహూ! ఎవ్వరికీ ఇవ్వలేదింకా..."

"నేను ప్రచురించిన ప్రతి నవలకూ నాలుగొందలు చొప్పున రాయల్టీ ఇస్తున్నాను. నేను రెండువేల కాపీలు వేసుకొంటాను. ఈ ఒప్పందం మనకు అయిదేళ్ళ వరకూ ఉంటుంది. ఆ తరువాత మళ్ళీ ఈనవలమీద సర్వహక్కులూ మీకే ఉంటాయి! మీకు అంగీకారమయితే చెప్పండి. ఇప్పుడే అగ్రిమెంట్ రాసుకొందాం! నాలుగు వందలకు చెక్ ఇచ్చేస్తాను..."

వంటింట్లోంచి వాళ్ళ మాటలు వింటూన్న సీత తను విన్నది నిజమేనా అన్న మీమాంసలో పడిపోయింది.

పుస్తకంగా వేసుకొన్నందుకు నాలుగొందల రూపాయలు ఇస్తాడా? అంత డబ్బు ఒక్క పుస్తకానికా? ఏం చేసు




కోవాలదంతా ? ఏంకొనాలి ?

మాధవరావు ఆలోచనలో పడ్డాడు. నిజానికి ఆతనికీ ఆశ్చర్యంగానే వుంది. నాలుగొందలు అమాంతం వచ్చి పడుతోంటే, అదీ అనుకోకుండా – ఎవరికి మాత్రం ఆశ్చర్యం ఉండదు అనుకొన్నాడతను. ఒకవేళ తను నాలుగొందలకి ఒప్పుకొంటే ఎలా వుంటుంది ? బాగానే ఉంటుంది. కాని తను అతను చెప్పినంతకే ఎందుకు ఒప్పుకోవాలి. ఎలాగూ అతనే తమ దగ్గర కొచ్చాడు కాబట్టి మరో వంద రూపాయలు ఎక్కువడుగుతే ? కొద్దిక్షణాలు తర్వాత అయిదువందలకయితే ఎగ్రిమెంట్ కుదుర్చుకోవచ్చని అతనికి చెప్పేశాడు మాధవరావు.

"సరే! మీ ఇష్టం! అలాగే కానీండి!" అన్నాడు ఈశ్వరరావు బాగ్‌లో నుంచి కొన్ని కాగితాలు బయటకు లాగుతూ. ముందు ఆ కాగితాల మీద నవల పేరు, రచయిత్రి పేరు అన్నీ పూర్తి చేసి "ఆమె సంతకం పెట్టించండి ఇక్కడ" అంటూ మాధవరావు కందజేశాడు. ఆమె సంతకం చేసేలోగా అయిదువందలకు చెక్కురాసి అందించేడు. . "మీ సీరియల్ పూర్తి అయిన వెంటనే నేను ప్రచురణ మొదలు పెడతాను. ఆ విషయం మీకు మళ్ళీ ఉత్తరం రాస్తాను లెండి..." అన్నాడతను. ఈలోగా సీత రెండు కప్పుల్లో కాఫీ తీసుకొచ్చి అందించింది ఇద్దరికీ.

కాఫీ తాగి అతను వెళ్ళిపోయాడు. తన చేతిలోని చెక్కు సీతకందించేడు మాధవరావు.

"నీ కష్టార్జితం!" అన్నాడు నవ్వుతూ.

"నా కెందుకిది. మీ దగ్గరే ఉంచండి..."

"చెక్కు మీ పేరున ఉంది సీత గారూ! మీరో బ్యాంక్ ఎకౌంట్ ప్రారంభిస్తేగాని మీకు డబ్బు రాదు"

"అలాగయితే రేపే చేద్దాం ఆ పని" ఆనందంగా అందామె.

"మరి ఈ డబ్బు ఏం చేయదల్చుకొన్నారు తమరు?"

"ఏమో, మీరే చెప్పండి!"

"బాగుంది! నువ్వు కావాలను కొన్న వస్తువుల లిస్ట్ చాలా పెద్దదుంది. అందులో నీకేది ముఖ్యమో, అది ఈ మొత్తానికి లభ్యమవుతుందో లేదో నాకేం తెలుస్తుంది? అయినా ఇది నీ డబ్బు కాబట్టి దీని మీద నేనెలాంటి అధికారం చెలాయించదల్చుకోలేదు"

"అలా మీ డబ్బూ, నా డబ్బూ అనే తేడాలెందుకు? నేను కొనదల్చుకొన్న వస్తువులు ఏవయినా అన్నీ మన ఇంటి కోసమేగా! పోనీ మీ కిష్టం లేకపోతే చెప్పండి—ఏమీ కొనను..." నిష్ఠూరంగా అందామె.

ఆమెను దగ్గరకు లాక్కొని కౌగిట్లో బంధించాడు మాధవరావు.

"నాకిష్టం లేదని నీతో ఎప్పుడయినా అన్నానా! నేను చేయలేని పనులు నువ్వు చేస్తూంటే నాకు మాత్రం ఆనందంగా ఉండదూ?"ఆమె కళ్ళల్లోకి అనురాగంతో చూస్తూ అన్నాడతను.

సీత అతని గుండెల మీద తల వాల్చేసింది సంతృప్తిగా.




ఆ మర్నాడు సాయంత్రం మరో విచిత్రం జరిగింది.

మరో పబ్లిషరు వచ్చి అదే నవలకు హక్కులు తనకు కావాలనీ అడిగాడు.

"నిన్నే మాలినీ పబ్లిషింగ్ కంపెనీ వారికి రాసిచ్చేశాము..." అన్నాడు మాధవరావు.

"ఎంత ఇచ్చారాయన?" అడిగాడతను.

"అయిదువందలు..."

"దొంగరాస్కెల్! చూశారా! ఇంత పేరొచ్చిన నవలకు అయిదొందలిచ్చి అగ్రిమెంట్ రాయించు కొంటాడా? ఇలాగేనారచయితలనూ,రచయిత్రులనూ అన్యాయ చేయడం! మీరేకాదండీ వాడి మాటల్లో పడి చాలామంది మోసపోయారు"

"అదే మీరయితే ఎంత ఇచ్చేవారు?" అయోమయంగా అడిగింది సీత.

"ఎనిమిది వందలు!దమ్మిడీ తక్కువ ఇచ్చేవాడిని కాదు! నా సంగతి నేను డీల్ చేసిన ఏ రచయితనయినా అడగండి మీకే తెలుస్తుంది. ఇప్పటికయినా మించి పోయిందిలేదు. మీరు ఆ పాత అగ్రిమెంట్ రద్దు చేసుకొని అతని డబ్బు అతని కిచ్చేస్తానంటే నేనిప్పుడే ఎనిమిది వందలూ ఎడ్వాన్స్‌గా ఇచ్చేస్తాను"అన్నాడతను. సీతా, మాధవరావులు అవాక్కయి పోయారు.

తామిద్దరికీ ఈ పబ్లిషరు ఎంతగా మోసగించిందీ ఇట్టే అర్థమయి పోయింది. అయితే ఇప్పుడు ఏంచేయాలో ఇద్దరకూ తెలీలేదు. ఎగ్రిమెంట్ రద్దు చేసుకొందామంటే అతనేమంటాడో ఏమో!

"మీఅడ్రస్ ఇచ్చి వెళ్ళండి! ఏ సంగతీ నేను తరువాత తెలియ

జేస్తాను..." కొద్ది సేపటి తర్వాత కోలుకొని అన్నాడు మాధవరావు.

"ఒకవేళ అతను ఒప్పుకోకపోతే ఈ సారికి వదిలేయండి. కానీ మీ తరువాతి నవలలు మాత్రం ఎవ్వరికీ ఇవ్వకండి! నేను తీసుకొంటాను. ఏమంటారు?" అడిగాడతను.

"సరే..." తలూపుతూ అంది సీత,

"అతను తన అడ్రస్ కార్డ్ వారికి ఇచ్చి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత కాసేపటి వరకూ ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. సీత పూర్తిగా తల్లక్రిందులయి పోయింది. ఒకటి కాదు, రెండు కాదు- మూడు వందలు!

తన భర్త ఇలాంటి విషయాల్లో అనుభవమున్న వారి నెవర్నయినా సంప్రదించి అప్పుడే అగ్రిమెంట్ రాయించాల్సింది. అలాచేస్తే ఇప్పుడీ మూడు వందల నష్టం వాటిల్లేది కాదు.

"తప్పు నాదేలే! ఏమీ తెలియకుండా అన్నీ తెలుసనుకొంటే ఇలాగే జరుగుతుంది..." నెమ్మదిగా అన్నాడు మాధవరావు.

"పోనీలేండి! ఇక ముందు జాగ్రత్తగా ఉంటేసరి-" అతనిని సంతృప్తి పరచడానికి మాట్లాడింది సీత.

"అవును! అంతకంటె చేయగలిగిందేముందీ?" నిరుత్సాహంగానే అన్నాడు.

"అయినా ఇలా వదిలితే లాభంలేదు. ముందు అతనికో ఉత్తరం రాస్తానివాళ. అతనిచ్చిన డబ్బు చాలా తక్కువనీ, కనీసం ఎనిమిది వందలయినా ఇవ్వాలనీ అంటాను! ఏం జవాబిస్తాడో చూద్దాం!" పట్టుదలగా అంది సీత.

మాధవరావు ఆశ్చర్యపోయాడు.

సీత 'తనకంటె ఫరవాలేదు' అనుకొన్నాడు. ఎలాగయినా ఇలాంటి విషయాల్లో మగాళ్ళ కంటె స్త్రీలే నయం. ఖచ్చితంగా మాట్లాడ గలరు.

"రాసిచూడు!" అన్నాడతను.

సీతరాసిన ఉత్తరానికి తిరుగుటపాలో జవాబొచ్చింది.

ఆ విషయాలన్నీ అగ్రిమెంట్ రాసే ముందే ఆలోచించుకోవాల్సిందనీ, ఇప్పుడు ఆ విషయం గురించి చర్చించడంవల్ల ఎలాంటి ఉపయోగమూ లేదనీ, అయినా తాను ఇందులో మోసగించిందేమీ లేదనీ, ఎవరయినా అదే మొత్తం ఇస్తారనీ, తను రచయితలకు తనకూ మధ్య మంచి సంబంధాలు ఉండాలని నమ్మే మనిషి కావడంవల్ల మరో వంద రూపాయలు త్వరలో పంపుతున్నట్లూ- ఈ విషయం ఇంతటితో ముగుస్తుందని భావిస్తున్నట్లూ రాశాడతను.

"చూశారా! మోసం కాకపోతే ఇప్పుడు మరోవంద ఎందుకు పంపుతున్నట్లూ! సరే ఈ సారికి పోనీండి! మరోసారి మరోనవల కావాలని ఇంటికొస్తే గడపలోంచే బయటకు వెళ్ళగొడతాను..." కసిగా అంది సీత.



## 6

మరో వార పత్రికలో సీత రెండో నవల సీరియల్‌గా ప్రారంభించారు.

ప్రారంభించిన రెండు మూడు వారాల్లోనే అమితమయిన ప్రచారం పొందిందది. ఎవరు చూసినా ఆ నవలలోని పాత్రల గురించే మాట్లాడు కొంటున్నారు. ఆ వారపత్రిక సర్క్యులేషన్ కూడా పెరిగిపోయింది. ఈ విషయమై ఆ పత్రిక సంపాదకుడే ఆమెని అభినందిస్తూ ఉత్తరం రాశాడు. మాధవరావు కిదంతా విపరీతమయిన ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆమె నవలలు అంతటి పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తున్నాయంటే నమ్మబుద్ధి కావటం లేదు. ఆమె రాసే ప్రతి రచనా తను చదువుతూనే ఉన్నాడు. వాటిల్లో సహజత్వం అనేది మచ్చుకయినా కనిపించ లేదు. కాకపోతే కథ, కథనం చాలా బాగుంటున్నాయి! అంతే! ఈ మాత్రానికే పాఠకులు, పత్రికలూ, ఆమెని ఆకాశానికెత్తేయడం తమాషాగానే ఉంది. ఏదేమయినా సీతకి రచయిత్రిగా ఉజ్వలమయిన భవిష్యత్తు ఉందనిపించింది అతనికి. మరో ముఖ్య విషయం, ఆమె ఇదే విధంగా కొంత కాలం రచనలు చేస్తే ప్రస్తుతం తామున్న ఆర్థిక సమస్యల నుంచి బయటపడే రోజు ఎంతో దూరం ఉండదు.

ఇప్పుడు సీత సుభాషిణితో సగర్వంగా మాట్లాడ గలుగుతోంది. సుభాషిణికి డబ్బుంది. తనకు రచయిత్రిగా పేరుంది. అంచేత ఆమెకు ఏ విధంగానూ తీసిపోదు. హఠాత్తుగా మాధవరావు మేనమామ సంజీవయ్యకు జబ్బుచేసింది. అతనిని వెంటనే గుంటూరు హాస్పిటల్లో చేర్చాలనీ, ఆపరేషన్ అవసరమనీ తేల్చారు డాక్టర్లు. ఆ బాధ్యతంతా మాధవరావే తీసుకోక తప్పలేదు. నెలరోజులు ఆఫీసుకి శలవుపెట్టి, సీతను వాళ్ళ పుట్టింటి దగ్గర వదిలి సంజీవయ్యను తీసుకొని గుంటూరు బయల్దేరాడు. అతి కష్టంమీద హాస్పిటల్లో ఎడ్మిషన్ దొరికింది. కాని ఆపరేషన్ చక్కగా జరగాలంటే డబ్బు ఖర్చు పెట్టాలని చెప్పారెవరో అతనికి. ఆపరేషన్ జరిగాక కూడా ఓ నెల హాస్పిటల్లోనే ఉండాలని




చెప్పాడు డాక్టరు. వెంటనే హాస్పిటల్ దగ్గర్లోనే ఓ ఇల్లు అద్దెకు తీసుకొని అత్తయ్యనూ, పిల్లలనూ అక్కడకు చేర్చాడు. వారందరూ అక్కడ నెల రోజులు గడపాలంటే కనీసం వెయ్యి రూపాయలయినా కావాలి. అంత డబ్బు ఎక్కడి నుంచి తేవాలో అర్థంకాలే దతనికి.

"పోనీ సగం పొలం అమ్మేస్తే..." అంది అత్తయ్య.

అది మాధవరావు కిష్టంలేకపోయింది. ఉన్నదే కొంచెంపొలం. దానిమీదే ఆధార పడి బ్రతుకుతోందా కుటుంబం. ఇప్పుడు అందులో సగం అమ్మేస్తే ఆ కుటుంబం రోడ్డున పడక తప్పదు.

వెంటనే సీత దగ్గరకు బయల్దేరా డతను. ఆమె పేర బాంకులో ఏడు వందల రూపాయలున్నాయి. అవి అడిగి తీసుకొంటే కొంత వరకూ ఫరవాలేదు. అవి అయిపోయాక- అప్పటి విషయం అప్పుడు చూసుకోవచ్చు. ఈ ఏడాది న్నరలోనూ మామయ్యకు ఒక్కదమ్మిడీ కూడా పంపనే లేదు తను. అలా అను కుని సీత వద్దకు వచ్చేడతను.

"ఎలావుంది మీ మామయ్య గారికి?" అతన్ని చూడగానే అడిగిందామె.

"హాస్పిటల్లో చేర్చాను. కనీసం నెల రోజులయినా హాస్పిటల్లో ఉండా లన్నారు"

"మరి... ఆయన దగ్గర ఎవరుం టారు?"

అత్తయ్య వాళ్ళను తీసుకెళ్ళి ఓ అద్దెఇల్లు తీసుకొని అక్కడ వుంచాను. వాళ్ళ దగ్గర డబ్బేమీలేదు. మామయ్య క్షేమంగా హాస్పిటల్ నుంచి ఇంటికి రావాలంటే కనీసం ఓ వెయ్యి రూపాయ లయినా వాళ్ళకి అవసరం ఇప్పుడు" సీతవంక చూస్తూ అన్నాడతను. ఆ చూపులోనే అతని అభిప్రాయం సీతకి అర్థమయిపోయింది.

ఇప్పుడు తన అకౌంట్‌లో ఉన్న డబ్బంతా అతనికిచ్చేయాలి. ఇదే అతని క్కావలసింది. కానీ, అదంతా తను సంపాదించు కొన్నడబ్బు. ఆ డబ్బు తను కూడబెట్టడానికి కారణాలున్నాయి. తను చాలా రోజుల్నుంచీ కలలు కంటున్న డెకోలం మంచాలు కొనాలి. ఇప్పుడు ఈ డబ్బుకాస్తా వాళ్ళకిస్తే ఇక తను వాటిగురించి పూర్తిగా మర్చి పోవాల్సిందే. ఎలాగూ ఈ డబ్బు తిరిగి వచ్చేదికాదు. నిజమే వాళ్ళు ఆయనకు సహాయం చేశారు.తల్లిదండ్రులు పోయిన దగ్గర నుంచీ పెంచి పెద్ద జేశారు. దానికి ఆయన ఋణపడి ఉండాల్సిందే. కానీ తను కూడా వారికి ఋణపడి వుండాలను కోవడం, తన డబ్బంతా వారికి ఇవ్వాలనుకోవడం తనకి నచ్చని విషయం.

"ఇప్పుడేం చెయ్యదల్చు కొన్నారు మరి?" తనకేమీ సంబంధం లేనట్లు అడి గిందామె.

"అదే అర్థం కావటం లేదు" ఇబ్బందిగా అన్నాడతను. ఆమె తనం తటతనే డబ్బు తీసుకోమని ముందు కొస్తుందేమోనని ఆశించాడతను.

సీత మాట్లాడలేదు. ఏదో పుస్తకం తీసుకొని చదువుతున్నట్లు నటించ సాగింది. తనే ఆ విషయం చెప్పక తప్పదని నిర్ణయించు కొన్నాడతను. సీతకు తన మనోభావం అర్థం కాకుండా

ఉంటుందా?అయినా మౌనంవహించిదంటే "ఆమెకు డబ్బివ్వడం ఇష్టంలేదనే అనుకోవాలి.

"పోనీ, ప్రస్తుతం నీ దగ్గరున్న డబ్బు వాడదాం సీతా! తర్వాత చూసుకోవచ్చు మిగతా డబ్బు సంగతి" అయిష్టంగానే మాట్లాడాడతను.

సీత చివుక్కున తలెత్తి అతని వంక చూసింది. ఆ చూపులో చాలా అర్థాలున్నాయి.

"సరే-తీసుకోండి" అంది కోపం అణచుకొంటూ.

"ఆమె మాటలు అతనికి అసంతృప్తి కలిగించాయి. డబ్బివ్వడం మనసు క్షిష్టంలేకపోయినా, కనీసం ఆ విషయం తనకు తెలీకుండా ఉంచడానికి ప్రయత్నిస్తే తను సంతోషించేవాడు.

"నీకు కోపంగా ఉంది కదూ - నీ డబ్బు తీసుకొంటున్నానని?" అడిగాడతను.

"కోపమెందుకూ? అయినా ఇది నా డబ్బెందుకయిందీ? అంతా మీది కాదా?" విసురుగానే అందామె.

"నీ డబ్బు నీకు మళ్ళీ ఇచ్చేస్తాను సీతా! ప్రస్తుతం మరొకరి దగ్గర తీసుకొచ్చే సమయంలేదు కనుక-తీసుకోవల్సి వస్తోంది! అంతే!"

"ఓహో! భార్య దగ్గర భర్త అప్పు తీసుకొంటున్నాడన్నమాట ! అంతేగా మీరనేది? మరి నోటు కూడా రాసిస్తారా నాకు?" చుర చుర చూస్తూ అందామె.

ఆమె దగ్గరకు నడిచి, అతి సమీపంగా నిలబడి ఆమె కళ్ళల్లోకి చూశాడతను.

"నేనేం వేరే ఉద్దేశంతో మాట్లాడటం లేదు సీతా! నీ డబ్బు నేనే నా కోసం ఉపయోగించుకొంటున్నట్లయితే అలా మాట్లాడేవాడినే కాదు. మరెవరికోసమో ఖర్చుచేయబోతున్నాను కాబట్టి తిరిగి ఇచ్చేస్తానని చెప్తున్నాను ... అంతే! ఇందులో నీ మనసు కష్టపెట్టుకోవాల్సిన అవసరం లేదు" ఆమెను దగ్గరకు తీసుకొంటూ అన్నాడతను. సీత అతని గుండెల మీదకు వాలిపోయింది భారంగా.

సీత సంతకం చేసిన చెక్కుని మార్చుకొని డబ్బు తీసుకొని గుంటూరు చేరుకొన్నాడు మాధవరావు.



## 7

రెండు రోజుల తర్వాత సంజీవయ్యా ఆపరేషన్ జయప్రదంగా జరిగింది. వెంటనే సీతతో సహా తిరిగి హైదరాబాద్ చేరుకొన్నాడు.మాధవరావుఅక్కడి పరిస్థితులు అతనికి మరింత చిరాకు కలిగించాయి. అతను పనిచేస్తున్న కంపెనీలో సమ్మె జరుగుతోంది. కొందరు కార్మికులను ఉద్యోగం నుంచి తొలగించిన కారణంగా వివాదం ఏర్పడి అది సమ్మెలోకి దిగింది. ఫ్యాక్టరీకికాక కంపెనీ ఆఫీసుకి సంబంధించిన వాడవటంచేత తాము సమ్మెలోపాల్గొననవసరం లేదని అనుకొన్నాడు మాధవరావు. కానీ కంపెనీ దగ్గరకు చేరుకోకుండానే అతనిని అడ్డగించారు కార్మికులు.




గత్యంతరంలేక వెనక్కు తిరిగివచ్చాడతను. సమ్మె మూలంగా ఆ నెల జీతం అందనేలేదు. ఇంట్లో సరుకులన్నీ అయిపోయాయి. చేసేదిలేక రెడ్డి దగ్గర కెళ్ళాడతను.

"మీ కంపెనీ సమ్మె జరుగుతోంది కదా మరి మీకు జీతాలు ఇవ్వరా ఈ నెల?" ముందు రెడ్డే అడిగాడు.

"ఎలా ఇస్తారు? పనిలోకి వెళ్తేనే కదా ఇచ్చేది?"

"మరి నీకు ఇంట్లో ఇబ్బందిగా లేదూ? ఒకవేళ డబ్బు అవసరమేమైనా ఉంటే నన్నడుగు! అంతేగాని ఇంట్లో అమ్మాయిని కష్టపెట్టకు. నువ్వసలే మొహమాటపు పక్షివి, నాకు తెలుసుగా!" నవ్వుతూ అన్నాడతను.

మాధవరావు నవ్వేశాడు.

"ఇప్పుడు అందుకే వచ్చానిక్కడికి. ఐదు వందలుంటే సర్దు ప్రస్తుతానికి" అడిగాడతను. రెడ్డి వెంటనే లోపలికెళ్ళి ఐదు వందనోట్లతో తిరిగి వచ్చాడు.

"ఐదు వందలు తీసుకొంటున్నాను కదా, మళ్ళీ రెడ్డికి ముఖం ఎలా చూపించను అనుకొంటూ కనిపించకుండా పారిపోకు! డబ్బు అవసరమైతే మళ్ళీ రా" అతని కందిస్తూ అన్నాడు రెడ్డి.

"సరే లేరా! నువ్వంతగా చెప్పాలేమిటి?" సిగ్గుతో అన్నాడు మాధవరావు. అదే మొదటిసారి అతను ఎవరినయినా అప్పు అడగటం. హైదరాబాద్ వచ్చి ఉద్యోగం కోసం తిరుగుతున్న రోజుల్లో డబ్బులేక వరుసగా మూడు రోజులు పస్తులున్నాడు. సనత్‌నగర్ నుంచి సికింద్రాబాద్‌కి రోజుకి రెండు సార్లు నడిచాడు. ఉద్యోగం దొరికిన కొత్తలో ఒక నెలంతా ఒంటి పూట భోజనంతో గడిపాడు. ఇంకా ఇలాంటి వెన్నెన్నో చేశాడు.కానీ ఎవ్వరినీ ఒక్క పైసా అప్పు అంటూ అడగలేదు. అడిగితే ఇచ్చే స్నేహితులు ఇద్దరు ముగ్గురున్నారు. అయినా అదో ప్రిన్సిపుల్! అంతే! అప్పు అడగడం కంటే అకలితో మాడడం తనకిష్టం! కానీ ఇప్పుడు పరిస్థితి వేరు. తన ప్రిన్సిపుల్స్ కోసం తనేమయినా చేయగలడు. కానీ తననే సర్వస్వంగా భావించి తనతో సంసారం చేస్తున్న సీతని మాత్రం తన ప్రిన్సిపుల్స్‌తో బాధించి హింసించకూడదు. అందుకే నిరాడంబరంగా జీవితం గడపాలను కొన్న తన ఆశయానికి సీత కోరికలు విరుద్ధమయినా రాజీ పడి సహిస్తూ వస్తున్నాడు. తనకు ఇష్టం లేదని ఆమె ఇష్టాఇష్టాల్ని ఎందుకు చంపుకోవాలి? తన ఇష్టాల్ని ఆమె మీద బలవంతంగా ఎందుకు రుద్దాలి? దాని మూలాన సాఫీగా గడిచే సంసారంలో కలతలు రావూ? కలతలతో నిండిన సంసారాన్నీదడం కంటె ముందే రాజీ పడటం వివేకమనిపించుకొంటుంది.డబ్బు తీసుకొని ఇల్లు చేరుకొన్నాడతను.

గుంటూరు నుండి సంజీవయ్య రాసిన ఉత్తరం చూపించింది సీత. తనను మరో వారంలో హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేస్తున్నారనీ, ప్రస్తుతం తమ దగ్గరున్న డబ్బంతా ఖర్చయిపోయిందనీ, ఎంతో కొంత పంపితే తను ఊరికి చేరుకోగ్గానే ఎలాగోలా తిరిగి సర్దుబాటు చేస్తాననీ రాశాడు.

వెంటనే రెండు వందలు మని యార్డర్ చేసేశాడు మాధవరావు. మిగతా డబ్బుతో ఇంట్లోకి సరుకులు తీసుకొచ్చి ఇంటి అద్దె కట్టాడు. ఇదంతా మౌనంగా గమనిస్తూనే ఉంది సీత. నోరువిప్పి ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

పదిరోజులు గడచినా సమ్మె జరుగుతూనే ఉంది. మరోసారి కార్మికవర్గం నాయకులతో చర్చలు జరిపింది యాజమాన్యం. ఎటువంటి ఒప్పందమూ కుదరకపోయేసరికి కంపెనీకి 'లాకౌట్' ప్రకటించింది. దానితో కనీసం కొన్ని నెలలపాటైనా అందరూ జీతాలులేకుండా గడపాలని తెలిసిపోయింది మాధవరావుకి. వెంటనే మరో ఉద్యోగానికి ప్రయత్నాలు మొదలుపెట్టాడు. మరో పది రోజుల్లో అదీ అంత తేలికయిన విషయం కాదని తెలిసిపోయింది. తమ కంపెనీలో పనిచేసే వారిలో చాలామంది అప్పటికే ఎక్కడోచోట ఏదోక చిన్న ఉద్యోగంలోనయినా ఇరుక్కున్నారు.

ఈ పరిస్థితి సీతకు కూడా ఆందోళన కలిగించింది. మాధవరావు ఓ పక్క, ఇంటికొచ్చే షాపుల వాళ్ళ గొడవ మరో పక్క, మరోసారి ఇన్‌స్టాల్‌మెంట్ల పద్ధతిలో ఎలాంటి సామానూ కొనగూడదని నిశ్చయించుకొందామె.

* * *

మాధవరావు పరిస్థితి గమనిస్తూనే ఉన్నాడు రెడ్డి. అతనికీ లోలోపల బాధగానే ఉంది. తన స్నేహితుడు ఇబ్బంది పడటం సహించలేక పోతున్నాడతను. తనకు డబ్బుంది. కానీ ఎంతకాలమని మాధవరావుకి డబ్బిస్తూ సహాయం చేయగలడు? అది సరయిన పద్ధతికాదు.

చివరకు ఓ ఆలోచన వచ్చిందతనికి. అవును మాధవరావుతో ఏదో ఒక వ్యాపారం ప్రారంభింపజేయాలి. అందుకవసరమైన పెట్టుబడి తను సమకూర్చవచ్చు. దాంతో అతని జీవితం గడచిపోతుంది. బాగా లాభాలు వచ్చినప్పుడు తిరిగి తన పెట్టుబడి తనకిచ్చేస్తాడు. ఈ పద్ధతి సరయినదిగానే అనిపించిందతనికి.

స్కూటర్ మీద మాధవరావు ఇల్లు చేరుకున్నాడతను.

"ఏం చేస్తున్నావు ఇంట్లో?" అడిగాడు సోఫాలో కూర్చుంటూ.

"ఎంత ప్రయత్నించినా వెలగని దీపాన్ని వెలిగిస్తూ కూర్చోవడం కంటె చుట్టూ ఉన్న చీకటిని తిట్టుకొంటూ కూర్చోవడం మంచిదనుకొంటున్నాను" పొడిగా నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"ఏడ్చావ్‌గానీ—నేనడిగిందానికి సమాధానం చెప్పు. నువ్వు ప్రయత్నించిన ఉద్యోగాలు ఏమయినాయి? ఎక్కడయినా దొరికే అవకాశం ఉందా?"

"ఒక్కదానిక్కూడా నమ్మకం లేదు!"

"పోనీ మీ కంపెనీ లాకౌట్ ఇప్పట్లో ఎత్తేసే అవకాశం ఉందా?"

"ఊహూ! అదసలే లేదు!"

"మరేం చేయాలనుకొంటున్నావ్!"

"చెప్పాను కదా! ఎంత ప్రయత్నించినా వెలగని..."

"చాల్చాల్లే! బోరుకొట్టకు! నువ్వొట్టి, వెధవ్వనీ, ఇంటర్‌నేషనల్ ఫూల్‌వనీ, అంచేత చేతులు ముడుచుకొని ఇంట్లోనే కూర్చుండి ఉంటావనీ నేను ముందే

 

అనుకొన్నాను"

"థాంక్యూ ! నా విషయాలు ఎలా తెలిసినయ్యబ్బా నీకు..." ఆలోచిస్తున్నట్లు అన్నాడు మాధవరావు.

"ఏడ్చావ్‌గానీ - నేనో ఉపాయం ఆలోచించాను ! వింటావా ?"

"మరికొంచెం అప్పు తీసుకోమంటావ్ ! అంతేగా ! నేనింకా నీ దగ్గర అప్పు తీసుకోదల్చుకోలేదు. అది తప్ప ఇంకేదయినా అయితే మాట్లాడు"

అతని మాటలు రెడ్డికంటె సీతకే ఎక్కువ కోపం తెప్పించాయి.

పోనీలేకదాని ఆయనేదో సలహా చెప్పడానికొస్తే, సంతోషంగా వినడం పోయి అది చెప్పవద్దు, ఇది మాట్లాడవద్దు అని ఫోజిస్తే ఎలా !

అప్పు తీసుకోరట!

తీసుకోక ఏం చేస్తారో ?

తనని కూడా పస్తులుంచుతారా!అన్నీ అర్థంలేని మాటలు! వీటిని ప్రిన్సిపుల్స్ అనరెవరూ! చేతకాని తనం అంటారు. అవును! భార్యని ఏదో విధంగా పోషించాల్సిన ధర్మం, బాధ్యత భర్తది. అలాంటిది ఈ మనిషి...పోనీ తన డబ్బయినా ఉంటే ఈ సమయంలో ఎంతో ఉపయోగపడేది. అది కాస్తా తీసుకెళ్ళి 'మేనమామో' అంటూ వాళ్ళ చేతిలో పెట్టారు. ఇప్పుడా మేనమామ బాగానే ఉన్నాడు. అడుక్కు తినబోతోంది తామిద్దరూనూ! ఇప్పుడు తన రచనల మీద వచ్చే డబ్బు కూడా ఏమీలేదు. రెండో సీరియల్ పూర్తి అవుతేగాని చేతికి డబ్బురాదు. కథల మీద వచ్చేది చెప్పుకోదగ్గది కాదు. దురదృష్టం

ఏమిటోగాని ఈ రెండో నవల కొనుక్కో డానికి ఏ పబ్లిషరు రాలేదింతవరకూ

"అప్పు సంగతి కాదులేవోయ్! నేను చెప్పేదంతా ముందు పూర్తిగా విను!తరువాత వాగుదువుగాని" అన్నాడు రెడ్డి మళ్ళి అందుకుంటూ

"సరే చెప్పు! ఏమిటా ఉపాయం?"

"నువ్వో చిన్న వ్యాపారం ప్రారంభించాలి!"

"వ్యాపారమా ?" విచిత్రంగా చూస్తూ అడిగాడు మాధవరావు.

"అవున్రా! దానిక్కావలసిన పెట్టుబడి నేను ఇస్తాను! ప్రారంభించెయ్· తరువాత నెమ్మదిగా నా డబ్బు నాకిచ్చేద్దువుగాని..."

కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డాడు మాధవరావు. తను వ్యాపారం చేయగిల నన్న నమ్మకం అతనికి కలుగటంలేదు. దానిక్కావలసిన నేర్పూ, మోసం చేయగల సామర్థ్యం, ఆ మోసాన్ని భరించగల ఓర్పూ ఇవేమీ తనకు లేవు.

"ఏం వ్యాపారం ?" అయిష్టంగానే అడిగాడు మాధవరావు.

"ఏదో ఒకటి ! ముందు 'చేస్తాను' అని నువ్వు ఒప్పుకొంటే తరువాతమిగతా విషయాలు మాట్లాడుకోవచ్చు"

"ఆయన ఒప్పుకొనేదేముందన్నయ్యా ఇందులో! ఏమీ చెయ్యకపోతే ఏం చేస్తారు? ఇల్లెలా గడుస్తుంది!" విసుగ్గా అంది సీత.

"నీకున్న జ్ఞానం వాడికుంటే చాలా బావుండేదమ్మా !" నవ్వుతూ అన్నాడు రెడ్డి.

"నన్ను మరీ వెధవ కింద జమకట్టకండ్రా బాబూ ఆల్ రైట్! నేను నువ్వు చెప్పినట్లల్లా చేస్తాను. ఏం చేయమంటావో చెప్పు ! అన్నాడు మాధవరావు.

"అదే మనమిప్పుడు ఆలోచించాలి! ఏమమ్మా సీతా! నువ్వుకూడా ఆలోచించు ఫాన్సీ షాప్ లాంటి దేమయినా బావుంటుందా?"

అంతా ఆలోచనలో పడ్డారు.

"పోనీ చిన్నపిల్లల కోసం స్కూలు పెడితే ఎలా వుంటుందన్నయ్యా! నేను కూడా పాఠాలు చెప్పడానికి అవకాశం ఉంటుందిగా" అంది సీత.

ఈ ఆలోచన బాగానే ఉన్నట్లనిపించింది రెడ్డికి.

"ఇక్కడకు దగ్గరలో స్కూళ్ళేమీ లేవు కదూ ?" అడిగాడతను.

"నాలుగు ఫర్లాంగులదూరంలో ఉంది. ఈ చుట్టుపక్కల పిల్లలందరూ అంత దూరం వెళ్ళాల్సిందే!ముందు మనం కే.జి. అప్పర్ కే.జి క్లాసులతో ప్రారంభిస్తే సరిపోతుందనుకొంటాను" అంది సీత.

రెడ్డి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"ఈ ఆలోచన బాగానే ఉన్నట్లుంది! ఏరా మాధవా! మరి నీ అభిప్రాయం ఏమిటి ?" మాధవరావు వంక చూస్తూ అడిగాడు రెడ్డి.

"ఫరవాలేదు! సరుకులమ్మే దుకాణం కంటే మంచిదే!" నవ్వుతూ అన్నాడు మాధవరావు!

"సరే! అలాగయితే తరువాతి కార్యక్రమం ప్రారంభిద్దాం! నేను వెళ్ళి నాకు తెలిసిన ఓ స్కూల్ హెడ్ మిస్ట్రెస్ని వివరాలు కనుక్కొస్తాను. ఈ వేసవి సెలవులయిపోయేలోగా నెల రోజుల్లోగానే మనం స్కూలు ప్రారంభిద్దాం!





ఈలోగా ఈ చుట్టుపక్క లెక్కడయినా స్కూలుకోసం ఓ ఇల్లు అద్దెకు చూస్తాం దండి!" తను బయల్దేరుతూ అన్నాడు రెడ్డి.

"సరే..." అంగీకార సూచకంగా తలూపాడు మాధవరావు.

అనుకొన్నట్లే పనులు చకచక జరిగి పోసాగాయి. ఆ స్కూల్ తెరవడానికి ఏర్పాట్లన్నీ పూర్తి చేశాడు రెడ్డి. ఈలోగా సీత, మాధవరావు ఆ ప్రాంతమంతా తిరిగి చివరకి రెండు గదులున్న ఓ ఇల్లు అద్దెకు సంపాదించగలిగారు.

వెంటనే పిల్లలు కూర్చునే బల్లలు చేయించడం ప్రారంభించాడు రెడ్డి. స్కూలు ముందు పెద్ద బోర్డుకూడా తగిలించారు. లోపల రంగులూ అవీ వేయించి చూడ డానికి అందంగా కనిపించేలా చేశారు.

స్కూలుకి ప్రారంభోత్సవం జరిగింది.

ఆ కాంపౌండులోని పిల్లలందరూ వెంటనే ఆ స్కూల్లో చేరిపోయారు. అంతా మూడూ అయిదేళ్ళమధ్య వయసు గలవాళ్ళే. ఆ వయసు పసివాళ్ళని కూర్చోబెట్టి చదువు చెప్పటం తమాషాగా ఉంది సీతకు. మాధవరావుకి మొదట్లో పెద్ద పనేమీ లేకపోయినా రానురాను కొంతమంది ఒకటో క్లాసు పిల్లలు కూడా చేరడంతో అతనికి కాలక్షేపం అవుతోంది. పగలంతా స్కూలు కోసం వినియోగిస్తున్నా రాత్రుళ్ళు చాలాసేపటి వరకూ మేలుకుని కూర్చుని తన రచనలు కొనసాగిస్తోంది సీత.

మొదట్లో ఆ స్కూలుమీద ఎక్కువ ఆదాయం రాకపోయినా క్రమక్రమంగా అది పెరుగుతూంటే సంతృప్తికరంగానే కనిపించింది వాళ్ళకు. సీతను చూస్తుంటే మాధవరావుకి జాలీ, ప్రేమా, గౌరవం ఏర్పడ్డాయి. ఆమె నిద్రపోకుండా చాలా రాత్రివరకూ మేలుకొని కూర్చుని రచనలు చేస్తూంటే అతనూ ఆమె పక్కనే కూర్చుని ఆమె కథల్లోని లోపాలు చూపి సరిదిద్దుతూండేవాడు. కథలు అల్లడంలో అతని సహకారం ఎంతో లభిస్తుండేది సీతకు.

మనిషికి కోరికలుండటం తప్పుకాదు. ఈ విషయం తనకు తెలుసు. అందులోనూ సీతకున్న కోరికలు విపరీతమైనవేమీ కావు. ఆ వయసులో వున్న ప్రతి స్త్రీ కోరుకొనేవే! కొంతమంది తమ కోరికలు తీరేవి కావనీ, జీవితం ముగిసేవరకూ అవి అలా కోరికలగానే మిగిలిపోతాయనీ త్వరలోనే తెలుసుకొని వాటిని బలవంతంగా మర్చిపోడానికి ప్రయత్నిస్తారు. మరి కొంతమంది తమ కోరికలు తీరేవి కావని తెలిసినా ఆఖరి క్షణంవరకూ వాటిమీద ఆశలతోనే జీవిస్తుంటారు. సీత ఆ రెండో కోవకు చెందింది. ఆమె ఎప్పటికీ విసుగుచెందదు. ఏనాటికయినా తన కోర్కెలు నెరవేరగలవనే నమ్మకం ఆమెకుంది. అందుకు అహర్నిశలూ శ్రమపడి సాధించడానికి ప్రయత్నిస్తుంది.

తను రోజూ పడుకునే ముందు దేవుడిని ప్రార్థిస్తాడు. ఆ ప్రార్థనలో తనకోసం తను కోరేదేమీ ఉండదు. ఆ ప్రార్థనలన్నీ సీతకోసమే. "దేవుడా! నా సీతను సుఖపెట్టు, ఆమె సుఖపడేందుకు నన్నేం చేయమన్నా చేస్తాను. ఎన్ని బాధలయినా పడతాను. కానీ ఆమెని సుఖపెట్టే అవకాశం మాత్రం నాకు కలిగించు"

కేవలం సీతకోసమే ఈ స్కూలు నడపడానికి అంగీకరించాడు తను. నిజానికి ఇదికూడా తనకు సహించని వ్యాపారం. విద్యని వ్యాపారంగా మార్చ కూడదని తన అభిప్రాయం. విద్య అనేది ఒక అమూల్యమయిన వరం. దురదృష్ట వశాత్తూ మన దేశంలో అందరూ విద్యని వ్యాపారంగా భావిస్తున్నారు. పెద్దపెద్ద నగరాల్లో అదో స్మగుల్డ్ వ్యాపారం అయిపోయింది. సీట్లు బ్లాకులో అమ్మటం, డొనేషన్ పేరుతో లక్షలు ఆర్జించడం, పరీక్షలు డబ్బుకట్టి పాస్ కావడం ఒకటేమిటి? ఎన్ని విధాలుగా వీలవుతుందో అన్ని విధాలా నాశనం చేస్తున్నారు విద్యని.

ఏదేమయినా స్కూలు బాగానే నడుస్తోంది. ప్రస్తుతం దానిమీద ఆదాయం ఖర్చులుపోను నెలకు సుమారు మూడు వందలుంటోంది. రెడ్డికి కూడా సంతృప్తి కరంగా ఉంది స్కూలు వ్యవహారం. మాధవరావుకి స్కూలు పెట్టడం కోసం పెట్టుబడిగా తను ఖర్చుచేసిన రెండువేలు లెక్కలోనిది కాదు. ఆ డబ్బు తిరిగి తను రాబట్టుకోవాలని కూడా అనుకోవడం లేదు. ఆ స్కూలుని ఆధారం చేసుకొని మాధవరావు కుటుంబం గడవడమే ప్రస్తుతం తనక్కావలసింది. అది ఇంచు మించుగా నెరవేరిందిప్పుడు.

అయితే స్కూలు పరిస్థితి సీతకు ఏమంత సంతృప్తి కలిగించటం లేదు. స్కూలు అతి త్వరగా పెరిగి పెద్దదయి పోతుందనీ, అప్పుడు తమకిక ఆర్థిక మయిన ఇబ్బందులేమీ ఉండవనీ ఊహించుకొందామె. కానీ నెలలు గడిచినా పరిస్థితిలో మార్పు రాకపోయేసరికి ఆమె ఆశాభంగం పొందింది. ఇక తన జీవిత మంతా ఇలాగే చాలీచాలని బతుకు బతకాలేమో! ఎప్పటికప్పుడు మంచి రోజులొస్తున్నాయని ఆనందపడుతూ ఎదురుచూడటం, చివరికది ఎండమావిగా తేలడం జరుగుతోంది.

మాధవరావు కంపెనీ తిరిగి తెరుస్తే గాని కొంత సౌలభ్యం ఏర్పడదు. కానీ అదెప్పుడు తెరుస్తారో ఎవరికీ తెలీదు.




"పోనీ - మీరు మరేదేనా కంపెనీలో ఉద్యోగానికి ప్రయత్నించ రాదుటండీ! స్కూలు వ్యవహారాలు నేనొక్కర్తెనూ చూసుకోగలను..." అంది సీత ఒక రోజు మాధవరావుతో.

"అదివరకు ప్రయత్నించేగా - ఈ స్కూలు పెడదామని నిర్ణయించుకొందీ" ఆశ్చర్యంతో అన్నాడు మాధవరావు.

"అది నిజమేననుకోండి! మరి ఈ స్కూలు మీద సంపాదన కూడా అంతంత మాత్రంగానే ఉందిగా! - మీరు కనీసం పందో, నూటయాభయ్యో సంపాదించ గలిగినా చాలు! కొంత వరకూ సర్దుబాటు అవుతుంది..." మాధవరావు ఖిన్నుడయి పోయాడు.

సీత తనను అవమాన పరుస్తున్నట్లు అనిపించ సాగిందతనికి. అందుకే ఉద్యోగం పురుష లక్షణం అన్నారు. మగాడు ఉద్యోగం చేయకపోతే ఆడదానికి చులకన అయిపోతాడనడానికి తనే నిదర్శనం.

నిజానికి ఇప్పుడు మరీ అంతకృంగిపోవాల్సిన పరిస్థితి కాదు తమది. తామిద్దరినీ పస్తులుండ కుండా కాపాడుతోంది స్కూలు. అయినా సీతకు సంతృప్తి లేదు. ఆమెకు వేగం కావాలి! ఏ పనయినా సరే! అనుకున్నది క్షణాల్లో జరిగిపోవాలి. ఏదయినా వస్తువుని చూసి మోజుపడిందంటే అది ఇంట్లోకి వచ్చే వరకూ ఆమెకు నిద్రపట్టదు. వేరేధ్యాస ఉండదు. స్కూలు పెట్టి సంవత్సరం అయింది. సంవత్సరంలోగానే ఆస్కూలు వల్ల తాము లక్షాధికారులవాలని కలలు కందామె. ఆ కలలు ఫలించక పోయే సరికి ఇప్పుడు మళ్ళీ ఆమె ఆలోచనలు మారాయి.

ఆమెను చూస్తూంటే నవ్వూ వస్తోంది, విచారమూ కలుగుతోంది. తిరిగి ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టాడు మాధవరావు. ఎంత ప్రయత్నించినా ఫలితమేమీ కనిపించడం లేదతనికి. ఎంత తక్కువ జీతానికి ఒప్పుకొన్నా ఉద్యోగమిచ్చే వారే కనిపించడంలేదు. తన పాత కంపెనీకి వెళ్ళాడతను. తనలా బాధపడుతున్న ఉద్యోగులనేకమంది తమను ఆకలిబాధ నుంచి రక్షించమనీ, లాకౌట్ ఎత్తివేయమనీ మేనేజ్‌మెంట్‌ని ప్రాధేయపడుతూండటం కనుపించిందతనికి.



# 8

ఆరోజు ఆదివారం.

బయట జోరున వర్షం కురుస్తోంది. కాంపౌండ్‌లోని పిల్లలు వర్షపు నీళ్ళల్లో కాగితపుపడవలు విడుస్తున్నారు.

సీత కిటికీ దగ్గరే కూర్చుని బయటకు చూస్తోంది. మాధవరావు కళ్ళు మూసుకొని మంచంమీద పడుకున్నాడు. ఇద్దరి మనసుల్లో విభిన్న ఆలోచనలు!

చాలాసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది. బయట ఆటో ఆగడం చూసి ఆలోచనల్లోంచి తేరుకొందిసీత. అంతకు ముందు కొద్ది నెలల క్రితం తమ దగ్గరకొచ్చిన రెండో పబ్లిషర్ అతను.

"ఏమండీ! ఆ రెండో పబ్లిషర్ వచ్చాడు చూడండి ఆరోజు - అతనా

స్తున్నాడు..." అంది హడావుడిగా. ఆమె ముఖంలోకి కళ వచ్చేసింది అతన్ని చూస్తూనే. ఆ మొదటి నవల తరువాత మరో రెండు నవలలు ముగింపు దశలో ఉన్నాయి రెండు పత్రికల్లో. మరో నవల రాయడం కూడా ఇంచు మించుగా ముగుస్తోంది.

"నమస్తే!" గడప దగ్గర ఆగి చేతులు జోడించాడతను.

"రండి!" అంది సీత ప్రతినమస్కారం చేస్తూ.

అతను లోపలికొచ్చి సోఫా మీద కూర్చున్నాడు.

"నా పేరు రామనాథం. ఆదివర కోసారి మీ దగ్గర కొచ్చాను మీ నవలల ప్రచురణ కోసం. మీకు గుర్తుందను కొంటాను..." నవ్వుతూ అన్నాడతను.

"ఓ, యస్ గుర్తుంది..." తనూ నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"మీ నవలలు రెండు ఈ నెలతో పూర్తి అయిపోతాయని తెలిసింది. మరి వాటి విషయం ఇంకెవరి కయినా మాట ఇచ్చారా?"

"లేదు" అని చెప్దామనుకొనేటంతలో తక్కున సీత అడ్డుపడింది మాధవ రావుకి.

"ఇద్దరు పబ్లిషర్లు ఎవరో వచ్చారు క్రిందటి వారం! అయితే వారికి మాకూ డబ్బు విషయంలో ఎక్కువతేడా ఉండటం వలన కుదరలేదు..." అందామె త్వరత్వరగా మాట్లాడేస్తూ.

మాధవరావు ఆశ్చర్య పోయాడు. సీత ఇంత త్వరగా అలా మాట్లాడాలని ఆలోచించు కోవడం, తను మాట్లాడక ముందే మాట్లాడేయడం - నిజంగా అదీ ఒక కళే! ఆ కళ సీతకు అబ్బింది. తనకు అదికూడా లేదు.

"ఓహో... అలాగా!" నింపాదిగా అన్నాడు రామనాథం.

"వాళ్ళెంత ఇస్తామన్నారు?" తిరిగి కొద్ది క్షణాల తర్వాత అడిగాడతను.

మాధవరావు సీత వంక చూశాడు ఏం చెప్తుందా అని.

"ఒకాయన నవలకు వెయ్యి రూపాయలు ఇస్తానన్నాడు. మరొకాయన పదకొండు వందలకంటె ఎక్కువ ఇవ్వలేనన్నాడు..."

రామనాథం ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"అసలు మీరెంత అడుగుతున్నారు?" నెమ్మదిగా అడిగాడు.

"పది హేను వందలు ..." నిక్కచ్చిగా అంది సీత.

అతను చాలా సేపటి వరకూ మాట్లాడ లేదు. ఆలోచనల్లో పడ్డాడు. సీత సంసిద్ధంగా ఉంది, అతనేమయినా ఇంకా అడిగితే జవాబివ్వడానికి.

మాధవరావు వారిద్దరినీ గమనిస్తు న్నాడు. అతనికి సీత మాటలే అత్యంత ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

రామనాథం బిజినెస్ మన్. కనుక అతను ఎలా మాట్లాడినా తను ఆశ్చర్య పోనక్కర్లేదు. ఆశ్చర్యపోడు కూడా! కాని సీత అతని కంటె ఘనురాలిలాగా, అంతకంటె పెద్ద వ్యాపారస్తురాలు లాగా మాట్లాడడం అతడిని చకితుణ్ని చేస్తోంది. ఆనాడు, ఆ మొదటి రాత్రిలో-ఎంతో సిగ్గుగా, అమాయకంగా తనలో ఐక్య మయిపోయిన సీతేనా ఇంత చాకచక్యం ప్రదర్శిస్తోంది ?

"పది హేను వందలు చాలా




ఎక్కువే..." నీళ్ళు నములుతూ అన్నా డతను.

"కావచ్చు! కానీ అది నా నిర్ణయం, అవసరం! అంతకంటె తక్కువయితే నేను వాటిని అమ్మదల్చుకోలేదు. అవి అసలు అమ్ముడు కాకపోయినా నాకు ఇష్టమే..."

"అంత డబ్బు మేమింతవరకూ ఎవ్వరికీ ఇవ్వలేదు. ఇస్తే మేము నష్ట పోతాము..." మళ్ళీ అన్నాడతను.

"మీరు నష్టపడాలని నా ఉద్దేశ్యం కాదు..." లౌక్యంగా అంది సీత.

"పోనీ నేనోమొత్తం చెప్తాను వింటారా! నవలకు పన్నెండు వందలిస్తాను! అంతకంటె ఎక్కువివ్వడం నా వల్ల కాదు. ఉపయోగమూ లేదు. మీకు అంగీకారమయితే చెప్పండి..."

సీత నవ్వింది.

"మీరు బేరాలాడటం బావుండ లేదు .... ఆ పని మా ఆడాళ్ళు చేయాలి!"

అతను నవ్వేశాడు.

"నిజమే కాని ... ఇది వ్యాపారం కాబట్టి తప్పదు. నాకు నష్టం రాకుండా చూసుకోవాలంటే బేరసారాలు తప్పవు కదా..."

"సారీ! అంత తక్కువయితే ఇవ్వడం ఇష్టం లేదని ముందే చెప్పాను కదా...!" మీరు ఇంక వెళ్ళవచ్చు అన్నట్లు చూస్తూ అందామె.

"మీరు మరీ అంత కఠినంగా ఉంటే బావుండదు. ఇవతల మా ఇబ్బందులు కూడా ఆలోచించాలి మరి. మీకొక్కరికే కాదు-మీ నవలలన్నీ అమ్ముడు పోవాలంటే చాలా మందికి లంచాలు తినిపించాలి..."

"అవతలివాడి ఇబ్బందులు గురించి ఆలోచిస్తే వ్యాపారమేం సాగుతుంది?" నవ్వుతూ అంది సీత.

రామనాధం జవాబివ్వలేక నెత్తి గోక్కున్నాడు.

"చూడమ్మా! ఇంకొక్క మాట చెప్తాను. పదమూడు వందలు! అంతే! ఇష్టమయితే చెప్పండి! లేదంటే నా దారిన నేను పోతాను ..." లేచి నుంచుంటూ అన్నాడతను.

"ఊహూ!" తల అడ్డంగా తిప్పింది సీత.

"సరే! మీ ఇష్టం! వస్తానండీ! నమస్తే..." బయటకు వెళ్ళిపోతూ అన్నాడతను.

ఆటో రిక్షా కదిలేవరకూ చూసి గట్టిగా నవ్వేశాడు మాధవరావు.

"సీతా! ఇదంతా నాకెలా ఉందో తెలుసా? ఆరేళ్ళ కుర్రాడు మొదటి సారిగా సర్కస్ చూస్తే ఎలాంటి థ్రిల్ అనుభవిస్తాడు? అలాంటి స్థితిలో ఉండిపోయాను! నాకనిపించింది - నేను మాట్లాడకపోవడం ఎంతో మంచిదైందని. నువ్వు చొరవచేయకపోయినట్లయితే ఏ ఎనిమిది వందలకో ఒప్పేసుకొని ఉండే వాడిని!"

"నాకు తెలుసు-మీరు అంత పనీ చేస్తారని" నవ్వుతూ అంది సీత.

"కానీ అతన్నలా వదిలేశావేం? పద మూడు వందలు తక్కువేం కాదుగా?"

"అతనెక్కడికీ పోడు! మళ్ళీ వస్తాడు చూస్తూండండి! పదమూడు వందల వరకూ వచ్చినవాళ్ళు రెండు వందల కోసం వెనక్కిపోతారా! అయినా ఇదే బాగా పేరున్న రచయిత్రులకయితే ఐదు

వేలు కూడా ఇస్తార్ట! మరి మనకి పది హేను వందలివ్వడానికేమయింది?"

మాధవరావుకీ విషయాలన్నీ కొత్తగా ఉన్నాయి. సీత కిన్ని విషయాలు తెలుసని కూడా అతననుకోలేదు.

"కాని సీతా! పెళ్ళినాటికీ, ఇప్పటికీ నీలో ఎంత మార్పువచ్చిందో తెలుసా? అసలు అప్పటికీ, యిప్పటికీ పోలికే లేనంతటి మార్పు. ప్రపంచాన్నంతా పూర్తిగా చదివేసినట్లు మాట్లాడుతున్నావ్ ఈకొద్దిరోజుల్లోనే! ఎలా జరిగిందంతా!"

"ఇవన్నీ జీవితమూ, అవసరాలూ నేర్పిస్తున్న పాఠాలండీ! అంతే!" నవ్వేస్తూ అందామె.

"ఇవాళ నేనో నిజం తెలుసుకొన్నాను సీతా! నువ్వు అన్ని విధాలా నాకంటె గొప్పదానివి! నేను ఉత్తరాలు కూడా రాయడం చేతకాని వాడిని! నువ్వు ఎంతోమంది పాఠకుల నాకట్టుకొన్న రచయిత్రివి! నీకు జీవితం మీద ఆశ ఉంది! నేను జీవచ్ఛం లాంటి వాడిని. నువ్వు అనుకొన్నది సాధించ గలవన్న నమ్మకం నీకుంది! నాకు లేదు! ఎలాంటి అవాంతరాన్నయినా నువ్వు ఎదుర్కొగలవు. నాకది చేతకాదు. ఇన్ని విధాలుగా వెనుకబడి ఉన్న నన్ను చేసుకొన్నందుకు నీకెప్పుడయినా విచారం కలుగుతుందా సీతా!" ఆవేదనతో అడిగాడతను.

సీతకు నవ్వు వచ్చింది. నిజమే అతనన్న మాటలు! తనకు అతను సరయిన జోడీ కాదు! తన మనస్తత్వం వేరు-అతని ఆలోచనలు వేరు. జీవితాన్ని పూర్తిగా అనుభవించాలనుకొనే తత్త్వం తనది. ఎలాగోలా జీవితం లాగించాలనే మనస్తత్వం అతనిది. అయినా తనెప్పుడూ అతన్ని చేసుకొన్నందుకు విచారించ లేదు. అతని ఆలోచనా ధోరణి మారనందుకు మాత్రమే విచార పడుతోంది అంతే!

"మీరు అలాగే ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతూండండి! నేను జవాబు చెప్తే అప్పుడడగండి..." నిష్టూరంగా అందామె.

"ఏదేమయినా నేనో నిర్ణయం తీసుకొన్నాను సీతా! ఇకనుంచీ ఇలాంటి విషయాలన్నీ నువ్వే మాట్లాడాలి. నేను కల్పించుకొంటే అంతా అభాస యిపోతుంది. అంచేత నేను పూర్తిగా డమ్మీ నయిపోతాను! సరేనా?"

"మీ ఇష్టం! మీకంత భయంగా ఉంటే నేను మాట్లాడతాను లెండి! నా కిప్పుడు బాగాఅనుభవమయిపోయిందిగా, ఎవరితో ఎలా మాట్లాడాలో..." చిరునవ్వుతో అందామె.

ఆమె అన్నట్లే ఆ సాయింత్రానికే మళ్ళీ వచ్చాడు రామనాధం.

మూడు వేల రూపాయలకు చెక్కు రాసిచ్చి అగ్రిమెంట్ రాయించుకొని వెళ్ళి పోయాడు. మాధవరావు ఆశ్చర్యానికి అంతులేదు. మూడువేల రూపాయలు సీత క్షణంలో రాబట్ట గలిగిందంటే ఇదో గొప్ప వింతే! తను పది నెలలు కష్టపడి కంపెనీలో ఉద్యోగం చేస్తేగాని సంపాదించలేని మొత్తం. అదంతా సీత కేవలం రెండు నవలలు రాసి సంపాదించ గలిగింది.

ఇది జరిగిన కొద్దిరోజులకు మరో విచిత్రం కూడా జరిగింది. ఓ యువకుడు సాయంత్రం సమయంలో ఆమె ఇంటి కొచ్చాడు.




"నమస్కారం..." అన్నాడతను ఆమెను చూస్తూనే.

"నమస్తే!" అంది సీత ఎవరా అని ఆశ్చర్యపోతూ.

అతను లోపలికి నడిచి కూర్చున్నాడు.

"నా పేరు శివరామ్. నేనో మాస పత్రికను ప్రారంభిస్తున్నాను. వచ్చే దీపావళికి విడుదలవుతుంది ప్రారంభ సంచిక. అందులో మీ సీరియల్ ఉండాలి! మీ సీరియల్ అంటే నాకెంతో ఇష్టం. ఇంతే నేను చెప్పదలుచుకొంది. మీ రచనలు విపరీతంగా చదివే పాఠకులున్నారనడం ఒక్కటే కారణం కాదు. నేను కూడా మీ అభిమానిని. కనుక నా పత్రికలో మీ సీరియల్ ఉండాలని ఓ సెంటిమెంట్ డెవలప్ చేసుకొన్నాను! దయచేసి కాదనకండి! మీరు నవలంతా ఒకేసారి కూడా ఇవ్వనక్కర లేదు. ప్రతినెలా కొంత రాసి ఇవ్వచ్చు!"

సీత ఆశ్చర్యం నుంచీ తేరుకోడానికి చాలా సేపు పట్టింది. అతనికేం జవాబు చెప్పాలో తెలీలేదు. నవల రాయడానికి తను సిద్ధంగానే ఉంది. కాని అతను ఎంత డబ్బు ఇవ్వాలను కొంటున్నాడో ఎలా తెలుసు కోవడం! ఇదే పబ్లిషరు అయినట్లయితే ఎలా మాట్లాడాలో తనకు తెలుసు. కానీ ఇతనో పత్రిక యజమాని. అదీగాక తన అభిమాని అట! మరిక్కడ మొఖమాటం అడ్డొస్తుంది, ఆ విషయం అడగాలంటే!

"సరే! ప్రయత్నిస్తాను..." అందామె తేల్చకుండా!

"థాంక్యూ! నాకు తెలుసు మీరు

తప్పుకి సహకరిస్తారని" జేబులోనుంచి చెక్‌బుక్ తీసి ఓ చెక్కు మీద సంతకం పెట్టి మొత్తం రాయకుండా ఇచ్చాడతను.

ఇది మరీ ఆశ్చర్యం కలిగించింది సీతకి.

"మీకు ఎంత కావాలో, ఆ సంఖ్య మీరే వేసుకోండి! నాకేమీ అభ్యంతరం లేదు" నవ్వుతూ అన్నాడతను.

సీత అయోమయంగా తలూపింది.

అతను మరోసారి ధన్యవాదాలు తెలుపుకొని వెళ్ళిపోయాడు.

ఆ చెక్కుమీద ఎంత వేసుకోవాలో ఓ పట్టానతేలలే దామెకి. మాధవరావు ఇంటి కొచ్చాక అడిగి నిర్ణయించుకోవచ్చని అతనికోసం ఎదుర్చూస్తూ కూర్చుంది. చాలా పొద్దుపోయాకగాని మాధవరావు ఇల్లు చేరలేదు.

"ఇవాళో శుభవార్తమోసుకొచ్చాను" అన్నాడతను ఇంటికొస్తూనే.

"ఏమిటది?" విస్మయంతో అడిగింది సీత.

"మా కంపెనీ వచ్చే సోమవారం నుంచి తెరుస్తున్నారు మళ్ళీ!"

"నిజంగానా ?" నమ్మలేనట్లు అడిగిందామె

"అవును! ఇప్పటివరకూ అందుకే ఆలస్యమయింది. వర్కర్లూ, కంపెనీ చివరకు ఈ ఒప్పందానికి వచ్చారు"

"అమ్మయ్య! పెద్ద బరువు దిగిపోయి నట్లుంది" ఆనందంగా అంది సీత.

"ఇక నీ యిష్టం! నీ డబ్బుతో నీక్కావాలను కొన్నవన్నీ కొనేసుకోవచ్చు ఇంట్లో ఖర్చు ఎలాగూ నేను చూసుకొంటానుగా!" నవ్వుతూ అన్నాడతను.

"అదలా వుంచండి మీకూ నేను మరో మంచి వార్త చెప్తాను" అందామె.

"ఏమిటది"

"ఇదిగో..." బ్లాంక్ చెక్ అతనికి చూపించిందామె.

అందుకొని ఎగాదిగా చూశాడతను.

"ఎవరిదిది ?"

"నాకే ఇచ్చాడో పత్రికాధిపతి!"

"ఎందుకు ?"

"తను ప్రారంభించబోయే పత్రికకు సీరియల్ రాయడానికి ?"

మరి అందులో ఎంత ఇచ్చేదీ వేయలేదేం !"

"వేస్తే అందులో ఆశ్చర్యమేముందీ? నా యిష్టం వచ్చినంత వేసుకోమన్నాడు"

ఈ సారి మాధవరావు తెల్లపోయాడు.

"అంటే ?"

"అదేమనం నిర్ణయించుకోవాలిప్పుడు ఎంత తీసుకొందామంటారు ?"

మాధవరావు కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డాడు.

మొదటిసారిగా అతనికి భయం వేసింది. సీత రూపం రచయిత్రిగా వెయ్యింతలై తనముందు నిలబడినట్టు కనిపించింది. సీత భవిష్యత్తు ఎంతో ఉజ్వలంగా ఉన్నదనడానికి "ఈ చెక్కే నిదర్శనం. ఆమె మరికొన్ని రోజుల్లో ఎంతో ఎత్తు ఎదిగిపోవడం ఖాయం.ఆమె చుట్టూ అభిమానులు, పత్రికాధిపతులు, పబ్లిషర్లూ మూగిపోతారు. తనకూ ఆమెకూ మధ్య పలుచని గోడకట్టేస్తారు. అప్పుడు మరి తామిద్దరి మధ్యా ఇదే విధమయిన సంబంధ బాంధవ్యాలుంటాయా? ఇదే ప్రేమానురాగాలుంటాయా? ఏమో ఉండవచ్చు. ఉండక

 

పోనూవచ్చు. కాని తనకు నమ్మక ముంది. సీత తన విషయంలో మాత్రం ఎప్పటిలానే ఉంటుంది. మారదు.

ఆమెను హఠాత్తుగా దగ్గరకులాక్కొని గుండెలకు హత్తుకొన్నాడతను.

"సీతా! ఈ బ్లాంక్ చెక్కుకి అర్థం ఏమిటో తెలుసా? నువ్వు ఎదిగిపోతు న్నావు! ఎవ్వరికీ అందనంత ఎత్తుకు ఎదుగుతున్నావు! నీ భవిష్యత్తు మహో జ్వలంగా వెలిగిపోతుంది!" సీత అతని గుండెలమీద ప్రేమగా చుంబించింది.

"రాయి సీతా! మొఖమాటపడకు! అవతలివాడు బాధపడతాడేమోనని ఆలో చించకు. మూడు వేలురాయి చెక్కుమీద. ఇహ ఎంతోకాలం కలల్లో విహరించకు! నీ కోరికలకు కళ్ళాలు తీసెయ్యి. మనసు పడ్డ వస్తువునల్లా స్వంతం చేసుకో! జీవి తాన్ని అనుభవించు! ఇలాంటి అవకాశం అందరికీ ఇవ్వడు దేముడు. నీకిచ్చాడు కనుక సద్వినియోగం చేసుకో" ఆవేశంగా అన్నాడతను.

సీత విస్తుపోయిందతని ఆవేశం చూసి.

"అవును సీతా' ఇవి నేను ఆవేశంతో మాట్లాడుతున్నా మాటలే కావచ్చు. కాని ఆలోచించే మాట్లాడుతున్నాను. ఇంక నువ్వేమీ ఆలోచించకు! నేను చెప్పినట్లు చేసేయ్. నీ ఇష్టాల్నీ, కొర్కెల్నీ తీర్చే సామర్థ్యం ఎలాగూ నాకులేదు కనీసం నువ్వయినా నీ గురించి చూసుకో!... ఇంతకంటే ఇంక నేనేమీ చెప్పలేను..."

సీత ఆనందంగా అతని కళ్ళల్లోకి చూస్తూండి పోయింది.

ఆ ఆదివారం రెడ్డి, సుభాషిణి వచ్చారు వాళ్ళింటికి. ఇంట్లో కొత్తగా వెల సిన డెకొలం మంచాలూ, వాటిమీద యూఫోమ్ పరుపులూ, అందమయిన దుప్పట్లూ చూస్తూనే ఆశ్చర్యపోయా రిద్దరూ.

"అరె! ఇవన్నీ ఏమిటి?" ఆశ్చ ర్యంగా అడిగాడు రెడ్డి.

"సీత కోరికలకు ప్రాణాలొచ్చాయి" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

సీత సిగ్గు పడిపోయింది.

"అయితే స్కూలు మీద సంపాదన బాగానే ఉందన్నమాట" నవ్వుతూ అంది సుభాషిణి. సీతకు ఉక్రోషం ముంచుకొచ్చింది ఆ మాటతో తామిద్దరూ కేవలం ఆ స్కూలు మీదే ఆధారపడి బ్రతుకుతున్నారను కొంటున్నారు కాబోలు. వాళ్ళ రెండు వేలూ వాళ్ళకిచ్చేస్తేగాని కొంతవరకూ ఆ భావన పోదు అనిపించిందామెకి.

"రేపట్నుంచీ మా ఫాక్టరీ లాకౌట్ ఎత్తేస్తున్నార్రా!" చెప్పాడు మాధవరావు

"నిజంగానా! ఆశ్చర్యంగా అడిగాడు రెడ్డి.

"అవును! ఇప్పుడో సమస్య ఎదు రయింది మళ్ళీ!"

"ఏమిటి!"

"నేను ఆఫీసుకెళ్తే-స్కూల్ ఎవరు చూస్తారు! సీత ఒకర్తీ చూసుకోవడం కష్టం కదా!"

"నిజమే!" ఆలోచనలో పడ్డాడు రెడ్డి.

"అదీగాక ఈ యేడు మనస్కూలుకి దగ్గర్లోనే మరో స్కూలు తెరిచారు. అంచేత కొంత మంది పిల్లలు తగ్గి పోవచ్చు కూడా! ఇంతమంది ఉంటేనే నెలకు మూడొందలు మిగలడం కష్టంగా ఉంది. మరికొంతమంది తగ్గితే - అసలు

స్కూలు నడపడమే వృధా అవుతుందేమో!" తన అనుమానం వెలిబుచ్చాడతను.

"మీ ఇష్టం! మీరే ఆలోచించి ఏదో ఒకటి నిర్ణయించుకోండిమరి" ఆ విషయం వారికే వదిలేస్తూ అన్నాడు రెడ్డి.

వాళ్ళు వెళ్ళిపోగానే "చూశారా, ఆవిడేం అంటోందో?" రోషంగా అంది సీత.

"ఏమంది!" ఆశ్చర్యంగా అడిగాడు మాధవరావు.

"మనం ఈ ఖరీదయిన ఫర్నిచర్ ఆ స్కూల్ మీద సంపాదనతోనే కొన్నామట" గట్టిగా నవ్వేశాడు మాధవరావు.

"ఎందుకలా నవ్వుతారు?"

"నిజంగానే స్కూల్ మీద వచ్చిన డబ్బుతో కొన్నామా మనం?"

"బాగుంది! మీకు తెలీదా?"

"కానప్పుడు, మరి ఎవరెలా అనుకొంటే మనకెందుకు? వాళ్ళనుకొన్నంత మాత్రాన నీ రచనల మీద వచ్చిన డబ్బు స్కూల్ డబ్బు అయిపోతుందా? అవేమీ పట్టించుకోకూడదు మనం. ఎవరయినా తప్పుగా అనుకొంటే నవ్వుకొని ఊరుకోవాలి! అంతేగాని వాళ్ళతో యుద్ధానికి దిగకూడదు! యుద్ధంచేస్తే వాళ్ళన్నమాటే నిజమేమోనని మరింత అనుమాన పడతారు వాళ్ళు..."

"ఇదంతా మనస్కూలుకి ఆయన సహాయం చెయ్యబట్టేగా వచ్చింది. రేపే వాళ్ళ రెండు వేలూ తీసుకెళ్ళి వాళ్ళకి యిచ్చేయండి! ఇకనుంచీ ఈ స్కూలు కూడా మూసివేద్దాం! మీకు కంపెనీ తెరుస్తున్నారు. నాకేమో రాసుకోడానికి టైము చాలటంలేదు. ఇంకెందుకొచ్చిన గొడవ ఈ పాడు స్కూలు..."

"కాని సీతా ఇప్పుడు వాళ్ళ డబ్బు ఎక్కడి నుంచి తెస్తాం?"

"నేనిస్తాను!! బాంక్‌లో ఇంకా డబ్బుందిగా!"

"సరే! నీ ఇష్టం!..." అయిష్టంగానే అన్నాడు మాధవరావు.

"మరో విషయం! కొత్తగా మరో స్కూలు పెట్టారు కదా మన వీధిలో!





మీరు ఇప్పుడే ఆ స్కూలు ఓనరు దగ్గర కెళ్ళి-మన స్కూలు కావాలంటే వాళ్ళకి ఇచ్చేస్తామనీ. అందుకు ప్రతిఫలంగా ఎంత దబ్బిస్తాడో అడిగిరండి"

"మన స్కూల్లో ముప్పై పైచిలుకు పిల్లలున్నారు కదా! అతనికి చాలా లాభం కలుగుతుంది కనుక మనం అడిగినంత ఇచ్చినా ఇచ్చేస్తాడు..." తిరిగి అందామె.

"ఎంత అడగమంటావ్ ?"

"మన పెట్టుబడి ఇమ్మనండి! కాదంటే కొంత అటూ, ఇటుగా ఒప్పేసుకోండి!"

అంతా సీత చెప్పినట్లుగానే జరిగింది. పదిహేనువందలు ఇవ్వడానికి ఒప్పుకొన్నాడు ఆ మరో స్కూలు యజమాని. నెలరోజుల్లోగా ఆ మొత్తం ఇచ్చేసేట్లు ఒప్పందం కూడా జరిగిపోయింది.

ఇదంతా సీత ఎందుకు చేసిందో తేలిగ్గానే ఊహించుకొన్నాడు మాధవరావు. కేవలం సుభాషిణి అన్న ఒక్క మాటే సీతని రెచ్చగొట్టింది. అందుకే ఆ స్కూలే ఉండకూడదని నిర్ణయించుకొందామె. ఆ నిర్ణయం అమలు జరిపింది.



# 9

సోమవారం మాధవరావు కంపెనీ ప్రారంభించబడింది. ఆ రోజు అతను సాయంత్రం ఇంటికొచ్చేసరికి సీత మంచం మీద పడుకొని ఉంది.

"ఏమిటి పడుకొన్నావ్ ?" అడిగాడు మాధవరావు.

"ఇందాక కాఫీ పెడదామని వంటింట్లోకెళ్తేంటే కళ్ళు తిరిగాయి. అక్కడే కూర్చుండిపోయాను! చాలా సేపు అదోలా ఉండేసరికి భయంవేసి వచ్చి పడుకున్నాను" కొంచెం బెదురుగా అందామె.

మాధవరావు ఆమె మెడ కింద చెయ్యి ఉంచి చూశాడు. ఒళ్ళు చల్లగానే ఉంది.

"ఎందుకయినా మంచిది! డాక్టరుని తీసుకొస్తానుండు..." అప్పుడే బయట కెళ్ళబోయాడతను.

"ఇప్పుడొద్దులెండి! మరోసారి కళ్ళు తిరిగితే పిలుద్దురుగాని" వారిస్తూ అందామె.

"అలాగయితే ఓసారి లేచినుంచో"

ఆమె లేచి నుంచుంది గాని ఏమీ అనిపించలేదు. మరి కాసేపటి తర్వాత హఠాత్తుగా వాంతి అయింది. వెంటనే తెలిసిపోయింది సీతకి, తన ఒంట్లో బాగోపోడానికి కారణమేమిటో. ఎక్కడలేని సిగ్గూ ఆవహించిందామెని.

"ఇదిగో! ఈ గొడవంతా ఏమిటను కొంటున్నారు !" ఆనందంగా అంది మాధవరావుతో.

"ఏమిటి ?" ఆశ్చర్యంగా అడిగాడతను.

"నెల తప్పిందండీ !" రహస్యంగా అందామె.

"హారి... అదా... " గట్టిగా నవ్వేస్తూ అన్నాడతను. నన్ను భలే గాబరా పెట్టేశావే !"

"నాకు మాత్రమేం తెలుసు! ఇప్పుడు

వాంతి అవగానే అనుమాన మొచ్చింది"

ఆమెని అమాంతం చిన్న పిల్లలా ఎత్తుకొని మంచం మీదకు చేర్చాడతను.

"ఇవాళ్ళ నుంచీ నీ స్థానం ఇక్కడే! తెలిసిందా! ఇంకే పని చేయకు!" మృదువుగా అన్నాడు, ఆమె కళ్ళ మీద పెదాలు ఆన్చుతూ

"బావుంది ! మరి వంటెవరు చేస్తారుట ?"

"నేను !"

"మీరు వంట చేస్తారా ?" నవ్వాపుకొంటూ అంది.

"ఏం ? నువ్వు రాకముందు ఎవరు చేశారను కొన్నావ్ మరి ?"

"ఏం అక్కర్లేదు. అయినా నెల తప్పినంత మాత్రాన పని పాటా మానేస్తారా ఏమిటి అందరూ ? అలాగయితే కాన్పు కష్టమవుతుందట"

"ఎవరు చెప్పారు ?"

"ఓ డాక్టరమ్మ రాసిన వ్యాసంలో చదివాను"

"సరే ! డాక్టరమ్మ అంటున్నావ్ కాబట్టి ఊరుకొంటున్నాను. అయినా కొంచెం పనిచేస్తే చాల్లే నువ్వు ! మిగతాది నేను చూసుకొంటాను... సరేనా ?"

"సరే – సరే – సరే" చిరాకు నటిస్తూ అంది సీత.

ఆ రోజునుంచీ ఓ విధమయిన కొత్త ఉత్సాహం ప్రవేశించిందిరువురులోనూ. సగానికి సగం పన్నులన్నీ తనే చేసేస్తున్నాడు మాధవరావు. సీత పవల్లా కొంతసేపు వంటింట్లో గడపడం – మిగతా సమయం రాసుకొంటూ కూర్చోవడం.

 

ఇప్పుడు ఇంట్లో సామాన్లు ఎక్కువయి పోయాయి. ఫానూ, స్టీలు అల్మారా, మంచాలూ, రేడియో, ఖరీదయిన బట్టలూ–

"లాభంలేదు. ఈ ఇల్లు మారాలండీ! సామానుతోనే నిండి పోయింది. మనం తిరగడానికి స్థలమే లేదు. అదీగాక ఇప్పుడో పాప కూడా వస్తోంది. ఇంకెక్కడ సరిపోతుందీ?"

నిజమే ననిపించింది మాధవరావుకి ! ఈ ఇల్లు తీసుకొనేప్పుడు తన పరిస్థితి వేరు! ఇప్పుడు సీత ఆ పరిస్థితులు గుర్తు లేకుండా చేసేసింది. డబ్బు కిప్పుడు ఏ మాత్రం కొదవలేదు. ఆమె పేర ఎకౌంట్‌లో చాలా డబ్బుంది. అదెంతో అతనెప్పుడూ అడగలేదు. తెలుసుకోవాలన్న కుతూహలమూ లేదు. షుమారు పదివేలవరకూ ఉంటుంది. అయినా తనప్పుడు ఓ పెద్ద ఇల్లు అద్దెకు తీసుకోవాలంటే అద్దె చాలా ఎక్కువే ఇవ్వాల్సి వస్తుంది. కనీసం రెండు వందలయినా ఇవ్వాలి. అలా సీత బ్యాంక్ బాలెన్స్ మీద ఆధారపడి అంతంత అద్దె ఎలా ఇవ్వాలో అతనికి అర్థం కాలేదు.

"ఇప్పుడెందుకులే సీతా ! పాపాయి వచ్చాక అప్పుడు మారుద్దాం! ఏమంటావ్!" అన్నాడతను.

"ఈలోగా చూస్తూండండి! ఎక్కడయినా మంచి ఇల్లు దొరికితే మారిపోదాం!"

"అలాగే !"

నెలలు నిండగానే సీతను నర్సింగ్ హోమ్‌లో చేర్పించాడు మాధవరావు. కాన్పు సమయంలో ఆమె తల్లిదండ్రులొచ్చి ఉన్నారు కొద్ది రోజుల పాటు.

ఆడపిల్లతో ఇంటికి తిరిగి వచ్చింది సీత.

"అమ్మాయికి పాపాయితో చేసుకోవడం కష్టం' రెండు నెలలు మా ఇంట్లో ఉంచుకొని పంపిస్తాం" అంది సీత తల్లి.

వెంటనే ఒప్పుకున్నాడు మాధవరావు.

సీత వాళ్ళ తల్లిదండ్రులతో వెళ్ళిపోయింది. ఆమెలేని ఆ ఇంట్లో ఉండాలంటే అశాంతిగా ఉండేది మాధవరావుకి. ఆ ఇంట్లో ప్రతి వస్తువూ ఆమెనే గుర్తుకు తెస్తోంది. అతికష్టం మీద మూడు నెలలూ మూడు యుగాల్లా గడిపాడతను.

"త్వరలో వచ్చేస్తున్నాను ఇల్లు చూడండి" అంటూ ఉత్తరాలు రాసింది సీత. ఇల్లుకోసం ప్రయత్నాలు మొదలు పెట్టాడు తను. కానీ అదంత సులభమయిన విషయంగా కనిపించలేదు. సీత వచ్చేసినా ఇల్లు మాత్రం దొరక లేదు. పాపాయితో టాక్సీ దిగుతున్న ఆమెను చూస్తూ ఆశ్చర్యపోయాడతను.

సీత అదివరలా లేదిప్పుడు. ఇప్పుడు ఆమెలో పరిపూర్ణమయిన స్త్రీ రూపం కనిపిస్తోంది. అదివరకటి కంటే లావయింది. తెల్లబడింది. ముఖంలో చిలిపితనం పోయింది. మరింత అందం, ఆకర్షణ. ఏమిటిది? ఇంత మార్పు ఈ మూడు నెలల్లోనూ?

"ఏమిటలా చూస్తున్నారు?" నవ్వుతూ అడిగిందామె.

"నా భార్యేనా లేక మరే దేవతేనా వచ్చిందా అని చూస్తున్నాను" ఇంకా చూపులు మళ్ళించుకోలేక అన్నాడతను.

"చాల్లెండి! ఎవరి పెళ్ళాం వాళ్ళకి అప్సరసలాగానే కనిపిస్తుందట" సిగ్గుపడుతూ అంది.

పాపాయిని అందుకొన్నాడతను.

అచ్చం సీత పోలికే!

"ఇల్లు సంగతేమయింది?" అడిగిందామె.

"ఏదీ? ఇంకా వెదుకుతూనే ఉన్నాను"

"నాకు తెలుసు మీ సంగతి! అద్దె ఎక్కువయిపోతుందని నిర్లక్ష్యం చేస్తున్నారు కదూ?"

"ఛ! మరీ అంత నిందవేసేయకు! సిన్సియర్‌గా వెతుకుతూనే ఉన్నాను"

"అదంతా నాకనవసరం మూడు నెలలు టైమిస్తున్నాను. ఈలోగా మారాల్సిందే!"

"ఓ యస్! ఆ టైము చాలు!" ఒప్పుకొన్నాడతను.

పాపాయితో కొత్త జీవితం మొదలయింది.

క్షణం తీరిక ఉండటం లేదు మాధవరావుకిప్పుడు! సీత ఇంటి పనంతా చేసుకొనేంతవరకూ పాపాయిని చూసేబాధ్యత అతనిదే! శలవు రోజుల్లో వంట పని కూడా అతనిదే! సీత తన రచనా వ్యాసంగంలో మునిగిపోయి ఉంటుంది. మరి కొద్ది రోజులు గడిచిపోయాయిగాని మరో ఇల్లు మాత్రం దొరకలేదు.

ఓ రోజు మధ్యాహ్నం సమయంలో ఇంటిముందు కారు ఆగటం గమనించింది సీత. ఎవరో పబ్లిషరేమో అనుకొందామె. ఖరీదయిన టెర్లిన్ బట్టల్లో ఓ వ్యక్తి కారు వెనుక డోర్ తీసుకొని దిగి నిలబడ్డాడు. డ్రయివర్ ముందుగా కాం

పౌండ్‌లోకి వచ్చి "రచయిత్రి సీతగారి యిల్లెక్కడ" అంటూ వాకబు చేసి ఇల్లు చూసి వెళ్ళి ఆయనకు చూపించాడు.

అతను నెమ్మదిగా సీత ఇంటి వేపు వచ్చాడు.

"న మ స్తే! మీరేనా సీతగారు ?" అడిగాడతను మర్యాదగా.

"అవునండీ! లో ప ల కు రండి" ఆహ్వానిస్తూ అంది సీత.

అతను లోపలకు వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. అతన్తోపాటు ఓ విధ మయిని మ త్తెక్కించే సువాసన కూడా ఇంట్లోకి ప్రవేశించి ఇల్లంతా అల్లుకు పోయింది.

"నా పేరు వర్ధనరావు! గంధర్వా ఫి లి మ్స్ ప్రొడ్యూసర్‌ని" అన్నా డతను చిరునవ్వుతో.

సీత ఉలిక్కిపడింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి కొద్ది క్షణాల పాటు. అంతటి పెద్ద ప్రొడ్యూసర్ తమ ఇంటికెందుకొచ్చినట్లు ? తన నవలేమ యినా సినిమా తీసే ఉద్దేశ్యం ఉందా? సినిమా అంటే బోలెడు డబ్బిస్తారని తనకు తెలుసు.

"మీ నవలలన్నీ చదివాను నేను. అన్నిటిలోకీ 'జీవిత సోపానాలు' నవల నాకు బాగా నచ్చింది. మీరు నమ్ముతారో నమ్మరోగాని నాలుగుసార్లు చదివానది. అంత పర్‌ఫెక్ట్‌గా ఉంది!" ఆగాడతను.

సీత ఆనందాన్ని అణచుకోడానికి ప్రయత్నిస్తోంది.

"అరె! మీరు నిలబడే ఉన్నారేం కూర్చోండి!" పెద్ద తప్పు జరిగిపోయి నట్లు అన్నాడతను.

సీత సన్నగా మందహాసం చేసిఅతని కెదురుగ్గా మంచం మీద కూర్చుంది. కొద్ది క్షణాలు ఆమెవంకే మైమరచినట్లు చూశాడతను. అతని చూపులు సీతకి ఇబ్బంది కలిగించాయి.

"నాలుగుసార్లు చదివాక, ఆ నవల సినిమాగా తీస్తే ఎలా వుంటుందా అని ఆలోచించాను. దానిమీద కొంత వర్క్ కూడా చేశాను. చాలా ప్రోత్సాహకరంగా ఉంది. అక్కడక్కడా చిన్న మార్పులు కొన్ని చేస్తే అది మంచి నవలే కాదు, మంచి సినిమా కూడా అవుతుందని పించింది. అం దు కే మీ దగ్గర కొచ్చాను"

"ఓహో..."...

"నా కనిపించిందేమిటంటే నవలలో చాలా చక్కని సంభాషణలు రాశారు ముఖ్యమయిన సన్నివేశాల్లో.మరిసినిమాకి కూడా మీరే ఎందుకు రాయకూడదు ?"

సీత ఆశ్చర్యంతో చూసిందతని వంక.

"కాని సంభాషణలు రాయడం అంత తేలిక కాదనుకొంటాను"

"అవన్నీ మాకొదిలేయండి! నవల రాసిన మీరు సంభాషణలు రాయలేరంటే నేను నమ్మను. ఓ పక్క నవల్లో సంభా షణలు కనబడుతూనే ఉన్నాయిగా మీరు యిప్పుడున్న డైలాగ్ రైటర్స్ చాలా మంది కంటే బాగా రాయగలరనడానికి అవే నిదర్శనం"

'నిజమేనేమో' అ ను కొం ది సీత. సంభాషణలు రాయడం చేతకాక కాదుగానీ సి ని మా కు అన్వయిస్తూ రాయడం కొత్తలో కొంచెం కష్టమేమోనని ఆమె అనుమానం.

"మీకో విషయంచెప్తే మీరు నమ్మరు. ఇవాళ సంభాషణల రచయితగా వెలిగి





పోతున్న విఘ్నేశ్వర్రావుకి ఈ సినిమా టెక్నిక్ ఎవరు నేర్పారు, నేను. నెల రోజులు ఉదయంనుంచీ సాయంత్రం వరకూ నాతో కూర్చోబెట్టుకొని సాన బెట్టానతన్ని. ఇప్పుడు చూడండి మరి నాకే పాఠాలు చెప్పేలా తయారయ్యాడు. అంచేత నేను చెప్పేదేమిటంటే మిమ్మల్ని నాక్కావలసిన విధంగా నేను మలచుకో గలను. మీరు ఓకే అనండి చాలు. మిగతాదంతా నా బాధ్యత".

"మీరు బలవంత పెడుతున్నారుగానీ నాకు భయంగానే వుంది".

అతను నవ్వేశాడు.

"భలేవారే! భయపడటమేమిటి. మరో విషయం కూడా చెప్పేస్తున్నాను. సంభాషణలు రాయాలంటే తొంభయి మంది వున్నారు మార్కెట్లో. కానీ, చెప్పానుకదా! నేను మీ అభిమాన పాఠకుడినయిపోయాను ఆ నవల చదివిన దగ్గర్నుంచీ. అంచేత మీతోనే రాయించా లని కోరిక. అంతే! అందుకే మిమ్మల్ని ఇంతగా బతిమాలుతోంది".

ఏం చెప్పటానికీ తోచలేదు సీతకి. అతను అంతగా చెప్పిన తరువాత కాదన డానికీ మనసొప్పటంలేదు.

"ఇంకా ఆలోచిస్తున్నారు కదూ!" నవ్వుతూ అన్నాడతను.

సీతక్కూడా నవ్వాగలేదు. అతనితో పాటు తనూ నవ్వేసింది.

"ఇంకో విషయం కూడా ఇప్పుడే చెప్పేస్తున్నాను. మీరు సినిమా ఫీల్డులో లేరుగనక మీకు నా గురించి తెలిసుండదు. నేను మిగతా అందరిలాంటి ప్రొడ్యూ సర్ని కాదు. డబ్బుకి లెక్కచెయ్యలేదు ఏనాడూ. నాక్కావలసింది మనమధ్య ఎలాంటి పొరపొచ్చాలూ లేకుండా



ఉండటం. అందే మనసులో ఒకటి, పైకొకటి లేకుండా మాట్లాడుకోవాలి. సాధారణంగా సినిమా ఫీల్డులో అదే ఎక్కడా కనిపించదు. మీరు ముందుగానే ఆలోచించుకొని మీ నవలకూ, సినిమా సంభాషణలకూ ఎంత డబ్బు కావాలో అడగండి. నా దగ్గర బేరసారాలు కూడా లేవు. మీరెంత చెబితే అంత. నా చేతి మీదగానే మీరు సినిమా రంగంలోకి ప్రవేశించాలి. మీరు రాసిన మంచి నవలలన్నీ నేనే సినిమాలు తీయాలి! ఇదీ నా మనసులో వున్న విషయం".

సీత ఆలోచనలో పడిపోయింది.

ఎంత అడగాలి? ఏమో! తనకేం తెలుసునని? అసలు సినిమాలకు ఏ రేట్లు వున్నాయో తెలియందే ఇంత అని ఎలా అడగగలదు? అదీగాక ఇక్కడో మొహమాటం వచ్చిపడింది. తననే సంభాషణలు రాయమని కూడా అడుగుతున్నాడు. దానికి చాలా టైము పడుతుంది. దానికెంత అడగాలో తెలీదు. పబ్లిషర్లతో బేరాలాడటం వేరు. ప్రొడ్యూసర్లతో మాట్లాడడం వేరు. తక్కువ అడిగితే నష్టపోవచ్చు. ఎక్కువ అడిగితే వాళ్ళు 'మరీ ఆశ' అని తన గురించి అనుకోవచ్చు. వీటన్నిటి సంగతెలా వున్నా ఈయన మాత్రం చాలా మంచి మనిషిలాగున్నారు. లేకపోతే తనమీద ఇంత అభిమానం చూపించాల్సిన అవసరం ఏముంది? ఇలాంటి మనిషిని పొరబాటున కూడా మనసు నొప్పించడం మంచిది కాదు. పోనీ ఎంతివ్వదల్చుకున్నారో అది ఆయనకే వదిలేస్తేసరి. తరువాత అది తన అంచనాకు దగ్గరగా ఉందో లేదో చూసుకోవచ్చు.

"మాట్లాడరేమిటి? ఇంకేదో ఆలోచిస్తున్నట్లున్నారు?" నవ్వుతూ అన్నాడు అతను.

"ఆదేనండీ! నాకీ సినిమా విషయాలేమీ తెలీదు. ఇంత ఇస్తారనిగానీ, అడగాలనిగానీ అయిడియా కూడా లేదు. అంచేత ఆ విషయాలన్నీ మీకే వదిలేస్తున్నాను. మీరెలా చెబితే అలా..."

అతను నవ్వేసి ఆలోచనలో పడ్డాడు.

"బావుంది. నామీదే వేసేశారన్నమాట. సరే! చూడండి! నవలకి ఎనిమిది వేలిస్తాను. అందే అన్ని భాషల్లోనూ సినిమాతీసే హక్కు నేను కొనుక్కొంటానన్నమాట. తరువాత సంభాషణలకి మరో ఎనిమిది వేలు. మొత్తం పదహారు వేలు. ఇది నేను సాధారణంగా ఎవరికయినా ఇచ్చే రేటే. కానీ మీరంటే నాకున్న అభిమానంవల్లా, ఈ సంభాషణలు రాయడంవల్ల మీకు కలిగే కొన్ని ఇబ్బందులను దృష్టిలో ఉంచుకొనీ, మీ విషయంలో ఈ మొత్తాన్ని నేను ఇరవై వేలకు పెంచుతున్నాను. ఇంత పెద్ద మొత్తం అసలు మన తెలుగు ఫీల్డులోనే ఎవ్వరూ ఇవ్వరులెండి. చెప్పండి! మరి ఏమంటారు? మీకు సంతృప్తికరంగా ఉంటుందా?"

సీతకు మతిపోయినట్లయింది.

ఏమిటీ మనిషి మాట్లాడుతూంది? ఇరవై వేలా? కలా, నిజమా ఇది! ఎంత సినిమావాళ్ళయితే మాత్రం ఇంత పెద్ద మొత్తమా! అందరికీ ఇలా ఉండదనీ కేవలం తనమీద వున్న అభిమానంతో ఇంత ఇస్తున్నానని అన్నాడుగా! అంటే తనమీద అభిమానం ఖరీదు నాలుగు వేలా?




"పోనీ - చాల దనుకొంటే చెప్పండి మీకెంత కావాలో" ఆమె మౌనం వహించడం చూచి అన్నాడతను.

"అబ్బే... అదికాదు..." తడబడుతూ అందిసీత. "అసలు ఇంత పెద్ద మొత్తం ఉంటుందని నేనూహించ లేదు. అందుకని ఆశ్చర్యం కలిగింది"

అతను తేలిగ్గా నవ్వేశాడు.

"భలేవారే మీరు! నేనేఅంటే నాకంటే అమాయకుల్లా వున్నారు. నిజమే మీ మనసులో ఉన్నదున్నట్లు మాట్లాడేశారు. నాకు సంతోషంగా ఉంది. కాని సినిమా వాళ్ళెవరి దగ్గరా ఇంత ఓపెన్‌గా మాట్లాడేయకండి! మీ నెత్తిన చెయ్యి పెట్టేస్తారు" అన్నాడతను.

ఆమె నవ్వేసింది.

"మరి నేనిక వెళ్ళిరానా?" మంచిరోజు చూసుకుని మళ్ళీకలుస్తాను" లేచి నుంచుంటూ అన్నాడతను.

"అలాగే" తనూ నుంచుంటూ అందిసీత. హఠాత్తుగా ఆమెకు గుర్తు కొచ్చింది తను అతనికి కాఫీ ఆఫర్ చెయ్యలేదని.

"ఒక్కనిమిషం కూర్చోండి! ఇప్పుడే కాఫీ తీసుకొస్తాను" హడావుడిగా లోపలకు వెళ్ళబోతూ అందామె.

"వద్దు! వద్దు' దయచేసి ఈసారికి వదిలేయండి. మరోసారి తప్పక మీ చేతి కాఫీ తాగుతాను... వస్తాను... నమస్తే" వెళ్ళిపోతూ అన్నాడతను.

నమస్కారంచేసి గడప వరకూ నడచి ఆగిందామె. అతను కార్లోకూర్చుని మరోసారి ఆమె వంక చూసి, చిన్నగా నవ్వాడు. కారు వెళ్ళిపోయింది.

కాంపౌండ్‌లోని చుట్టు పక్కల ఇళ్ల వాళ్ళందరూ ఆమె చుట్టూ మూగేశారు.

"ఎవరండీ ఆయన?"

"వర్ధనరావు గారు - గంధర్వా ఫిలింస్ ప్రొడ్యూసరట..."

"అంటే ... మీ నవలేదయనా సినిమాకి తీసుకొంటున్నారా?"

"అవును!"

"ఏ నవల?"

"జీవిత సోపానాలు"

మరుక్షణంలో ఆ ప్రాంతమంతా ఆ నవల గురించిన చర్చల్లో మునిగి పోయింది.

మాధవరావు సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికొస్తూనే అతని నోట్లో పంచదార వేసేసింది సీత.

"మళ్ళీ ఏమిటి తీపి కబురు? మళ్ళీ నెలతప్పిందా?" నవ్వుతూ అడిగాడు మాధవరావు.

"ఛీ! అదికాదు. మధ్యాహ్నం సినిమా ప్రొడ్యూసర్ ఒకాయన వచ్చాడు. నా నవల 'జీవిత సోపానాలు' ఆయనకు అద్భుతంగా ఉందట. ఇప్పుడు సినిమా తీస్తాట్టదాన్ని. మరోశుభవార్త ఏమిటంటే దానికి సంభాషణలు కూడా నేనే రాయాలిట"

నిజంగానే ఈ వార్త మాధవరావుకి దిగ్భ్రాంతి కలిగించింది. అతని అనుమానం మరింత బలపడి పోయింది. అవును! సీత ఆకాశం అంతఎత్తుకి ఎదిగి పోతోం దనుకొన్న తన ఆలోచన తప్పుకాదు

"ఆయన డబ్బెంత ఇస్తానన్నారో తెలుసా?" మళ్ళీ అడిగింది సీత.

"ఎంత?" అడిగాడు మాధవరావు.

"మీరే చెప్పండి చూద్దాం!"

మాధవరావు ఓ క్షణం ఆలోచించేడు

''పదివేలు''

''ఫెయిలయి పోయారు...''

''ఎంతమరి?''

''ఇరవై వేలు...''

''ఈజిట్?'' విస్మయంతో అడిగాడు

''అవును! అందరికీ అయితే పద హారువేల కంటే ఎక్కువివ్వరట. కానీ ఆయనకు నేనంటే అభిమానం ఎక్కువయి పోవడంవల్ల ఇరవైవేలు చేసే శారు''

''చాలా పెద్ద మొత్తం కదూ?'' ఇంకా నమ్మకం చాలనట్లు అడిగాడతను

''నేనూ నమ్మలేక పోయాను ముందు! ఆయనెంత మంచివారో తెలుసా మీకు? 'అంత పెద్ద మొత్తమే' అని అంటే - 'నా దగ్గరంటే అన్నావ్ ఇంకే సినిమావాడి దగ్గరా ఈ మాట అనకు— నెత్తినటోపి పెట్టేస్తారు' అని సలహా ఇచ్చారు''

''బావుంది'' ఆడుకొంటున్న పాపాయి నెత్తుకొని ముద్దుపెట్టు కొంటూ అన్నాడతను.

''ఇదిగో చూడండి! వేరే యిల్లు చూడండి అని మొత్తుకుంటూనే ఉన్నాను. మీరేమో శ్రద్ధ తీసుకోరు. ఇవాళ ఆ ప్రొడ్యూసరు గారొచ్చేసరికి నా కెంత సిగ్గనిపించిందో తెలుసా? ఇరుకుగది — అందులోనే ఇన్ని సామాన్లు. మనిషి కదలడానికి స్థలముంటేనా? ఏమయినా సరే - రేపట్నుంచీ రెండు రోజులు శలవు పెట్టి మంచి ఇల్లు వెతకండి. అద్దె మూడు వందలయినా ఫరవాలేదు. తెల్లారిలేస్తే ఇంటికి ఎంతోమంది వచ్చి పోతూంటారు. వాళ్ళేమను కొంటారు!'' కోపంగా అందామె.

''ఆల్ రైట్ - రేపు శలవు పెట్టి అటోఇటో తేల్చేస్తాను ఇంటిసంగతి'' అన్నాడు మాధవరావు.

అన్నట్టే శలవు పెట్టి తిరిగాడు గానీ ఏమీ లాభంలేకపోయింది. నెల రోజుల తర్వాత ఖాళీ అయేవీ, రెండు నెలల తర్వాత అయేవీ ఉన్నాయి! అంతవరకూ ఆగాలిసిందే. చేసేదిలేక ఊరుకుండి పోయింది సీత.



# 10

సరిగ్గా పదిహేనురోజుల తరువాత మళ్ళీ ఇంటికొచ్చాడు వర్ధనరావు.

"రండి" చిరునవ్వుతో ఆహ్వానించింది సీత.

"ఉదయం నుంచీ మీ ఇంటికి రావాలని ప్రయత్నం. కానీ ఏదొక పని. అయినా మీలాంటి ప్రముఖ రచయిత్రి, అందునా కాబోయే సినీ రచయిత్రి- ఇలాంటి మారుమూల ఉండటం నాకేం బావుండలేదు" నవ్వుతూ అన్నాడతను.

సీతకు తలకొట్టేసినట్లయి పోయింది. ఇలాంటి పరిస్థితి వస్తుందనే మాధవరావుతో మొత్తుకొంటోంది తను వేరే మంచి ఇల్లు చూడమని! ఆయన విని' పించుకొంటేనా?

"మంచి ఇల్లు కోసం ప్రయత్నిస్తూనే ఉన్నామండీ! ఎక్కడా దొరికితేనా? మా

వారు ఓ రోజంతా శలవుపెట్టి తిరిగినా ఫలితం కనిపించలేదు" నొచ్చుకొంటూ అందామె.

"అరె! మరి ఆ విషయం మీరు మొన్న నాతో అంటే సరిపోయేది కదా! మా ఇంటి దగ్గర ఏరియాలో ఒక ఇల్లు ఖాళీగా ఉంది. మేడ మీద పోర్షన్ అనుకోండి! రెండు బెడ్ రూమ్‌లున్నాయి... మీకిష్టమయితే రేపే మాట్లాడతాను. నా ఫ్రెండ్‌దే లెండి అది"

సీతకి ఆ ఇల్లు తీసుకోవాలని ఉంది గానీ అద్దె ఎంత చెప్తారోనని భయం వేసింది. ఆయనుండే ఏరియా చాలా ఖరీదయినది. రెండు బెడ్ రూమ్‌ల ఇల్లంటే ఆ ప్రాంతంలో కనీసం నాలుగయిదు వందలుంటుంది.

"మరి...అద్దెఎంత చెప్తారో" సంశయంగా అందామె.

అతను గట్టిగా నవ్వేసరికి తను తెలివితక్కువగా మాట్లాడానేమోనని భయపడిపోయిందామె.

"అద్దెదేముందిలెండి! ఈ పిక్చర్‌కి మీరు రాయడం పూర్తయేవరకూ నేనే భరిస్తాను. తరువాత సంగతి తర్వాత చూసుకొందాం! ఇదే మొగ రచయితయితే రోజుకి యాభై, అరవై రూపాయలు పెట్టి హోటల్లో రూము ఏర్పాటు చేయటం లేదూ? దాని బదులు మీకు ఇంటి అద్దె భరించడం చాలా చవక కాదూ మాకు?"

సీతకి అతనికి ఎలా ధన్యవాదాలర్పించాలో తెలీలేదు.

"మీకు బాగా శ్రమ ఇస్తున్నాననుకొంటాను" అందామె సిగ్గుపడుతూ.

"ఇటీజ్ ప్లెజర్! అలా అనుకోకండి!

మ విషయంలో చెప్పాను కదూ - ఎంత శ్రమయినా అదో శ్రమ అనే అనుకోను! మీరు దయచేసి నా దగ్గర ఎలాంటి సంకోచాలు పెట్టుకోకండి! మీరు నా రైటరు! అంచేత మీ బాగోగులు ప్రస్తుతం నాకు ముఖ్యం"

సీత మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వి ఊరుకొంది. ఆమె మనసంతా అతని మీద కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. ఇప్పుడతను చేస్తున్న సహాయం సామాన్యమయినది కాదు. ఏనాటినుంచో తాము సాధించలేని విషయాన్ని ఒక్క నిమిషంలో పరిష్కరించాడు. ఈయన రుణం ఎలా తీర్చుకోవాలో?

"సరే! ఇంటి విషయం సెటిలయిపోయింది. రేపు ఉదయం ఏదో ఒక సమయంలో నా కారు పంపిస్తాను. మీరు కావాలంటే ఇల్లు మారడానికి ఉపయోగించుకోవచ్చు! ఏమంటారు"

"అలాగే నండి."

"ఇకపోతే ఇవాళ మంచి రోజు కనుక మీకు అడ్వాన్స్ ఇద్దామని బయల్దేరానసలు. ఇదుగో! ప్రస్తుతం ఐదు వేలు అడ్వాన్స్ తీసుకోండి. మిగతాది మనం వర్క్ ప్రారంభించాక తీసుకొందురుగాని" వంద రూపాయలనోట్ల కట్ట అందిస్తూ అన్నాడతను.

తీసుకొని టేబిల్ మీదుంచింది సీత.

"మీవారేం చేస్తున్నారో చెప్పనేలేదు! ఆయనని కూడా నాకోసారి పరిచయం చెయ్యండి!" అన్నాడతను.

"రేపెలాగూ ఇల్లు మారుతున్నాం కదా! రేపు సాయంత్రం మీరు ఆ కొత్త ఇంటికొస్తే మనందరం కాసేపు సరదాగా మాట్లాడుకోవచ్చు"

"బాగానే వుంది మీరు చెప్పింది ... మరి నేను వెళ్ళవచ్చా ఇక?" లేవబోతూ అన్నాడు.

"అహహ!ఉండండి! ఇదివరకట్కూడా కాఫీ త్రాగకుండా వెళ్ళిపోయారు. ఐదు నిమిషాల్లో తయారుచేసుకొస్తాను" త్వర త్వరగా వంటింటివేపు నడిచిందామె.

"సర్లెండి! మీ చేతి కాఫీ రుచి ఇవాళ చూడాలని రాసివుంది కాబోలు"నవ్వుతూ అన్నాడతను.

కొద్ది నిమిషాల్లో ఓ కప్పునిండా కాఫీ తీసుకొచ్చి అతని కందించిందామె.

"మరి మీకో?"

"నేను ఇప్పుడు తాగనులెండి కాసేపయాక"

"అదేం కుదరదు కంపెనీ లేందే నేను మంచినీళ్ళు కూడా తాగను! నా సంగతి మీకింకా తెలీదేమో! త్వరగా తెచ్చుకొని అలా కూర్చోండి మీరు కూడా!"

ఇకలాభం లేదని తనూ కొంచెం కాఫీ ఓ కప్పులో తెచ్చుకొని కూర్చుందామె.

"ఇంకేం నవలలు రాస్తున్నారిప్పుడు" అడిగాడతను.

"ప్రస్తుతం ఒకటి రాస్తున్నానండీ, ఇంక పది రోజుల్లో పూర్తయిపోతుందది......"

"పేరేమిటి?"

"ఇంకా ఆలోచించలేదు"

"థీమ్ ఏమిటి?"

"ఒక లక్షాధికారి ఉంటాడు. అతనికి ఓ కూతురూ, కొడుకూ! కూతురు తన క్లాస్‌మేట్ ఒకతన్ని ప్రేమించి వివాహం చేసుకోవాలను కొంటుంది. కానీ అతను మాత్రం కేవలం ఆమె ఆస్తిమీద వ్యా

మోహంతో ఆమెను ప్రేమిస్తున్నట్లు నటిస్తుంటాడు. ఈ విషయం తెలిసిన ఆ అమ్మాయి మావయ్య-అతను వాళ్ళింట్లో వాళ్ళ దయాధర్మాల మీద ఆధారపడి ఉండే అనాధలెండి. ఈ విషయమై ఆ అమ్మాయిని హెచ్చరిస్తాడు. ఆ కుర్రాడికి వేరే ప్రియురాళ్ళు ఉన్నారనీ కనుక అతనితో తిరగవద్దనీ హెచ్చరిస్తాడు. ఆ అమ్మాయి అతని మాట వినదు నీ స్థానంలో నువ్వుండు అనవసర విషయాల్లో జోక్యం చేసుకోవద్ద'ని వార్నింగిస్తుంది. అతను కేవలం ఆ అమ్మాయిని రక్షించడం కోసం ఆమెను రేప్ చేస్తాడు. ఆ అమ్మాయికి అతని మీద కోపం పగ అక్కడినుంచి కథ మారుతుంది.చివరకు ఆ అమ్మాయీ మామయ్యా ఒకటవుతారు. విలన్‌ని పోలీసులు పట్టుకొంటారు..."

"ఒండర్ ఫుల్! చాలా బావుంది! ఇలాంటి కథలే కావాలీ రోజుల్లో!..." ఆనందంగా అన్నాడతను.

సీత నవ్వి ఊరుకొంది

"మరి నేను వెళ్తాను"

వెళ్ళి పోయాడతను.

మళ్ళీ ఆ కాంపౌండ్‌లో వాళ్ళందరూ ఆమె చుట్టూ మూగారు.

"మళ్ళీ ఏమిటండీ - వచ్చారాయన? షూటింగ్ మొదలయిందా ?"

"అబ్బే ! ఇంకా లేదు ; ఇంకా టైము పడుతుంది"

"మమ్మల్ని షూటింగ్ చూడ్డానికితీసుకెళ్తారా మీరు ?"

"ఓ ! మీ ఇష్ట మొచ్చినంత సేపు చూడొచ్చు"

"హీరో హీరోయిన్ ఎవరూ ?"

"ఇంకా తెలీదు"

సీత ఇంట్లో కొచ్చేసింది. అందరూ సినిమా షూటింగుల గురించి చెప్పుకోవడంలో నిమగ్నమయి పోయారు.

"రేపు మనం ఇల్లుమారిపోతున్నాం!" మాధవరావు ఇంటికి రాగానే చెప్పేసింది సీత.

"ఎక్కడికి?" అమితమైన ఆశ్చర్యంతో అడిగాడతను.

జరిగిందంతా చెప్పిందామె.

"ఇదేదో బాగానే ఉంది. పైగా అద్దె కూడా లేదంటున్నావ్! మరి నువ్వు డైలాగులు రాయడం పూర్తయ్యాక మళ్ళీ బయటగ్గెంటేస్తారా ఏమిటి?" నవ్వుతూ అడిగాడతను.

"ఛ! ఆయన అలాంటి వాడు కాదులెండి! రేపు మీరే చూస్తారుగా!"

"సరేలే! తరువాత సంగతి తర్వాత చూసుకోవచ్చు! నీకు ఈ ఇంట్లో అడుగుపెట్టినప్పటినుంచీ కోరికగా ఉంది ఈఇల్లు వదిలేయాలని! ఇన్నేళ్ళకు నెరవేరిందా కోరిక! అంచేత ఈ అవకాశం వదులుకోవడం మంచిది కాదు"

మర్నాడు ఉదయం పదిన్నరకల్లా ఇంటిముందు కారు హారన్ మోగింది.

"అదిగో కారొచ్చేసింది" సంబరంగా అంది సీత.

ఐందర్లో చదువుకొనే రోజుల్లో తన క్లాసులోని సరోజ రోజూ స్కూలుకి కార్లో వస్తూండేది. ఆ పిల్లతోపాటు కార్లో ఎక్కాలని అందరికీ ఉండేది. కాని ఆమె ఎవ్వరినీ ఎక్కనిచ్చేది కాదు. అందరికంటె ఎక్కువ సీత ముచ్చట పడేది కారు ప్రయాణం కోసం. ఆ కోరిక అప్పటి నుంచీ అలాగే మనసు అడుగున ఉండిపోయింది. కారులో వెళ్ళేంతయోగం

తనకు పట్టదని ఏనాడో నిర్ణయం చేసుకొందామె. కానీ ఇప్పుడు తనకు తెలీకుండానే జరిగి పోతోందది. ముఖ్యమయిన సామానంతా ఉదయమే పాక్ చేసేశాడు మాధవరావు. డ్రైవరు సాయంతో సామాను కారునిండా సర్దేశాడతను. మరో ట్రిప్ కొడితే మంచాలు తప్ప మిగతా సామానంతా చేరిపోతుంది కొత్త ఇంటికి. మాధవరావు, సీత ముందుసీట్లోనే కూర్చోవాల్సి వచ్చింది. ఇరవై నిమిషాల తర్వాత ఓ అందమయిన ఇంటి ముందాగిందికారు. చుట్టూ అన్నీ అద్భుతమైన సౌధాలు. అంతా లక్షాధికారులే అని చెప్తున్నాయా ఇళ్ళు. డ్రైవరు కారుదిగి గేటు తెరచాడు. పక్కనుంచి మేడ మీదకు మెట్లున్నాయి. క్రింది పోర్షన్ వాళ్ళతో సంబంధం లేకుండా ప్రత్యేకంగా ఓ గేటు - దారి ఉన్నాయి. మేడ మీదకు చేరుకుంది సీత. ఆ ఇల్లు చూస్తూంటే ఆమెకళ్ళు చెదరి పోతున్నాయి. అలాంటి ఇళ్ళు సినిమాల్లోనే చూసింది తను. అంచేత అలాంటి వాటినే మళ్ళీ తను రాసే నవలల్లో కూడా వర్ణించింది. కానీ ప్రత్యక్షంగా చూడటం అదేమొదలు. పెద్ద హాలు రెండు అందమైన రంగుల పడకగదులు. ప్రతి గదికీ పంకాలూ, డైనింగ్ రూమూ, పడగ్గది కంటే అందంగా ఉన్న వంటిల్లూ - బాత్ రూమ్ లో గీసరూ, సామానంతా తెచ్చి ఇంట్లోకి చేరుస్తున్నాడు డ్రైవరు. అంతటి ఇంట్లో తమ సామాను ఉంచినా ఇంకా బోసి పోయినట్లుగానే కనిపిస్తోంది ఇల్లు.

"సరే - నువ్వు చెకింగ్ చేస్తూండు ఇల్లంతా! నేను వెళ్ళి ఆ మంచాలు రిక్షాల మీద వేసి మిగతా సామాను మళ్ళీ కార్లో తీసుకొచ్చేస్తాను" అంటూ వెళ్ళి పోయాడు మాధవరావు.

అతను కార్లో వెళ్ళిపోతుంటే కారు వంకే చూస్తూ నిలబడింది సీత. తను ఎప్పటి కయినా కారు కొనగలదా? కొంటే ఎంత బావుంటుంది. ఆయన డ్రైవ్ చేస్తూంటే తన ప్రక్కన కూర్చుని - అద్దంలో నుంచి బయటకు




చూస్తూ - ఎన్నెన్ని ఊళ్ళు తిరగవచ్చు! ఎన్నెన్ని ప్రదేశాలు చూడవచ్చు కానీ అదేమంత మామూలు విషయం కాదు. కనీసం పాతిక వేలయినా లేందే కారు కొనలేదు, ఆ తరువాత నెలకో అయిదు వందలయినా దానికి ఖర్చుచేసే స్తోమతు ఉండాలి. అవన్నీ తనకు లేవు. అయినా ప్రయత్నించాల్సిందే. ఏనాటి కయినా కొనాల్సిందే - అందులో తిరగాల్సిందే-

ఆలోచిస్తూండగానే కారు మళ్ళీ ఇంటి కేసి వస్తూ కనిపించింది. కారులో నుంచి సామాన్లు తీసుకొచ్చి మేడమీదకు చేరుస్తున్నారు.

"అన్నీ అయిపోయాయి సీతా! మంచాలు రిక్షామీద వేశాను. మరి కాసే పట్లో వచ్చేస్తాయవి కూడా!" ఉత్సాహంగా అన్నాడు మాధవరావు.

ఆ సాయింత్రానిగ్గాని ఇల్లు పూర్తిగా సర్దటం పూర్తికాలేదు.

"ఈ ఫర్నిచర్ బొత్తిగా చాలదండీ! ఎవరయినావస్తే కూర్చోడానికి ఆసోఫా, ఒక కుర్చీ తప్పితే ఇంకేమీలేవు. కుర్చీల సెట్టు ఒకటి కొనాలి. మనకు అత్యావసరంగా కావలసిన వస్తువులన్నీ ఓ లిస్ట్ చెబుతాను రాసుకోండి. వెళ్ళితీసుకొద్దురు గాని."

మాధవరావు కాగితం పెన్నూ తెచ్చుకొన్నాడు.

"ఊ చెప్పు..."

"కుర్చీలసెట్టు - ప్లాస్టిక్ వైర్‌వి - మొత్తము ఎనిమిది తలుపులకీ, పన్నెండు కిటికీలకి కర్టెన్లు-ఖరీదయినవే తీసుకోండి. నాకు రాసుకోడానికి ఓ టేబిలూ, దాన్తోపాటు ఓ కుర్చీ - రెండు టేబిల్ లైట్లూ - మన బెడ్ రూమ్‌లోకి ఒక ఎయిర్ కూలరూ - ప్రస్తుతానికివి చాల్లెండి! ఇంకేమయినా అవసరమయితే తరువాత చూసుకొందాం".

ఆమె ఇచ్చిన డబ్బు తీసుకొని మాధవరావు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన కొద్దిసేపటికే వర్ధనరావు వచ్చాడు.

"ఎలా వుంది ఇల్లు?" అడిగాడతను సోఫాలో కూర్చుంటూ.

"చాలా బాగుంది" సంతోషంగా అందామె.

"ఎవరెక్కడ ఉండాలో అక్కడ వుంటేనే బావుంటుంది. మీలాంటివాళ్ళు ఉండాల్సిన ఇల్లుకాదు ఆ పాత ఇల్లు" నవ్వుతూ అన్నాడతను.

సీత నవ్వేసింది. తనకూ తెలుసు ఆ విషయం. కానీ పరిస్థితుల మూలాన అక్కడే వుండిపోక తప్పలేదు.

"ఇప్పుడు చూడండి! మీరు రావడం వల్ల ఇంతటి అందమయిన ఇంటికూ్కడా మరో కొత్త కళ వచ్చేసింది. నన్నడిగితే ఇంటికి అందం ఇచ్చేది ఇంటిలో వుండే ఇల్లాలు. ఏమంటారు?"

సీత మాట్లాడేలోగా మళ్ళీ అతనే అన్నాడు "ఏరీ మీ హాజ్‌బెండ్ వున్నారా?"

"ఊహూ!_ ఇంతకుముందే షాపింగు కెళ్ళారు. ఒకటి రెండు గంటల్లో వచ్చేస్తారులెండి".

"ఆల్ రైట్. మరి నాకు కాఫీ ఇచ్చే ఆలోచనేమయినా ఉందా మీకు?"

"ఇప్పుడే తీసుకొస్తాను" కిచెన్‌వేపు నడుస్తూ అందామె.

"మరేం అనుకోకండి. మీరు కాఫీ

అద్భుతంగా చేయగలరని నాకు నిన్ననే తెలిసింది. అంచేత రోజూ ఓసారయినా మీ చేతి కాఫీ తాగాలని నా కోరిక".

"తప్పకుండా రండి! సంతోషంగా ఇస్తాను" ఆనందంగా అందామె. తన వంటకానికి మొదటి ప్రశంస ఇది. మాధవరావు ఎప్పుడూ పొగడలేదిలా! అయినా తెలిసిందేముందనీ, భార్య ఏమి చేసినా భర్తకు నచ్చదు. అంతే! అది రూలు.

కాఫీ తీసుకొచ్చి అతనికిచ్చిందామె.

"చూశారా! నేను చెప్పిన విషయం అప్పుడే మర్చిపోయారు".

"ఏమిటది?"

"మంచినీళ్ళు తాగినా నాకు కంపెనీ ఉండాలని చెప్పాను. గుర్తులేదా?"

"ఓ, సారీ!" లోపలకు పరుగెత్తి తనూ ఓ కప్పులో కాఫీ తెచ్చుకొందామె.

"ఇప్పుడు చెప్పండి! మన వర్కు ఎప్పుడు ప్రారంభిద్దాము? ముందు మీకు నేను కొన్ని మా సినిమాల పాత స్క్రిప్టులు చూపించి ఆయా డైలాగులు ఎలా రాయించిందీ వివరిస్తాను".

"మీ ఇష్టం, మీరెప్పుడు చెబితే అప్పుడే. నా వంట పనంతా పదిగంటల కల్లా అయిపోతుంది. ఆ తరువాత ఎప్పుడయినా సరే".

వర్ధనరావు ఆలోచించాడు కొద్ది క్షణాలు.

"సరే! రోజూ మధ్యాహ్నం రెండు గంటలు కూర్చుందాం".

"అలాగే"

వాళ్ళు సినిమా విషయాలు మాట్లాడుతుండగానే మాధవరావు ఫర్నిచర్‌తో ఇంటికొచ్చేశాడు.

"ముందిటు రండి! అవతల వర్ధనరావు గారు మీకోసం ఎదురుచూస్తున్నారు" హడావుడిగా అతనిని హాల్లోకి లాక్కెళ్తూ అంది సీత.

"నమస్తే" అన్నాడు మాధవరావు వర్ధనరావుని చూడగానే.

"నమస్తే-నమస్తే రండి కూర్చోండి. మిమ్మల్ని కలుసుకోవడం ఇప్పటికి వీలుపడింది" నవ్వుతూ అన్నాడు వర్ధనరావు.

వర్ధనరావుకీ తన భర్తకీ తేడా గమనిస్తోంది సీత.

తన భర్తకంటే కనీసం పదేళ్ళయినా పెద్దవాడయి వుంటాడు వర్ధనరావు. కానీ తన భర్తకంటే చిన్నవాడిలా కనిపిస్తున్నాడు. మాటల్లో అన్నాడతను అతని కొడుకు టెన్త్ చదువుతున్నాడని. అదీగాక అతని ముఖంలో కనిపించే కళాకాంతులు తన భర్త మొఖంలో లేవు. ఎప్పుడూ ఆలోచిస్తూండే కళ్ళు, ఎండలో తిరిగి తిరిగి మాడి ముదురుగా కనిపించే ముఖం, అసలు ఆయనకు శ్రద్ధలేదు తనమీద. ఏనాడూ స్నో, పౌడర్లు వాడిన పాపాన పోతేనా? ఎన్ని రకాల కాస్మటిక్స్ తెచ్చిపెట్టుకొంది తను. వాటిని కన్నెత్తి కూడా చూడరు. తనకూ, ఆయనకూ వయసులో ఎంతో తేడా వుందని అందరూ అనుకొంటున్నారంటే కారణం అదే! నిజానికి తనకంటే నాలుగేళ్ళే పెద్ద ఆయన.

మాధవరావు తన ఉద్యోగ వివరాలు చెబుతున్నాడు వర్ధనరావుకి.

"నేనో విషయం చెప్తున్నాను మిష్టర్ మాధవరావు! మీ మిసెస్ మామూలు రచయిత్రి కాదు. ఎంతో స్టఫ్ వున్న రచయిత్రి. ఆవిడలోని టాలెంటునంతా




నేను వెలికి తీయదల్చుకొన్నాను. చెప్పాను కదూ నేనూ ఆవిడ అభిమాన పాఠకుల్లో ఒకడినని. అంచేత నాకామె మరింత ఉన్నతస్థితికి చేరుకోవాలని కోరిక. మీరు కూడా ఆమెను ప్రోత్సహించండి" వెళ్ళే ముందు అన్నాడు వర్ధనరావు.

మర్నాడు పాపను చూడ్డానికని ఓ పని పిల్లని ఏర్పాటు చేసింది సీత. పాప నెత్తుకొని కూర్చుంటే తన పనులేమీ కావు. అదీగాక వర్ధనరావుతో మాట్లాడు తోంటే మధ్యలో పాప గొడవచేస్తే కష్టం. అలాగే వంట మనిషిని కూడా వేరే ఏర్పాటు చేసింది.

అనుకొన్నట్లుగానే ఆ రోజు మధ్యాహ్నం వర్ధనరావు ఆమె ఇంటికొచ్చాడు. ఇద్దరూ రెండో గదిలో కూర్చున్నారు. ఆ గది తను రాసుకోడానికని ప్రత్యేకించింది సీత. అందులో ఖరీదయిన మరో సోఫా సెట్టూ, డ్రెస్సింగ్ టేబులూ, పొడుగాటి అద్దం - గోడలకు అందమైన పెయింటింగ్సూ-తను ఏనాటి నుంచో కలల్లో నిర్మించుకొంటున్న గదికి ప్రతి రూపం అది.

గదిలో కూర్చున్నారిద్దరూ. అతని కెదురుగ్గా కూర్చుంది సీత.

"ఇలా రండి! లేకపోతే స్క్రిప్టు కనబడదు" అన్నాడు వర్ధనరావు. అతని పక్కనేసర్దుకు కూర్చుంది సీత.

అతను స్క్రీన్‌ప్లే గురించీ, సీన్ డివిజన్ గురించీ, సంభాషణల గురించీ వివరించడం మొదలు పెట్టాడు. వింటూ వుంటే అదేమంత కష్టమయినది కాదనిపి స్తోంది సీతకు. ప్రయత్నిస్తే తనూ తేలిగ్గానే రాసేయగలదని.

మధ్య మధ్యలో ఒకటి రెండు సార్లు అతను తనని తాకటం - అదోలా చూడటం - ఇవన్నీ ఆమెకు అభ్యంతరాలుగా తోచలేదు. అతను కావాలని చేసినట్లు కనిపించలేదవి.



# 11

వారం రోజులు గడిచిపోయాయి.

వర్ధనరావుతో చాలా చనువు ఏర్పడిపోయింది సీతకి.

ఓ రోజున హడావుడిగా వచ్చాడతను.

"ఇవాళ సాయంత్రం ప్రెస్ వాళ్లను పిలిచాను మనాఫీసుకి. మీ నవల సినిమాగా తీయబోయే విషయం ఎనౌన్స్ చేసేద్దాం. మీరు కూడా వస్తే బావుంటుంది"

"ఎన్ని గంటలకు?"

"సాయంత్రం ఆరింటి కన్నానను కోండి. 'టీ' అదీ ముగిసే సరికి ఏడూ, ఎనిమిదవుతుంది"

"సరే—మీ ఇష్టం! నేను అయిదున్నర కల్లా 'రెడీ' అవుతాను. మీరే వస్తారా నన్ను తీసుకెళ్ళడానికి?"

"ఓ యస్! అవసరం మాది కదా! మీ పేరు వాడుకొంటే సినిమాకి అదే కొంత పబ్లిసిటీ అవుతుంది" అతను వెళ్ళిపోయాడు.

సీత త్వరగా వంట ముగించేసి తను తయారయి వర్ధనరావు కారు కోసం

చూడసాగింది బాల్కనీలో నుంచుని. సరిగ్గా అప్పుడే మాధవరావు వచ్చేశాడు ఆఫీస్‌నుంచి.

"సినీతార లాగా తయారయ్యా వేమిటి? సినీ రచయిత్రివే అనుకొంటు న్నాను ఇప్పటి వరకూ !" నవ్వుతూ అన్నాడతను,

"టైముకొస్తారా, రారా అనుకొంటు న్నాను. త్వరగా రెడీ అవ్వండి. చిన్న ఫంక్షన్ ఏర్పాటు చేశారు వర్ధనరావు గారు వెళ్ళి వచ్చేద్దాం"

"నేనెందుకూ ?" అయిష్టంగా అడిగా డతను.

"ఎందుకేమిటి ? భార్య వెంబడి రావ డం చిన్న తనమా మీకు ?" కోపంగా అందామె.

మాధవరావు ఆమెను నొప్పించడం ఇష్టం లేక తనూ త్వరగా స్నానం ముగించి రెడీ అయ్యాడు.

ఆరుగంటలకు బయట కారు హారన్ మోగింది.

ఇద్దరూ మేడ దిగి బయటకు నడి చారు. కార్లో అప్పటికే మరో ఇద్దరూ పెద్ద మనుషుల్తో కూర్చుని ఉన్నాడు వర్ధనరావు.

"వీరు మన పిక్చర్‌కి డైరెక్టరు. పేరు రమణరాజు. ఈమె మన రైటరు సీతండీ ! వారు ఆమె భర్త మాధవ రావు" తన పక్కన కూర్చున్నతనికి పరిచయం చేశాడు వర్ధనరావు.

అంతా కార్లో ఆఫీసుకు చేర కొన్నారు.

అప్పటికే సినిమా పత్రికల వాళ్ళు కొద్దిమంది వచ్చి ఉన్నారక్కడ నిర్మా ణం పూర్తి అయి రిలీజవబోతున్న తమ సినిమా గురించి మాట్లాడారు రమణరాజూ, వర్ధనరావులు. తరు వాత తమ తదుపరి చిత్రం గురించి ప్రకటించారు. సీతను అందరికీ పరి చయం చేశారు. పత్రికల వాళ్ళు ఆమె చుట్టూ మూగారు. ఒకటే ప్రశ్నలు. అన్నిటికీ చిరునవ్వుతో జవాబిస్తోంది సీత. మాధవరావు ఒక్కడే ఓ మూల కూర్చుండి పోయాడు. ఆ ఆఫీస్‌లోకి అడుగు పెట్టినదగ్గరనుంచీ అతనిగురించి పట్టించుకొన్న వారే లేరు. అంతా సీతకే ప్రాముఖ్యం. టీపార్టీ కూడా ముగిసింది. సీతా, వర్ధనరావు మాట్లాడుకొంటూ టీ త్రాగారు. ఆ సమయంలో వారిద్దరికీ కూడా మాధవరావు విషయం గుర్తుకి రాలేదు. తీరా ఇంటికి బయల్దేరే సమ యానికి సీతకి మాధవరావు గుర్తు కొచ్చాడు. అయితే ఎక్కడా అతని జాడ కనిపించ లేదు.

"పదండి ! ఇంక ఇంటికి పోదాం !" అన్నాడు వర్ధనరావు ఆమె దగ్గరకొచ్చి

"మావారి కోసం చూస్తున్నాను ! ఎక్కడా కనిపించటంలేదు" అటూ ఇటూ చూస్తూందామె.

"ఒకవేళ ఈ మీటింగ్ బోరుకొట్టి ఇంటికెళ్ళిపోయారేమో !" నవ్వుతూ అన్నాడతను.

"అదే జరిగుండాలి" అందామె అతనితోపాటు బయటకు నడుస్తూ. ఆమెకు లోలోపల కోపంగా ఉంది మాధవరావు మీద, అలా చెప్పకుండా వెళ్ళిపోయినం దుకు. తనతోపాటు వచ్చినప్పుడు, ఎంత ఆలస్యమయినా మళ్ళీ తనతోనే ఇంటికి తిరిగి రావాలి. కారు ఆమె ఇంటి ముందాగింది.




"ఓకే! గుడ్‌నైట్" అన్నాడు వర్ధనరావు. తను డోర్ తెరచి పట్టుకొని సీత దిగి "గుడ్‌నైట్" అంది నవ్వుతూ.

కారు వెళ్ళిపోయింది.

ఇంట్లోనే పాపాయితో ఆటలాడుతూ కనిపించాడు మాధవరావు.

"ఎందుకలా చెప్పకుండా వచ్చేశారు ?" కోపంగా అడిగిందామె.

"ఏం చేయను ? నీతో చెప్దామంటే నీ చుట్టూ పదిమంది. సినిమాతారకంటె ఎక్కువ పబ్లిసిటీ జరుగుతోంది. సరే అలాకాదని చల్లగా జారుకున్నాను."

"కాసేపుంటే ఏం పోయింది ? ఇంటి కొచ్చి మీరు చేసింది మాత్రంఏముంది?"

"ఏమీలేదు. అక్కడ ఉండి కూడా చేసేదేమీ లేదుగా !"

"ఇంకోసారి అలా చేయకండి ! అసహ్యంగా మీ కోసంనేనా ఆఫీసంతా వెతకాలా? అందరూ ఏమనుకొంటారు?"

"అసలు ఇంకోసారి నేనొస్తే కదా నీతో !" నవ్వుతూ అన్నాడతను.

"ఎందుకని? మీకేమయినా అగౌరవం జరిగిందా అక్కడ?" రోషంగా అందామె.

"అది కాదు పాయింటు ! నేను మా ఆఫీసు వాళ్ళందరనీ మనింటికి 'టీ పార్టీకి పిలుస్తాననుకో ! నిన్ను కూడా వచ్చి మా అందరి మధ్యా కూర్చొని టైమ్‌పాస్ చెయ్యమంటే ఎలావుంటుంది నీకు ? ఇదెక్కడి గొడవరా బాబూ, ఎప్పుడు ఇక్కడి నుంచి బయట పడతానా అని ఎదుర్చూడవూ ? అదే నా

పరిస్థితి కూడా! అక్కడ ఒక్కడు కూడా పరిచయస్థుడు లేడు. పైగా అందరూ సినిమాల గురించి మాట్లాడు కునేవాళ్ళే. సినిమాల గురించి నాకు 'ఓనమా'లు కూడా తెలీవు. అంచేత నెమ్మదిగా ఇంటికొచ్చేశాను. ఎలాగూ నువ్వు వర్ధనరావు గారి కారులో ఇంటి కొచ్చేస్తావని తెలుసుగా..."

"సరే-సరే-మీతో వాదించి ఎవరు గెలువగలరు గనుక ... పదండి భోజనం చేద్దాం" ! కోపంగానే అందామె.

మాధవరావు ఆమె వెనుకే నడిచాడు.

భోజనం చేసి తన గదిలో రాసు కొంటూ కూర్చుందామె. పడగ్గదిలో చాలా సేపటి వరకూ ఆమె కోసం ఎదురు చూశాడు మాధవరావు. ఆమెను తన కౌగిట్లోకి లాక్కొని, ఏవో కబుర్ల లోకి దించి ఆమె కోపాన్ని పోగొట్టాలని అతని ఉద్దేశం. కానీ సీత రాయడం ముగించే సరికి అతనే నిద్రలోకి జారి పోయాడు.

వర్ధనరావు అంతకు ముందు నిర్మించిన చిత్రం ఆరోజే రిలీజయింది.

"మా సినిమా చూట్టానికి కొస్తారా ?" అడిగాడతను సీతని.

"ఎప్పుడు?" అడిగింది సీత.

"ఇవాళే ఫస్ట్‌షోకి మనకి రెండు సీట్లు ఉంచమని చెప్పాను. మీరు సరే నంటే వెళ్దాం"

"ఓ ! నాకేం పని కూడా లేదు" సరదా పడుతూ అందామె. సినిమా తీసిన ప్రొడ్యూసర్ పక్కన కూర్చుని సినిమా చూస్తే అదో దర్జా! హాలువాళ్ళు, సినిమా మనుషులు అందరూ తమని గౌరవించడం - సపర్యలు చేయడం - చాలా బావుంటుందలా!

"సాయంత్రం అయిదున్నర వరకూ మాధవరావు కోసం ఎదురు చూస్తూ కూర్చుందామె. అతన్తో చెప్పి సినిమాకు వెళ్ళాలను కొంది. తీరా అతను రాక ముందే కారొచ్చే సరికి చేసేదిలేక పని మనిషికి చెప్పి కారులో థియేటర్‌కి చేరు కొంది. హాలు చుట్టూ ఇసుక వేస్తే రాలని జనం. పోలీసుల విజిల్స్, కేకలు, లాఠీలు ఊపడాలు మధ్యనుంచీ కారు హాలు ఆవరణ లోపలికి చేరుకొని పోర్టికోలో ఆగింది. చుట్టూ నిలబడ్డ జన మంతా ఆమెవంకే పరిశీలనగా చూస్తు న్నారు. అలాంటి అదృష్టం తనకు కలిగినందుకు అసూయపడుతున్నారేమో అనుకొంది సీత. తను బందర్లో ఉండగా అనేకసార్లు తన క్లాసు పిల్లలతో సినిమాల కెళ్ళింది. చాలా సినిమాలు తను మొదటి రోజు చూసినవే. మొదటిరోజు సినిమా చూడటమంటే తమకి చాలా గొప్పగా ఉండేది. ఆ రష్‌లో నలభై పైసల టిక్కెట్టుకోసం క్యూలో నుంచుని ఎన్నో బాధలుపడి సినిమాకి వెళ్ళేవాళ్లు. ఆ సమయంలో తూనీగల్లా సరాసరి హాలు ముందుకొచ్చి ఆగిన కార్లలో నుంచి దిగి వెళ్ళే స్త్రీ పురుషులను చూసి అంతటి అదృష్టం తనలాంటి వాళ్ళకు లభిస్తుందా అని కలలు కంటూండేది. ఇవాళ్టికి ఆ కల ఇలా నిజమయి పోయింది.

కారు దిగినుంచునే లోగానే వర్ధనరావు హడావుడిగా వచ్చాడక్కడికి.

"రండి!" అన్నాడు అహ్వానిస్తూ.

మేనేజరు గదిలో కూర్చున్నారిద్దరూ.

"ఇంకా మాట్నీ వదల్లేదు ! 'టాక్' ఎలా వుంటుందోనని హడలిపోతు




న్నాం..." నవ్వుతూ అన్నాడతను. సీత నవ్వేసింది.

"మీ రిక్కడే కూర్చోండి. మాట్నీ వదిలేశాక వస్తాను" బయటికి వెళ్తూ అన్నాడు.

సీత టేబిల్ మీదున్న పేపరు చూస్తూ కూర్చుంది. హఠాత్తుగా ఆమె దృష్టి అందులో ఉన్న సినిమా వార్తల మీదకు మళ్ళింది. గంధర్వావారి తరువాతి చిత్రానికి ప్రముఖ రచయిత్రి సీత గారి 'జీవితసోపానాలు' నవలను ఎన్ను కొన్నారు. మరో విశేషమేమంటే ఆ చిత్రానికి ఆమే ప్రప్రథమంగా సంభాషణలు రాస్తున్నారు....

కొద్ది క్షణాలు అనిర్వచనీయమైన ఆనందంలో మునిగి పోయింది సీత. తనేనాడయినా అనుకొందా తనో రచయిత్రి అవుతుందనీ - ఇలా సినిమాలకు కూడా రాస్తుందనీ?- తను కలలు గన కుండా సాధించిందిది ఒక్కటే. అందుకే ఆనందంతో పాటు, గర్వం, ఆశ్చర్యం కూడా కలుగు తూంటాయ్! దీనికంతటకూ కారణం నిజంగా వర్ధనరావుగారే! ఆయన తలచుకోబట్టే తన పేరు సినిమా లోకంలోకి పాకింది. ఎన్నో నవలలు రాస్తే సంపాదించగలిగే మొత్తం ఓ సినిమాకు సంపాదిస్తోంది. తను జీవితాంతం ఆయనకు రుణపడి ఉండాలి. అంతటి ఉపకారమిది.

బెల్ మోగింది.

సినిమా వదిలారు. ప్రవాహంలా జనం బయటికి పోతున్నారు. ఇరవై నిమిషాల తర్వాత వర్ధనరావు నవ్వుతూ లోపలికొచ్చాడు.

"రండి సీతగారూ!" అన్నాడు ఆమెనుద్దేశించి.

సీత అతన్తో పాటు మేడ మీదకు నడిచింది.

ఇద్దరూ బాక్స్‌లోకెళ్ళి కూర్చున్నారు.

"ఎలావుంది టాక్ ?" అడిగిందామె కుతూహలంగా.

"బాగానే వుందంటున్నారు....అంటే యాభై రోజుల పిక్చరని అంచనా వేసు కొన్నాం... ఇంకా మిగతా సెంటర్స్ నుంచి కూడా వివరాలొస్తేకాని సరిగ్గా తెలీదు" అన్నాడతను.

సినిమా మొదలయింది.

అ సినిమా గురించి ఏవేవో జరిగిన విశేషాలు నవ్వుతూ చెప్తున్నాడతను. అన్నిటికీ ఊఁ కొడుతోంది సీత.

ప్రణయ సన్నివేశంలో పాట వచ్చింది సినిమాలో. చాలా సెక్సీగా ఉందా దృశ్యం. హీరో హీరోయినూ తడిసిన దుస్తుల్లో ఒకరినొకరు పెన వేసుకు పోతున్నారు. హాలంతా కేకలు-ఈలలు.

హఠాత్తుగా అతని చెయ్యి సీత చేతి మీద పడింది. ఆమె మెద దగ్గర వేడి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. ఖంగారు పడింది సీత.

"ఇలాంటి దృశ్యాలున్నాయి చూశారూ! ఎవరికీ ఇష్టం ఉండదు చూడ్డానికి. కనీసం పైకయినా వీటిని విమర్శిస్తారందరూ. కానీ ఇవేమీ లేకపోతే మళ్ళీ ఆ సినిమా దేనికీ పనికిరాదు" నవ్వుతూ నెమ్మదిగా, రహస్యంగా అన్నాడతను. అని మామూలుగా తన స్థానం వేపు జరిగి కూర్చున్నాడు. అతని చేయి మాత్రం ఇంకా సీత చేతికి తగుల్తూనే వుంది. ఏమీ చేయడానికి తోచలేదు

సీతకి. చేయి వెనక్కు లాక్కొంటే అత నేమనుకొంటాడోనని మనసు పీకుతోంది. అలాంటి చిన్నచిన్న విషయాలు పట్టించుకొంటే నవ్వుతాడేమో! అయినా సినిమా ఫీల్డులో ఉన్నవాళ్ళకి ఇలాంటి పట్టింపు లుండకూడదు. అక్కడ అందరూఎంతో చనువుగా ఉండక తప్పదు, అంటూ సరి పెట్టుకొంచామె.

ఇంటర్వెల్ అయింది.

ఓ కుర్రాడు ట్రేలో రెండు కూల్ డ్రింకులు తీసుకొచ్చి అందించాడు ఇద్దరికీ.

"మీరు చూస్తూండండి! నేను ఫోన్లో మాట్లాడి కొద్దిసేపట్లో వస్తాను..." అంటూ వెళ్ళిపోయాడు వర్ధనరావు. సినిమా చివరివరకూ రావడం కుదర లేదతనికి. అతనొచ్చి అయిదు నిమిషాలు కూర్చునేసరికి సినిమా అయిపోయింది.

"సినిమా ఎలావుంది మీకు?" అడిగా డతను.

"చాలా బావుంది"

"వెరీగుడ్! మీదీ నా టేస్టే నన్న మాట" నవ్వుతూ అన్నాడు.

సీత నవ్వింది.

"సరే! మీరు కార్లో ఇంటికెళ్ళిపోండి! నేను తరువాత వస్తాను"

సీత కిందకు దిగి సిద్ధంగా ఉన్న కార్లో కూర్చుంది. పది నిమిషాల్లో ఆమె ఇంటిముందు ఆగింది కారు. కాలింగ్ బెల్ మోత విని నిద్రకళ్ళతో తలుపు తెరచాడు మాధవరావు.

"ఆఫీసునుంచి ఎన్నింటికొచ్చారు?" బట్టలు మార్చుకొంటూ అడిగింది సీత.

"నువ్వు అటు వెళ్ళావు, నేను ఇటు వచ్చాను. అంతే! రాగానే నువ్వు రాసి పెట్టిన చీటీ చదివాను. భోజనం చేసి పని మనిషిని పంపేసి హాయిగా నిద్ర పోయాను"

సీత తను కూడా ఎంగిలిపడి గదిలో కొచ్చింది. సినిమాలోని ఆ ప్రణయ దృశ్యాలే ఆమె కళ్ళముందు కదులు తున్నాయి. మనసు పూర్తిగా కోరికలతో నిండిపోయింది. మాధవరావు పక్కనే పడుకొని అతనిమీద చెయ్యి వేసింది. కాని అప్పటికే మాధవరావు నిద్రలో ఉన్నాడు.

ఉక్రోషం ముంచుకొచ్చింది సీతకు. రోజూ తను రాసుకుంటూ కూర్చుం టుంది. అది ముగిసేసరికి అతను నిద్ర పోతున్నాడు. చేసేది లేక తనూ నిద్ర పోతోంది. కోరికలు కూడా తనతోబాటు బలవంతంగా నిద్రపోతున్నాయి. ఏవి టిది? సంసారమంటే ఇదేనా?

చాలాసేపు నిద్రపట్టక సతమత మయిందామె.



## 12

సినిమాకు సగంవరకూ సంభాషణలు రాయడం పూర్తయిపోయింది. అదంతా ఓసారి చదువుకొంటే ఎంతో సంతృప్తి కలిగిందామెకు. అంతటి చక్కని సంభాషణలు రాయడానికి సగం కారణం వర్ధనరావే! ఆయన దగ్గరున్న పాత స్క్రిప్టులు ఎంతో సహాయం చేశాయి.

సినిమాకు ప్రారంభోత్సవం జరిగింది. సినీ నటులతోపాటు తన ఫొటోలు కూడా చాలా సినిమా పత్రికల్లో వచ్చాయి. దాంతో ఆమెకు అభిమానులు మరింత పెరిగిపోయారు. రోజూ తనను చూడడానికి ఎవరో ఒకరు ఇంటికి రావడం జరుగుతోంది. పాప బాధ్యత పూర్తిగా మాధవరావుమీదా,పనిపిల్లమీదా వదిలేసిందామె. ఎప్పుడయినా ఖాళీ దొరికితే కాసేపు ఎత్తుకుని ముద్దులాడడం అంతే!

"ఇవాళ నా బర్త్‌డే!" అన్నాడు వర్ధనరావు ఆ రోజు సీత ఇంటికొస్తూనే.

"హాపీ బర్త్‌డే టూయూ! అంటూ పాట పాడేయమన్నారా ?" నవ్వుతూ అడిగిందామె.

"నేను పుట్టినరోజు అంత అట్టహాసంగా జరపనులెండి! నాకు కావలసిన వాళ్ళతో ఈ రోజంతా సరదాగా గడిపేస్తాను అదే నా కిష్టం !"

"ఈ పద్ధతి బావుంది ఒక్క పైసా ఖర్చుండదు..."అంది నవ్వేస్తూ.

"అబ్బే! డబ్బు ఖర్చు చేయాల్సి వస్తుందని జరపటంలేదనుకుంటున్నారా! అలాగయితే మీరు నన్నింకా సరిగ్గాఅర్థం చేసుకోనేలేదన్నమాట..." ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడతను.

"ఊరికే అన్నాన్లెండి తమాషాకోసం! మీ విషయం నాకు తెలీదా?" త్వరగా అనేసింది సీత. అతను బాధపడతాడేమోనని ఖంగారుపడిందామె.

"సరే - అలా అన్నందుకు మీ మీద తరువాత యుద్ధం చేస్తాను. ఇవాళ నా పుట్టినరోజవడంవల్లా - ఇవాళ నాక్కావలసిన వారు మీరే గనుక - ఇవాళ సాయంత్రం మీరు నా అతిథి కనుక - ప్రస్తుతానికి మిమ్మల్ని తేలిగ్గా వదిలేస్తున్నాను"

"అంటే సాయంత్రం డిన్నరుంటుందా? లేక టీ పార్టీయా?"

"అన్నీ ఉంటాయి. మీరు మాత్రం ఆరింటికల్లా సిద్ధంగా ఉండండి! ఓకే?"

"సరే..." తలూపింది సీత.

"మరో విషయం చెప్పడం మర్చిపోయాను! బహుమానాలు చెల్లనేరవు" నవ్వుతూ అన్నాడతను. సీత కూడా నవ్వాగలేదు.

ఆ సాయంత్రం మాధవరావు ఆఫీసు నుంచి వచ్చేసరికి సీత హడావుడిగా ముస్తాబవుతూ కనిపించింది.

"ఇవాళ ఎక్కడికి ప్రోగ్రామ్ ?" అడిగాడతను నవ్వుతూ.

"డిన్నర్‌కి"

"అబ్బ! మినిష్టర్లకంటె కూడా నీకు ప్రోగ్రామ్‌లు ఎక్కువయిపోయాయి..."

"అలా వెక్కిరించకపోతే మీరూ రాకూడదూ ? మిమ్మల్ని రావద్దన్నదెవరూ ?" కోపంగా అందామె.

"వద్దు బాబూ! నీతో వస్తే నేనే ప్రోగ్రామ్‌కీ రాను..."

"ఎందుకని ?" నవ్వాపుకొంటూ అడిగింది సీత.

"అక్కడ అందరూ నన్ను సీత మొగుడు అంటూ గుర్తించడమేగాని 'ఆమె మాధవరావు భార్య' అనే వారెక్కరూ లేరు. అది నాకు చెడ్డ చిరాకు" ఆమెని దగ్గరకు తీసుకొంటూ అన్నాడతను.

బయట కారు హారన్ వినిపించింది.

"ఈ జీవితం నీకు సంతృప్తికరంగా ఉందేమోగాని సీతా, నాకు మాత్రం ఏమీ నచ్చలేదు. మనం మళ్ళీ ఆ పాత ఇంట్లో



కెళ్ళి, నువ్వు కథలు రాయడం మానేస్తే ఆ జీవితం ఎంత బావుంటుందో అనిపిస్తూ టుందప్పుడప్పుడూ..." నిరుత్సాహంగా అన్నాడతను.

"ఇంకా నయం! అసలు మన వివాహానికి పూర్వమున్న జీవితం తిరిగివస్తే బావుండునన్నారు కాదు" మరోసారి అద్దంలో చూసుకొని బాగ్ తీసుకొని బయటకు నడవబోయిందామె.

"రాత్రి భోజనానికి రావుకదూ ?" అడిగాడతను.

"ఊహు ! వర్ధనరావుగారి పుట్టినరోజి వాళ నేనే ముఖ్య అతిథినట" నవ్వుతూ బయటకు వచ్చేసిందామె.

కారు ఆమెను తీసుకెళ్ళి ఖరీదయిన ఓ హోటల్ ముందాగిండి.

అంతకు ముందు ఆ హోటల్ ముందు నుంచీ వెళ్ళిందిగాని లోపలకు మాత్రం వెళ్ళలేదు.

తనకోసమే ఎదుర్చూస్తున్నాడు వర్ధనరావక్కడ. అతని వేషం పూర్తిగా మారిపోయిందావేళ. లాల్చీ, పైజమా వేసుకొన్నాడు. డ్రైవర్‌ని పంపించివేసి తనే కారు నడపసాగాడతను. సీత ఫ్రంట్ సీట్లో అతని పక్కనే కూర్చుంది.

"అలా కాసేపు సరదాగా తిరిగి వద్దాం!" అన్నాడతను.

"మీ ఇష్టం!" అంది సీత.

కారు నెమ్మదిగా పోతోంది టాంక్ బండ్ మీద నుంచి! చల్లని గాలి విసిరి కొడుతోంది. ఆహ్లాదంగా ఉందక్కడ వాతావరణం.

కబుర్లు చెప్పుకొంటూ ఆనందంలో తేలిపోతూ నడుస్తున్న యువతీ యువకులు, బెంచీలమీద కూర్చుని మైమరచి చుట్టూ ఉన్న లోకాన్నే మర్చిపోతున్న జంటలూ—

అంతటి ఆనందం తనెందుకు పొందలేకపోతోంది ? మాధవరావు లోపమా అది? లేక తన లోపమా? తామిప్పుడు కొంచెం డబ్బున్న వారేకావచ్చు. అంత మాత్రాన ఇలాంటి సుఖాలు ఎందుకు దూరమవుతాయి. సుఖం అనేది మొదట్లో తామున్నలాంటి పెంకుటిళ్ళల్లోనే దొరుకుతుందా? 'లేమి'లోనే అన్ని సుఖాలూ ఉన్నాయా ? ఊహు ; తను ఒప్పుకోలేదు. అదంతా డబ్బులేని వాళ్ళందరూ తమని తాము మభ్య పెట్టుకోడానికి వాడుకొనే మాటలు. అంతే వాటిల్లో అర్థంలేదు. ఆకలితో మాడుతూంటే ఆనందా లెక్కడినుంచి వస్తాయి?

చీకటి !

కారు రోడ్డుమీద పాములా జారిపోతోంది కారు. నిర్మానుష్యంగా ఉందా రోడ్డు.

"ఎక్కడున్నాం మనం ?" ఆశ్చర్యంగా అడిగింది సీత.

"రామచంద్రాపురం రోడ్డిది" నవ్వుతూ అన్నాడు వర్ధనరావు.

చల్లనిగాలి మరింత ఎక్కువగా వీస్తోందక్కడ

కారు నెమ్మదిగా రోడ్డు పక్కకు తీసి ఆపాడతాను.

"మీరు కారెప్పుడు కొంటున్నారు?" అడిగాడతను సిగిరెట్ వెలిగించుకొంటూ.

సీత గలగలా నవ్వేసింది.

"నవ్వుతారెందుకూ ?"

"అవును మరి ! ఒక్కసారిగా కారెప్పుడు కొంటారని అడిగితే నవ్వకేం చెయ్యాలి ?"

"ఇందులో నవ్వేందుకేముందో"

"మేము మీరనుకొంటున్నంత ధన వంతులం కాదండోయ్ అది గుర్తుంచుకొని మాట్లాడండి"

"ధనవంతులు కాదని నాకూ తెలుసు. కాని మరో సినిమా ఛాన్స్ దొరికితే కూడా కారుకొనలేరా ?"

"అఫ్‌కోర్స్ అప్పుడు అంతకష్టమేం కాదులెండి అయినా అప్పుడే మరో సినిమా ఛాన్సెవరిస్తారని ?" నిరాశగా అంది సీత.

"ఒకరిచ్చేదేమిటి ? నేనే ఇస్తాను" ఆమెవంక చూస్తూ అన్నాడతను.

"ఇది పూర్తి కాకుండానా!"గుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయామెకి.

"బావుంది మీరు చెప్పేది ! ఒక సినిమా పూర్తయే వరకూ మరో పిక్చర్ టేకప్ చేయగూడదా ఏమిటి ? మీకు నా పుట్టినరోజునాడే చెప్పాలని దాచి వుంచానీ విషయం. నా నెక్ట్స్ పిక్చర్‌కి కూడా మీ నవలే ఎన్నుకొన్నాను"

"ఏ నవల ?" ఆనందోత్సాహాలు ముప్పిరి గొన్నాయామెని.

"క్రిందటి నెలలో మాసపత్రికలో ముగిసిన సీరియల్ ఉంది చూడండి ! దానిపేరు 'మంచు మనుషులు' అను కొంటాను..."

"అవునవును"

"కొత్త రకంగా ఉందా కథ. అందు కని నాకు నచ్చింది. ఈసారి మీకు డబ్బేమీ ఇవ్వదల్చుకోలేదు. ఒకకారు కొనిస్తున్నాను దాని బదులు ! మీరు ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినాసరే"

సీతకేం జవాబు చెప్పాలో తెలీ లేదు.

ఏమిటది ? ఈ మనిషి మరీ ఇంత మంచి వారేం? ఇంతమంచి మనిషికి తాను ఏ విధంగా ఋణం తీర్చుకోగలదు ?

చాలాసేపు ఆ నవల గురించే మాట్లాడాడతను.

కారు మళ్ళీ వెనక్కు తిరిగింది.

మళ్ళీ అదే హోటల్-కమ్‌బార్.

"మీరెప్పుడయినా కాబరే నృత్యాలు చూశారా ?" అడిగాడతను.

"ఊహూ!" సిగ్గుపడుతూ అంది సీత.

"ఓసారి చూడాలి! మీరు రచయిత్రి కాబట్టి చూడడం అవసరం. అందుకే తీసుకొచ్చానిక్కడికి."

ఇద్దరూ కారు దిగి లోపలకు నడి చారు. లోపల టేబిల్స్ అన్నీ పూర్తిగా నిండలేదు. తమకు రిజర్వ్ చేసిన టేబిల్ దగ్గర కూర్చున్నారిద్దరూ. అప్పటికే డాన్స్ మొదలయింది గుండెల మీదా, మొలమీదా జానెడు బట్టలున్న అమ్మాయి స్టేజి మీద పిచ్చిదానిలా ఊగుతోంది. అలాంటి నృత్యాలు సిని మాలో చూసేప్పుడు ఏమీ అనిపించదు కాని ఇలా ఎదురుగ్గా కూర్చుని చూడా లంటే సిగ్గుగా ఉంది సీతకు.

"మీకేమీ అభ్యంతరం లేకపోతే నేను విస్కీ తీసుకుంటాను..." అన్నాడు వర్ధనరావు.

సీత నవ్వింది "మీరు తీసుకొంటే నాకేం అభ్యంతరం ?"

అతని ముందు ఓ గ్లాసు-అందులో సగానికి విస్కీ-ఉంచాడు బేరర్. షోడా కలిపి నెమ్మదిగా తాగసాగాడు వర్ధన రావు. సీతకదే మొదటిసారి తాగుడును ప్రత్యక్షంగా చూడటం కూడా !

డాన్స్ చేసే అమ్మాయిలోపలికెళ్ళి

పోయింది. లైట్లు డిమ్ అయిపోయాయి ఇప్పుడు. లోపల్నుంచీ మరుక్షణంలో రెండు ఆకారాలు స్టేజిమీద కొచ్చాయి. లైట్లు మరింకా డిమ్ అయ్యాయి. మొల మీద గుడ్డలు తప్పితే ఇంచుమించు నగ్నంగా ఉన్నాయి రెండు ఆకారాలూ. ఇద్దరిలో ఒకరు స్త్రీ, మరొకరు పురుషుడు అని గుర్తించింది సీత. ఇద్దరూ నృత్యం ప్రారంభించారు. వాళ్ళ నృత్యం చూస్తూంటే ఒళ్ళు జలదరిందామెకి. ఇంచు మించుగా కామక్రీడల్లా ఉన్నాయా భంగిమలు ! సిగ్గుతో శరీరం కుంచిం చుకు పోతోందామెకి. క్రీగంట వర్ధనరావు వంక చూసింది. అతను నవ్వుతూ తన వంకేచూస్తున్నాడు.

"మీకు నచ్చకపోతే వెళ్ళి పోదాం పదండి" నవ్వుతూ అన్నాడతను.

"వెళ్ళిపోదాం!" అంది సీత నెమ్మదిగా.

అతను గ్లాసులో మిగిలిన ద్రవాకాన్ని ఒక్క గుక్కలో తాగేసి బేరర్‌కి డబ్బిచ్చి ఆమెతో పాటు బయటకు నడిచాడు.

కారు నెమ్మదిగా పోతోంది.

"మరీ ఘోరంగా ఉంది వాళ్ళడాన్స్ అసలది డాన్సేమిటి నా మొఖం..." ఇంకేదో అనాలనుకొని సిగ్గుపడి వూరు కుండి పోయింది.

"మీరు ఇదే మొదటిసారి కదూ చూడటం అందుకని ఆలా అనిపిస్తుంది" నవ్వుతూ అన్నాడు వర్ధనరావు.

కారు మరో ఖరీదయిన హోటల్ ముందాగింది.

"పదండి! మనకి డిన్నర్ ఇక్కడే" అన్నాడతను.

ఇద్దరూ లోపలికి నడిచి లిఫ్ట్‌లో నుంచున్నారు. మసక చీకటిగా ఉన్న చోట ఆగింది లిఫ్ట్.

అతన్తోపాటు బయటకు నడిచి ఎదురుగ్గా ఉన్న గది ముందు నిలబడింది సీత. రూము తాళం తెరచి బోయ్‌ని పిలచాడు వర్ధనరావు.

అతనికేవేవో ఆర్డరిచ్చి "త్వరగా తీసుకురావాలి!" అన్నాడు తను గదిలోకి నడుస్తూ. సీత అతన్ని అనుసరించింది.

లోపల రెండు మంచాలూ, తెల్లని దుప్పట్లూ, ఓ సోఫా, కుర్చీలూ—ఎయిర్ కండిషన్ మిషన్ స్విచ్‌నొక్కాడతను"

"కూర్చోండి !" అన్నాడతను సోఫా చూపిస్తూ.

"ఇక్కడెందుకు?" ఆశ్చర్యంగా అడిగింది సీత.

"ఏకాంతంగా ఉంటుందని ! డైనింగ్ హాల్లో రష్ ఎక్కువ"

అనేకరకాల పదార్థాలతో భోజనం తెచ్చి వారిముందుంచాడు కుర్రాడు.

ఇద్దరూ భోజనం చేయసాగారు.

"మిమ్మల్ని ఎప్పట్నుంచో ఓ మాట అడగాలను కొంటున్నాను సీత గారూ!" అన్నాడతను.

"ఏమిటది ?" నవ్వుతూ చూసిందామె.

"మీరు ఇంత అందంగా ఉండీ కూడా సినిమాల్లో వేషాలకి ఎందుకు ప్రయత్నించలేదు ?"

"బావుంది ! నా అందాన్ని మీరే పొగడాలి..." తీసిపారేస్తూ అందామె.

"అంతే లెండి! ఎవరి సంగతి వాళ్ళకు తెలీదుట ! నాకు మిమ్మల్ని చూడగానే అనిపించింది. మీరు సిని





మాల్లో నటిస్తే బావుంటుందని. అఫ్‌కోర్స్ సినిమాల్లో చేరడం వల్ల మంచీ-చెడూ రెండూ ఉంటాయి. అందుకే అడగలేక పోయాను..."

సీత అతని పొగడ్తకి పొంగి పోయింది.

తనకు సినిమాల్లో నటించాలని ఎప్పుడూ లేదు. అంతటి అందగత్తె కాదని కూడా తెలుసు! కాని అతను తన అందానికి అంతటి కాంప్లిమెంట్ ఇస్తాడను కోలేదు. అది అమితమైన ఆనందాన్ని కలిగించింది.

భోజనం ముగిసింది.

బోయ్ వచ్చి అంతా క్లీన్ చేసి ప్లేట్లన్నీ పట్టుకెళ్ళి పోయాడు.

టైము చూసుకొంది సీత. పది దాటింది.

"ఇప్పుడే వెళ్ళిపోదామా ?" అడిగా డతను.

"ఫరవాలేదులెండి. కాసేపు కూర్చుని వెళ్దాం" మర్యాద కోసం అందామె.

అంతకు ముందు కారు కొనిస్తానని అతనన్న మాటలే ఆమె చెవుల్లో మారు మ్రోగుతున్నాయ్ ఇంకా! నమ్మలేక పోతోంది ఓ పట్టాన. కాని అది మాట్లాడింది మరొకరూ మరొకరూ కాదు. మాటకోసం నిలబడే వర్ధనరావు.

"సీతా!"

కొత్తగా వినిపించిన సంబోధనకి ఆశ్చర్యంగా అతనివేపు చూసింది సీత. అతను తలుపుకి లోపల్నుంచీ తాళం వేసి తిరిగి ఆమె దగ్గర కొచ్చాడు.

"మీకో రహస్యం చెప్పనా ?" ఆమె పక్కనే కూర్చుంటూ అన్నాడు.

"ఏమిటి ?"

"మిమ్మల్ని చూసిన మొదటి రోజు నుంచే మీ రూపం నన్ను వేటాడుతోంది. మీ ఆకర్షణ నుంచీ తప్పించు కోవాలని ఎంతో ప్రయత్నించాను. కాని సాధ్యం కాలేదు"

అతని చేతులు ఆమెను చుట్టివేశాయి

సీత బిత్తరపోయింది.

ఏమిటిలా జరుగుతోంది. ఎంతో ఉన్నతమైన వ్యక్తిగా ఊహించుకొన్న వర్ధనరావేనా ఇలా ప్రవర్తిస్తోంది? తన కోసం ఎంతో అభిమానంతో అవకాశా లిచ్చిన ఆయనేనా ఇలా మాట్లాడుతోంది?

"సీతా! డార్లింగ్ ! ఎన్నాళ్ళ నుంచో ఈ కోరిక నన్ను దహించి వేస్తున్నా- ఇవాళ్టివరకూ అతి కష్టంమీద నెట్టివేస్తూ వచ్చాను. కారణమేమిటో తెలుసా ? ఇవాళ నా పుట్టిన రోజు. ఈ రోజే మనం ఒకటవాలని - అనుకొన్నాను. నా జీవితంలో ఇది మరపురాని రోజు కావాలని కోరుకొన్నాను..."

ఆమెను అమాంతం లేపనెత్తి మంచం మీదకు చేర్చి మీదకు ఒరిగి పోయాడతను. సీతకు స్పృహ కోల్పోతున్నట్లు అనిపించ సాగింది. అతన్ని తనెందుకు ప్రతిఘటించలేక పోతోందో అర్థం కావటం లేదు. ఏమిటి తనలో ఈ బలహీనత ? అతని వల్ల తను సినీ రచయిత్రి అయిందనా? అతను అందజేస్తున్న ధనసహాయం మూలానా ? అతని మీదున్న గౌరవం చేతా? అతనికీ, తనకీ మధ్య ఏర్పడ్డ స్నేహంవల్లా...

"సీతా ! మిమ్మల్ని బాధిస్తున్నానా నేను" కళ్ళల్లో కళ్ళుంచి అడిగాడతను.

సీత కళ్ళ వెంబడి నీళ్ళు జారి పోయాయి. అప్రయత్నంగా అతనిని తన




గుండెలకు హత్తుకొని కళ్ళు మూసుకొంది.



## 13

వారికి స్పృహ వచ్చేసరికి రాత్రి రెండయింది.

''ఇంక వెళ్దామా ?'' అడిగాడతను.

'' ఊ ! '' అంది సీత అయోమయంగా.

ఇద్దరూ బట్టలు కట్టుకొన్నారు. లిఫ్ట్‌లో కిందకు దిగి కారులో కూర్చుంది సీత. కారు బయల్దేరింది.

ఇద్దరూ ఒక్క మాట కూడా మాట్లాడలేదు ఆమె ఇల్లు చేరేంత వరకూ.

కారు దిగి నుంచుంది సీత. ఆమె చేతిని అందుకొని పెదాలతో స్పర్శిందాడతను.

"గుడ్‌నైట్"

''గుడ్‌నైట్...'' అస్పష్టంగా గొణిగింది సీత. కారు స్టార్ట్ చేశాడతను.

మేడ మెట్లెక్కి కాలింగ్ బెల్ నొక్కిందామె. మాధవరావు తలుపు తెరచి ఆమెవంక చూశాడు.

అతని కళ్ళల్లోకి చూడలేకపోయింది సీత.

"చాలా ఆలస్యమయిందే?" అన్నాడు మాధవరావు మళ్ళీ పక్కమీదకు చేరి కళ్ళు మూసుకొంటూ

"అవును" అంది సీత.

త్వరగా బట్టలు మార్చుకొని మంచం మీద అతనికి దూరంగా పడుకొని లైట్ తీసేసింది. గుడ్డిగా వెలుగుతున్న బెడ్ లైట్ కాంతిని కూడా ఆమె భరించలేకపోతోంది. అదికూడా తీసేసి చీకట్లోకి చూస్తూ పడుకొంది. జరిగిందంతా నమ్మబుద్ధి కావడంలేదు. అదంతా కలగా తేలిపోతే బావుండునని కూడా వుంది. అలా అది అబద్ధమయిపోతే ఇకముందు అలాంటి దౌర్భాగ్యపు స్థితిలోకి దిగజారకూడదని అనుకొంది. కానీ దురదృష్టవశాత్తూ అది పచ్చి నిజం. తను వర్ధనరావుతో వ్యభిచరించింది. అతని వెనక వున్న డబ్బు తనలోని నీతిని కొనుక్కొంది. ఇప్పుడు తన మనసు, తన పెదాలూ, తన కళ్ళూ, తన సర్వస్వం మలినమయిపోయాయి. తెల్లారేవరకూ నిద్రపట్టక అటూ ఇటూ పొర్లుతూనే ఉంది. మాధవరావు నిద్ర లేవటం, ఆఫీసుకెళ్ళడానికి సిద్ధమవటం అవేమీ తెలీదు తనకి. వెళ్ళేముందు గదిలోకొచ్చి ఆమెను చూచి ఆశ్చర్యపోయాడతను.

"ఏమిటి నిద్ర లేవడంతోనే ఆలోచనలో పడ్డావ్?" అడిగాడు.

ఎంత ప్రయత్నించినా అతనివేపు చూడలేకపోతోంది. ఇద్దరి కళ్ళూ కలుసుకోవడం భరించలేదు తను.

"ఏమీ లేదు" అతి కష్టంమీద నవ్వు తెచ్చుకొంటూ అంది.

"సీతతో మాట్లాడ్డానికి కూడా టైము దొరికేట్టు లేదు. మరీ బిజీ అయిపోతున్నావ్. కొంత కాలంపోతే నిన్నేమయినా అడగాలంటే నాలుగురోజుల ముందే 'ఇంటర్వ్యూ'కి పర్మిషన్ తీసుకోవాల్సి వచ్చేట్టుంది".

అతను వెళ్ళిపోయాడు.

లేచి మొఖం కడుక్కొని మళ్ళీ పడుకుండిపోయిందామె. వంటమనిషి కాఫీ తీసుకొచ్చి ఇచ్చింది. కాఫీ తాగాక కొంచెం చలనం కలిగిందామెలో. అయిందేదో అయిపోయింది. ఇంక దాన్ని గురించి ఆలోచించి కూడా నిష్ప్రయోజనమే. కొన్ని తప్పులు, అవి తప్పులని తెలుసుకొన్న తరువాత సరిదిద్దుకోవచ్చు. మరికొన్ని తెలిసి చేసినా, తెలియక చేసినా ఆ తరువాత సరిదిద్దుకోలేనివి అయివుంటాయి.

ఆలోచనల్లో ఎంత సమయం గడచిపోయింది ఆమెకు తెలీనే లేదు.

"లోపలకు రావచ్చా?" అన్న గొంతు విని ఆలోచనల్లోంచి బయటపడింది. ఎదురుగ్గా వర్ధనరావు నుంచుని కనిపించాడామెకు.

"ప్రొద్దుట్నుంచీ లేవనేలేదని మీ పనిమనిషి చెప్పింది. ఎందుకని? వంట్లో బావుండలేదా?" అడిగాడతను.

"ఊహుఁ అదేమీ లేదు" పెదాల మీదకు నవ్వు తెచ్చుకొంటూ అందామె. లేచి కూర్చుంది మంచంమీదే.

అతను ఆమెపక్కనే కూర్చున్నాడు.

"ఏమిటలా ఉన్నావ్?" ఆమెను దగ్గరకు లాక్కొంటూ అడిగాడు.

"ఎలా వున్నాను?" అతనివేపు చూడకుండానే అడిగింది సీత.

"ఏమో! అదివరకులా మాత్రం లేవు" ఆమె పెదాలమీద ముద్దు పెట్టుకొంటూ అన్నాడతను.

అతని కౌగిలినుండి సున్నితంగా తప్పించుకొందామె.

"వచ్చే గురువారంనాడే మన సిని

మాలో ఆఖరి సీన్లు షూట్ చేస్తున్నాము. దాంతో షూటింగు పూర్తయినట్లే" చెప్పాడతను.

ఆ మాటలు ఆమెలో కొంత ఉత్సాహాన్ని కలిగించాయి.

"అంటే ఎప్పుడు రిలీజ్ చేద్దామను కొంటున్నారు?"

"దగ్గరలో దసరా, దీపావళి పండుగలున్నాయికదా! ఏదో ఒక పండుగకు రిలీజ్ చేయాలని ప్లాన్ చేస్తున్నాము"

"అప్పటికి డబ్బింగ్ వగైరాలన్నీ అయిపోతాయా ?"

"అవ్వాల్సిందే! మరో పది పదిహేను రోజుల్లో పెద్దయెత్తున పబ్లిసిటీ మొదలెడుతున్నాము. నీ పేరు బాగా హైలెట్ చేస్తున్నామనుకో. పోస్టర్స్ నువ్వింకా చూడలేదుకదూ ! రేపోసారి మనాఫీసు కెళ్ళి వద్దాం, చూద్దువుగాని. అది సరేగాని నాకు కాఫీ ఇవ్వవా ఏమిటి? నీచేతి కాఫీ నాకు ప్రాణమని చెప్పానుకదా, మర్చిపోయావా ?"

సీత లేచి లోపలకు నడిచింది. అయిదు నిమిషాల్లో ఇద్దరికీ కాఫీలు తీసుకొచ్చి అతనికెదురుగ్గా కూర్చుంది.

"సీతా! రాత్రంతా నిద్ర పట్టలేదు నాకు. జరిగిందంతా కలేమోనని అనుమానం. కల కాకుండా వుంటే బావుందునని ఆశ" కాఫీ తాగేసి అన్నాడతను.

సీత మాట్లాడ లేదు. లేచి కిటికీలోనుంచి బయటకు చూస్తూ నుంచుంది. అప్రయత్నంగా కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగాయామెకి. ఆమె వెనుకగా వచ్చి నిలబడ్డ వర్ధనరావు గమనించాడది.

"సీతా! ఏడుస్తున్నావా?" చప్పున ఆమెను తనవేపు తిప్పుకొంటూ అన్నాడు.

వెంటనే చేత్తో కన్నీళ్ళు తుడిచేసుకొందామె.

"ఏమయింది సీతా! ఎందుకలా ఉన్నావ్? రాత్రి నా ప్రవర్తన కేమయినా బాధ కలిగిందా?" ఆప్యాయంగా అడిగాడతను.

"ఊహు!" తలూపిందామె. జరిగిందానికి ఇద్దరూ బాధ్యులే! తనెలాగూ బాధ పడుతూనే ఉంది. ఇంక అతన్నెందుకు బాధించటం.

"సీతా! నువ్విలా డల్‌గా ఉండటం నాకు బావుండలేదు. పద! అలా తిరిగొద్దాం. ప్లీజ్!" అన్నాడు అతన్తోపాటు బయల్దేరింది సీత.

ఇద్దరూ కారులో ఒక గమ్యం లేకుండా తిరిగారు చాలాసేపు. అతని బలవంతంమీద అతన్తోపాటు హోటల్లోనే భోజనం చేసింది సీత.

సాయంత్రానికి ఆమెని తిరిగి ఇంటి దగ్గర వదలి వెళ్ళిపోయాడతను. చాలా వరకూ జరిగిన తప్పుని మనసులోనుంచి తొలిగించ గలిగిందామె. ఆమె ఆలోచనా విధానంలో కూడా కొంత వరకూ మార్పు వచ్చింది.

ఆ మర్నాడు మధ్యాహ్నం వర్ధనరావు వచ్చినప్పుడు అతనికి ఎలాంటి అభ్యంతరమూ తెలుప కుండానే లొంగిపోయింది. అతనికి తను కావాలి! డబ్బు అవనీ, రచయిత్రిగా మరిన్ని అవకాశాలు కానీ – ఎలా అనుకొన్నా సరే.

మరికొద్ది రోజులు గడిచేసరికి వారి అనుబంధం మరింత గట్టి పడిపోయింది. ఆ రోజు ఆమె ప్రప్రథమంగా సంభాషణలు రాసిన 'జీవిత సోపానాలు' సినిమా విడుదల.

"సీతా! ఇంచుమించుగా ఈరాత్రంతా నువ్వు నాతోనే గడపాలి" అన్నాడు వర్ధనరావు.

"అమ్మో! ఆయనకు అనుమానం రాదూ?" భయంగా అంది సీత.

"ఎలావస్తుంది? నువ్వు కొంచెం గట్టిగా మాట్లాడితే సరి. ఇంకోసారి అలాంటి అనుమానాలు వెలిబుచ్చితే మర్యాదగా ఉండదని హెచ్చరించు! అతనే తగ్గుతాడు"

సీత కేం చెప్పడానికీ తోచలేదు.

ఎలా జరగాలో అలా జరుగుతుంది. అంతకంటే తను మాత్రం ఏంచేయ గలుగు తుంది? తన సినిమా రిలీజయే రోజు. జనం ఎలా రిసీవ్ చేసుకొంటు న్నారో, తన సంభాషణలు రాయడంలో సఫలీకృతురాలయిందో, విఫలమయిందో- అవన్నీ తెలుసుకోవా లంటే ఈ రాత్రి వర్ధనరావు పక్కనే గడపక తప్పదు.



## 14

"ఈరాత్రి ఇంటికొచ్చే సరికి బాగా ఆలస్యమయి పోతుంది" అంది సీత బయల్దేరేముందు.

"ఎందుకని?" అడిగాడు మాధవ రావు!

"సెకండ్‌షో వరకూ చూసి జనం ఏమనుకొంటున్నారో తెలుసుకోవాలి..."

అతనివంక చూడకుండానే అని బయటకు నడిచిందామె.

ఆబిడ్స్‌లోని ఓ ఖరీదయిన హోటల్లో రెండు గదులు రిజర్వ్ చేయించాడు వర్ధనరావు. ఒక గదిలో డైరెక్టర్ ఉన్నాడు. మరోగది సీత కోసం.

కార్లో ఫస్ట్‌షోకి బయల్దేరింది సీత.

వర్ధనరావు మేనేజరు గదిలో హడా వుడిగా ఫోనులో మాట్లాడు తున్నాడు. సీత అతని మాటలు వింటూ పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది. అతని మాటలను బట్టి తెలుస్తూనే ఉందామెకు సినిమా చాలా బాగుందన్న వార్తలు అన్ని సెంటర్ల నుంచీ వస్తున్నాయని. ఆమెని తమకోసం ఉంచిన సీట్లలోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టి తనూ పక్కన కూర్చున్నాడు వర్ధనరావ్,

"నీ డైలాగులు జనం ఎలా రిసీవ్ చేసుకొంటున్నారో ప్రత్యక్షంగా చూడు" అన్నాడు వర్ధనరావు.

సీత జాగ్రత్తగా చూస్తోంది. సంభా షణల్లో ఎక్కడా ఎలాంటి లోపమూ కనిపించ లేదు. అదే ఆమెకు అమిత మైన ఆనందాన్ని కలిగించింది. తనసం భాషణలు అంత అద్భుతంగా ఉంటాయని తనెప్పుడూ అనుకోలేదు. కానీ ఎవరికీ నిరాశ కలిగించ కుండా ఉంటే అంతే చాలు! లేకపోతే రచయిత్రిగా తనకున్న పేరుకి దెబ్బకొడు తుందది.

సినిమా అయిపోగానే హోటల్‌కి బయల్దేరారు ఇద్దరూ. అక్కడ గదిలో భోజనం చేస్తూండగా డైరెక్టర్ కూడా వచ్చి కూర్చున్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్ సీతగారూ!-మీరు సినీరచయిత్రిగా నిలబడి పోయినట్లేఇక" నవ్వుతూ అన్నాడతను.





"థాంక్యూ" అంది సీత చిరునవ్వుతో

కాసేపు మాట్లాడాక అతను వెళ్ళి పోయాడు.

అప్పటికే టైము ఒకటయిపోయింది. తలుపు బోల్ట్ చేసి లైటార్పి వేశాడు వర్ధనరావు. సీత అతని కౌగిట్లో నలిగి పోయింది.

తెల్లారు జామున నాలుగు గంటలకు ఇద్దరూ గదిలోనుంచి బయటికొచ్చారు. డైరెక్టరు కూడా అప్పుడే తన గదిలో నుంచి బయటి కొచ్చాడు అతన్ని చూస్తూనే ఖంగారు పడిపోయింది సీత. తనూ, వర్ధనరావూ అప్పటి వరకూ గదిలోనే ఉండటం తెలుస్తే - మిగతా వన్నీ అతను ఊహించు కోకుండా ఉంటాడా? ఆ విషయం అంతటా పాక కుండా ఉంటుందా ?

''ఇంకా ఇంటికి వెళ్ళలేదా మీరు ?" నవ్వుతూ అడిగాడతను.

"ఉహు! సీతగారూ నేనూ మాట్లాడు కొంటూ కూర్చున్నాం..." అన్నాడు వర్ధనరావు. కార్లో కూర్చున్నాక సీత తన అనుమానం బయటపెట్టింది.

''అతనికి అనుమానం రాకుండా ఉంటుందా?" అంది సంశయంగా

''వస్తే మాత్రం మనకేం భయం?" నవ్వుతూ అన్నాడతను.

''అందరూ మన గురించి చెప్పుకోరూ అసహ్యంగా?"

''ఏడ్చారు. ఈ తప్పు ఎవరయినా డబ్బులేనోళ్ళు చేస్తే గొడవయిపోతుంది కాని మనలాంటివాళ్ళ విషయం తెలిసినా మాట్లాడకుండా ఊరుకొంటారు"

"అయినా ఎందుకొచ్చిందీ - మన మింకా అందరి కళ్ళల్లోనూ పడటం బావుండదు. ఇకనుంచీ మా ఇంట్లోనే కలుసుకుందాం! ఏ గొడవా వుండదు" అతను నవ్వాడు.

''సరే నీ ఇష్టం!"

కారు ఇంటి ముందాగింది.

దిగి మెట్లెక్కి కాలింగ్‌బెల్ నొక్కిం దామె. వెంటనే తలుపు తీశాడు మాధవ రావు.

"చాలా ఆలస్యం అయిపోయిందే ?" అన్నాడు టైము చూస్తూ.

''సినిమా హాల్లోనే మాట్లాడుతూ కూర్చున్నారందరూనూ. నేనూ ఇరుక్కు పోయానక్కడ" అబద్ధ మాడేసిందామె.

''నాకూ ఇంతకు ముందే మెలకువ వచ్చింది. టైము నాలుగయినా ఇంకా రాలేదేమిటా అని ఆలోచిస్తూ కూర్చు న్నాను''

"పదండి! నాకు నిద్రకళ్ళమీదుంది. రెండుమూడు గంటలయినా పడుకొంటే గాని రేపు లేవలేను'' బట్టలు కూడా మార్చుకోకుండానే పక్కమీదకు ఒరిగి పోయిందామె.

"సినిమా సక్సెస్ అయినట్టేనా?'' పక్కనే పడుకొంటూ అడిగాడతను.

"ఆ! వందరోజులు ఖచ్చితంగా ఆడు తుందట''

''అలాగయితే - ఇక నువ్వు మకాం మద్రాసుకి మార్చేస్తానన్నావుకదా !"

ఆమె నవ్వి ఊరుకుంది. మాధవరావు కొద్ది క్షణాల తర్వాత ఆమె వంక చూసే సరికి అప్పటికే నిద్రలోకి జారుకుం దామె.

సీతమీద అతనికి అనుమానం లేదు. కానీ వర్ధనరావుతో పెంచుకొంటున్న చనువు అతనికి నచ్చలేదు. అతను

ప్రౌఢ్యూసరే కావచ్చు. సీతమీద అభిమానమున్న మనిషే కావచ్చు. అంత మాత్రాన అతన్తోపాటు షికార్లు చేయాల్సిన అవసరమేముందీ? రాత్రిళ్ళు డిన్నర్లకు వెళ్ళి అంత ఆలస్యం అయేవరకూ ఎందుకు అక్కడుండటం? రచయిత్రిగా ఆమెకో హోదా, గౌరవం ఉంటే ఉండవచ్చు. మామూలు గృహిణికంటె మరో మెట్టుపైన నిలబడినట్లు అనుకొంటే తప్పు లేదు. అంతమాత్రాన తన సంసారాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయాలని ఎక్కడుంది? భర్తకి వంట చేసిపెట్టటానికి, ఓ వంటమనిషీ, పాపను ఆడించడానికి కబుర్లు చెప్పడానికి ఓ పనిపిల్లా ఉంటే సరిపోతుందా?

ఎన్నో ఆలోచనలు అతన్ని ముసురుకొన్నాయి. కాని అవేమీ సీతముందు చెప్పలేకపోతున్నాడు. సీత అవన్నీ విని బాధపడితే తను సహించలేడు. అది తన బలహీనత.

కార్యక్రమం పూర్తిగా మారిపోయిందిప్పుడు.

ఆఫీసూ - ఇంట్లో పాపా - అంతే, ఈ రెండే 'తన' అని అనిపించేవిగా ఉన్నాయి. అదివరలాగా సీతతో సరదాగా మాట్లాడటం, షికార్లకెళ్ళడం, షాపింగ్ కెళ్ళడం - అవేమీ లేవు. ఎప్పుడూ సీత హడావుడిగానే వుంటుంది. ఎప్పుడూ ఆమెకోసం ఎవరోఒకరువస్తూనే ఉంటారు. అభిమానులు, తోటి రచయిత్రులు, పబ్లిషర్లు, పత్రికల యజమానులు, సినిమాలవాళ్ళు — ఆమెకు తీరిక దొరికేది రాత్రి తొమ్మిదిగంటలకే అప్పుడు రచనలతో మునిగిపోతుంది.



తిరిగి లేచేప్పటికి అర్ధరాత్రి పన్నెండు—

ఆమె ఖాళీగాతీరిగ్గా ఉండేది ఉదయం కాసేపు. ఆ కాసేపూ తను ఆఫీసులో ఉంటాడు. ఉదయం తను నిద్ర లేచేసరికి ఆమె నిద్రపోతూంటుంది.

"మీరాపాడు ఉద్యోగం చేయక పోతేనేం? మీరు తెచ్చే నాలుగు వందలూ లేకపోతే మనకు గడవదా ఏం?" అడిగింది సీత ఓ రోజు.

"ఉద్యోగం పురుష లక్షణం అని ఎక్కడో చదివాను ! నేను పురుషుణ్ణనే నా నమ్మకం మరి!" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"ఆ ఉద్యోగం చెయ్యకపోతే మీ హోదా ఏమీ తగ్గదులెండి"

"చేస్తే నీ గౌరవానికి భంగం అనుకొంటే చెప్పు! మానేస్తాను..."

"కాదా మరి! మనకిప్పుడు డబ్బుకేమీ లోటు లేదుకదా! ఇంకా ఆ పాడు ఉద్యోగం చేస్తూంటే చూసే వాళ్ళందరూ ఏమనుకొంటారు? ఫలానా రచయిత్రి భర్త ఆ దిక్కుమాలిన కంపెనీలో గుమాస్తా ఉద్యోగం వెలగబెడుతున్నాడు అని అనుకోరూ ?"

"అది మానేస్తే నీ దగ్గర సెక్రటరీ ఉద్యోగం ఇస్తావా ?"

సీత అతనివంక కోపంగా చూసింది.

"కోపం వచ్చిందా ?" అనునయంగా అడిగాడతను.

"మీరు మాట్లాడే మాటలెలా ఉన్నాయేమిటి మరి ?"

"మరి ఉద్యోగం మానేయమంటే ఎలాగోయ్! ప్రస్తుతం నాకున్న కాలక్షేపం అదొక్కటేగా ?"

సీత మౌనంగా ఊరుకుండి పోయింది.

నిజమే తనకయితే చాలా వ్యాపకా

లున్నాయి. ఆయనకేమున్నాయనీ? ఒక్క మేనమామ తప్పితే బంధువులే లేరు. ఒక్క రెడ్డి తప్పితే స్నేహితులే లేరు. సిగిరెట్లు, పేకాట, తాగుడు, ఇవేమీ లేవు. ఆయన సర్వస్వం తనూ, ఆ ఆఫీసూ—అంతే! ఇప్పుడు కొంతవరకూ పాపతో గడుపుతున్నారు. ఇంక ఆ ఆఫీసు కూడా మానేస్తే ఏం వ్యాపకముంటుంది? ఆ తరువాతెప్పుడూ ఆ ప్రస్తావనే తేలేదు సీత.

ఆ రోజు మామూలుగా లంచ్ బ్రేక్‌లో కాంటీన్ కెళ్ళాడతను. కంపెనీ పని వారితో నిండిపోయి ఉంద క్కడ. నవ్వులు, కేకలు, కబుర్లు - గొడవగా ఉంది. టోకెన్ తీసుకొని క్యూలో నిల బడ్డాడు అతనికి దగ్గరలోనే ఓ టేబిల్ చుట్టూ కూర్చున్న కొంతమంది గట్టిగా చర్చించుకొంటున్నారు.

"'జీవిత సోపానాలు' చూశావా ?"

"ఓ ఫస్ట్‌డేచూశాను. చాలాబావుందిలే. అది రాసిందెవరనుకొంటున్నావ్? మనా ఫీసులో మాధవరావు అని లేడూ? ఆడి పెళ్ళాం ! బాగా రాస్తుందిలే"

"అందుకే సినిమా తీశారు మరి"

"అసలు కారణం అదికాదంటగా ! ఆ ప్రొడ్యూసర్ దాన్ని ఉంచుకొన్నా డట మా బామ్మర్ది చెప్పాడు. ఆడు కొన్నాళ్ళు ఆ ఆఫీసులో పన్జేశాడుగా అన్నీ తెలుస్తయ్ ఆడికి" కొద్ది క్షణాలు అంతా నిశ్శబ్దంగా ఉండిపోయారు.

"మరి మొగుడికితెలీదా ఆవిషయం?"

"తెలుస్తే మాత్రం ఏం చేస్తాడ్రా! అవతల ఈడి పెళ్ళాన్ని పట్టుకొనో్నడు బంగారు పిచ్చుక! కొంచెంసేపు కళ్ళు మూసుకొంటే అంతా బంగారమే"

"ఎంత ఇదయినా పెళ్ళాన్నలా ఎలా



వదిలేస్తార్రా - ఈ ఎదవలు ?"

అంతా నవ్వులు

మాధవరావుకి తన శరీరమంతా మంటల్లో కాలిపోతున్నట్లనిపించింది. ఇంకొక్క క్షణంకూడా అక్కడ ఉండలేక పోయాడు. వడివడిగా నడిచిఅక్కడి నుంచి బయట పడ్డాడు. సరాసరి తన సీట్లోకి నడిచి నిస్సత్తువగా కూలబడి పోయాడు. జ్వరం వచ్చేసినట్లయిపోయింది.

ఏమిటీ ఘోరం ? తన వెనక సీత గురించి ఇలాంటి వ్యాఖ్యానాలు జరుగుతున్నాయా?

ఒక్కడికయినా ఇలా నిందలు వేయడం తప్పన్న జ్ఞానం ఉందా?సీతకూ వర్ధనరావుకూ సంబంధం ఉండటం ఈ బుద్ధిహీనులందరూ చూశారా? ఒక స్త్రీ, పురుషుడు కొంచెం చనవుగా కనబడితే ఇలా కథలల్లేయడమేనా? సంస్కారం లేని నీచులు. ఇలాంటి నీచుల మధ్య ఉన్నాడనే తననీ ఉద్యోగం మానేయమంది సీత. తనామె మాటలు నిర్లక్ష్యం చేసినందుకు తగినశాస్తి జరిగింది.

ఇంక ఆ ఆఫీసులో పనిచేయడం తనవల్ల కాదనిపించిందతనికి. అప్పటికప్పుడే రాజీనామా లెటర్ రాసి మేనేజర్ కిచ్చేడు.

"నాకు తెలుసు - ఈ ఉద్యోగం కేవలం కాలక్షేపం కోసం చేస్తున్నావని" నవ్వుతూ అన్నాడు మేనేజరు.

మరి కొసేపటి తర్వాత అందరి దగ్గరా శలవు తీసుకొని ఇల్లు చేరుకొన్నాడతను. పనిపిల్ల పాపను ఎత్తుకొని తిరుగుతోంది హాల్లో.

"మీ అమ్మగారున్నారా ?" అడిగాడతను.

"గదిలో వర్ధనరావుగారితో మాట్లాడుతున్నారు. ఎవరొచ్చినా ఇంట్లోలేరని చెప్పమన్నారు!"

మాధవరావుని ఆలోచనలు చుట్టుముట్టేశాయి.

ఇంట్లోలేరని చెప్పమందా? ఎందుకని ? అంతటి రహస్యాలేమున్నాయో వాళ్ళకి ? ఒకవేళ... నిజంగానే... వారిమధ్య...

తన ఆలోచన తనకే ఎబ్బెట్టుగా అనిపించిందతనికి. అలాంటి ఆలోచన కలిగినందుకు లోలోపలే సిగ్గుపడిపోయాడు.

ఛ! తను సీతని అనుమానిస్తున్నాడా ? అంతకంటె పాపం ఇంకేమయినా ఉందా సీత తన ప్రాణం ఆమె సర్వస్వమూ కూడా తనే! అలాంటి అవినీతికి ఎప్పటికీ పాల్పడదు.

అప్పుడే వర్ధనరావు సీత నవ్వుకొంటూ గదిలోనుంచి బయటికొచ్చారు. అక్కడ మాధవరావు కనిపించేసరికి సీత తెంగారు పడిపోయిందిగానీ వెంటనే సర్దుకొని "అరె - మీరెప్పుడొచ్చారు ?" అంది ఆశ్చర్యం ప్రకటిస్తూ. ఆమె గొంతులో భయం కనిపిస్తూనే ఉంది.

"ఇప్పుడే" నవ్వుతూ అన్నాడు మాధవరావు

"నన్ను పిలవలేదేంమరి" అనాలోచితంగా అనేసిందామె.

"ఎవరొచ్చినా ఇంట్లోలేరని చెప్పమన్నార్టగా! ముఖ్యమయినా విషయాలేవో మాట్లాడుకొంటూండి ఉంటారని ఇక్కడే కూర్చున్నాను"

"నే నింక వెళ్తాను సీత గారూ" బయటకు నడుస్తూ అన్నాడు వర్ధనరావు.





"అలాగేనండీ"

అతను మాధవరావుతో కూడా "వస్తాను" అని చెప్పి వెళ్ళి పోయాడు హడావుడిగా.

"అవునూ! అప్పుడే వచ్చేశారేమిటి ఆఫీసు నుంచి ?" అడిగింది సీత.

"చెప్పమంటావా ?" అడిగాడు మాధవరావు నవ్వాపుకొంటూ.

"బావుంది" తనూ చిరునవ్వుతో అందామె.

"ఇవాళ నువ్వు ఇచ్చిన ఆజ్ఞ అమలు పరిచాను"

"అంటే ?" ఆమెకర్థం కాలేదు.

"అంటే ఇంకేముంటుందీ ? ఇవాళ నుంచీ ఇక ఆఫీస్‌కెళ్ళక్కర్లేదు"

"నిజంగానా ?" అర్థమయినట్లు ఆనందంగా అడిగిందామె.

"అవును సీతా ! అక్కడ పని చేయడం ఇష్టంలేకపోయింది. రాజీనామా చేసేశాను."

"మంచిపని చేశారు. నాకెంతో ఆనందంగా ఉంది. ఇప్పుడు మనిద్దరం కలసి గడపటానికి బోలెడు సమయం దొరుకుతుంది" సంతోషం ప్రకటిస్తూ అందామె.

ఆమెను చూస్తూంటే మాధవరావుకి మనసంతా కలచివేసినట్లయింది.

తనంటే ఇంత ప్రేమ ఉన్న అమాయకురాలినా తాను అనుమానించబోయాడు ?

ఆ రోజంతా సీత అతనితో కబుర్లు చెబుతూనే గడిపింది.

సాయంత్రం ఇద్దరూ షికారుకెళ్ళేరు.



# 15

"మీరు వర్ధనరావుగారి ప్రొడక్షన్ ఆఫీసులో ఏదయినా ఉద్యోగం చేస్తే బావుంటుంది" అంది సీత కొద్ది రోజులు గడిచాక.

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడతను.

"అదే... ఒకవేళ మీకు ఇంట్లో ఏమీ తోచదనుకొంటే"

మాధవరావు ఆలోచనలో పడ్డాడు. ఏ ఉద్యోగమూ లేకుండా ఉండటం తనకూ ఇష్టంలేదు. కానీ తమ ఆఫీస్ కాంటీన్‌లో వాళ్ళనుకొంటున్న మాటలు విని కూడా వర్ధనరావు దగ్గర ఉద్యోగం చేయడం అతనికి నచ్చటంలేదు.

అతను మౌనంగా ఉండటం చూసి సీత ఇంకేమీ మాట్లాడలేదు. ఆమెకు లోలోపల భయంగానే ఉంది. మాధవరావుకి ఏ ఉద్యోగమూ లేకుండా ఇంట్లో ఉంటే అతనికి - తనకూ, వర్ధనరావుకీ మధ్య ఉన్న సంబంధం తెలిసిపోతుందేమో ! ఇలాంటివి ఒకరోజు కాకపోతే ఒకరోజయినా బయటకు రాకుండా ఉంటాయా?

ఆయన్ని వర్ధనరావు ప్రొడక్షన్ ఆఫీసులో ఉద్యోగం చేయమని వత్తిడి చేయడానిక్కూడా తనకు భయంగానేవుంది.

ఏదేమయినా ఈ విషయంలో తను

జాగ్రత్తగా వ్యవహరించాలి! మర్నాడు వర్ధనరావు వచ్చాడామె దగ్గరకు.

"ఇప్పుడు మనం కలుసుకోవడం కష్టమవుతుంది" అందామె నెమ్మదిగా

"ఎందుకని?"

"ఆయన ఉద్యోగం మానేశారు!"

"ఇంత హఠాత్తుగానా! కారణం ఏమిటి?"

"ఏమో! ఎప్పుడో ఒకసారి నేనే మానెయ్యమని చెప్పానుట! అందుకనే మానేశానని నవ్వుతూ చెప్తున్నారు"

"ఒకవేళ మన మీద అనుమానం కలిగిందంటావా?"

సీత తల వంచుకొంది.

"ఏమో! ఎటూ ఆలోచించలేకపోతున్నాను"

"దీనికింత ఆలోచన ఎందుకూ? అతనికి మా ఆఫీస్‌లో ఓ ఉద్యోగం ఇచ్చి ఎంగేజ్ చేసేస్తాను"

నవ్వుతూ అన్నాడతను. సీత కూడా నవ్వింది "అది నేనూ ప్రయత్నించాను. కానీ అదేమంత నచ్చినట్లు లేదాయనకు. అందుకే ఏమీ జవాబివ్వలేదు"

"ఓహో! అర్థమయింది! పెళ్ళాం ఎలాగూ సంపాదిస్తుందికదా, హాయిగా సుఖపడదాం అని నిర్ణయించుకొన్నాడేమో!" ఆమెవంక చూస్తూ వ్యంగ్యంగా అన్నాడతను.

సీత మనసు చివుక్కుమంది.

ఆ మాట అతను మామూలుగా అన్నా ఆమెకు చాలా బాధ కలిగించింది. మాధవరావు ఎలాంటివాడో తనకు తెలుసు. ఆయనికి చిన్నప్పటినుంచీ సుఖమంటేఏమిటో తెలీదు. అసలు సుఖపడాలన్న ఆలోచనే లేదు. కోరికలూ ఆశలూ,

ఏమీ లేవు. ఉన్నదానితో సంతృప్తి పడటం ఆయన కిష్టం ఎన్నోసార్లు ఆయన్ని స్కూటరు కొనుక్కోమని తను ప్రోత్సహించింది. వత్తిడిచేసింది.అయినా ఆయన ఒప్పుకోలేదు. కారు కొందామని తను ఊగిసలాడినా ఆయన దగ్గర్నుంచీ సుముఖత్వం కనిపించకపోయేసరికి ఆ ఆలోచన మానుకొంది. తీరా కొన్న తర వాత కారెక్కడానికి నిరాకరిస్తాడేమోనని భయం. అప్పుడు తనూ, వర్ధనరావులకే పరిమితమవుతుందది. మళ్ళీ ఆ పరిస్థితి మాధవరావుకి తనమీద అనుమానం కలి గించవచ్చు. అందుకే ఆ ఆలోచనలు విర మించుకొంది. అలాంటి మనిషి మాధవ రావు! ఆయన భార్య సంపాదన మీద సుఖపడడానికి ప్రయత్నిస్తాడా? ఎప్ప టికీ కాదు. తనీనాడు ఇలా అవినీతి పరురాలిగా తయారయిందంటే కారణం కేవలం ఐహిక సుఖాలమీద తనకున్న ఆశలే! ఇందులో మాధవరావు ప్రమేయ మేమీ లేదు. కనీసావసరాల విషయంలో ఆయన తన నెప్పుడూ బాధించలేదు. అత నికి తనంటే ఎంత ప్రేమో, ఎంత అభి మానమో, ఎంతటి నమ్మకమో కూడా తనకు తెలుసు.

అంతటి ప్రేమా, అభిమానం, నమ్మకం - మరి వర్ధనరావుకుంటాయా? నవ్వొ వచ్చింది సీతకి.

వర్ధనరావుకి కావలసింది కేవలం తన అందం! అంతే! తన ఆలోచన తనకే నచ్చలేదామెకి. కేవలం తన అందానికి లొంగి తనను ఇంత ఐశ్వర్యవంతురాలిని చేస్తాడా అతను? అందమే ప్రధానమను కొంటే అతనికి ఎంతమంది అందగత్తెలు లభించరు? తనంటే మరేదో ప్రత్యేకత ఉందతనికి! అదేమిటి? ప్రేమా? వర్ధన రావు తనని ప్రేమిస్తున్నాడా? నవ్వొ వచ్చింది సీతకి! అతను ప్రేమించడానికి భార్య ఉంది. మధ్యలో తననెందుకు ప్రేమిస్తాడు? అయినా ఇంతదూరం ప్రయాణించాక ఇప్పుడా ఆలోచన లెందుకు? అసలు అతను తనకు ఏం తక్కువ చేస్తున్నాడనీ? అతని భార్య కూడా అనుభవించలేని దర్జా, గౌరవం, హోదా తనకిస్తున్నాడు.తనుభవిస్తోంది. అతనితో అన్నిచోట్లకూ అతని భార్య కన్నా ఎక్కువ గౌరవాన్ని పొందుతూ తిరుగుతోంది తను. ఇది అతని మంచి మనసునీ, అతనికి తనమీద ఉన్న అభి మానాన్నీ, గౌరవాన్నీ చాటటం లేదూ? అతని భార్యకన్న తనకే విలువెక్కువ అనితెలీటం లేదూ?

"ఏమిటి ఆలోచనలో పడ్డావ్?" నవ్వుతూ అన్నాడు వర్ధనరావు ఆమె చేతిని తనచేతుల్లోకి తీసుకొని మృదు వుగా నిమురుతూ.

"ఏ...మీ..లేదు..." ఆలోచనల్లో నుంచి తేరుకొంటూ అంది సీత.

"మాధవరావుతో నేను మాట్లాడ తాన్లే! ఇంతకంటే తెలివిగల వాళ్ళనీ, మోసగాళ్ళనీ మంచి మాటలతో పడగొట్ట గలను. అతనితో ఎలాగయినా సరే మా ఆఫీసులో ఉద్యోగం చేయించే పూచీ నాది."

సీత తలూపింది "మీ ఇష్టం! ప్రయ త్నించండి!"

వర్ధనరావు లేచి పక్కగదిలో ఉన్న మాధవరావు దగ్గరకు నడిచాడు.

"ఏమిటి-ఉద్యోగం మానేశారటగా?" అన్నాడు అతని దగ్గరే కూర్చుంటూ.

"అవునండీ! అక్కడ ఇంక 'చేయా లనిపించలేదు"·

"వెరీ గుడ్! మంచి సమయంలో మానేశారు. నా కిప్పుడు అత్యవసరంగా ప్రొడక్షన్ మేనేజరుగా ఓ మనిషికావాలి! అది చాలా కీలకమయిన ఉద్యోగం. 'నా వా డు' అన్న మనిషిని నియమిస్తే గాని లాభంలేదు. లేకపోతే చాలా ఫ్రాడ్ జరిగే అవకాశ ముంటుంది. మీరు రేప ట్నుంచే ఆ ఉద్యోగంలో చేరండి! మీ లాంటి వారుంటే నా కే భ యమూ ఉండదు"

మాధవరావు ఇబ్బందిగా సీతవేపు చూశాడు.

"పోనీ – ఆయనంతగా ప్రా ధే య పడుతున్నారుగా! ఊఁఅనండి" నవ్వు తెచ్చిపెట్టుకొంటూ అంది సీత. అలా అంటూంటే ఆమె మనసంతా కెలికినట్లని పిస్తోంది.

"కానీ...నేను కొద్దిరోజుల వరకూ... ఏ ఉద్యోగమూ చేయకూడ దను కొన్నాను" అశాంతితో అ న్నా డు మాధవరావు.

"అలా అనకండి! కావాలంటే పోనీ నాకు మరో నమ్మకమయిన మనిషి దొరికే వరకయినా మీరు చేయండి!" తిరిగి అన్నాడు వర్ధనరావు.

మాధవరావుకి గత్యంతరం లేక పోయింది.

"సరే – మీ ఇష్టం!" అన్నాడు అయిష్టంగానే.

"వచ్చేవారమే మన యూనిట్ అవుట్డోర్ షూటింగుకి బయల్దేరుతోంది. మీరూ ప్రయాణమవండి! సీతగారూ!మీరుకూడా రారాదూ! మీకు అక్కడ అన్ని ఏర్పాట్లూ చేసే బాధ్యతనాది" గర్వంగా సీతవేపు చూస్తూ అన్నాడు వర్ధనరావ్.

తలూపింది సీత.

వారం రోజుల్లో ఆ యూనిట్ అంతా మద్రాస్‌కి దగ్గరున్న లొకేషన్‌కి బయల్దేరింది.

మాధవరావు, సీత, వర్ధనరావు మద్రాస్‌లోని ఓ ఖరీదయిన హోటల్లో మకాం పెట్టారు.

ఉదయమే అందరూ మినీబస్‌లో లొకేషన్‌కు వెళ్ళడం, సాయంత్రం వరకూ షూటింగ్ జరుపుకొని తిరిగి మద్రాస్ రావడం – ఇదే కార్యక్రమం!

కావాలనే మాధవరావు మీద అన్ని బాధ్యతలూ పడవేశాడు వర్ధనరావు. దాంతో మాధవరావుకి పని ఎక్కువయి పోయింది. రాత్రి పన్నెండింటి వరకూ కూడా క్షణం తీరిక దొరకటం లేద తనికి! అతను లొకేషన్ కెళ్ళిన సమయాల్లో సీతతో గడుపుతున్నాడు వర్ధనరావు.

లోలోపల సీతకు అశాంతిగానే ఉంది. మనసంతా బాధతో గిలగిల లాడుతోంది. వర్ధనరావుకి తనెలాగూ లొంగిపోయింది. కానీ తనభర్త కూడా అతని దగ్గర ఓ నౌకరులా ఎందుకు పని చేయాలి. ఒకటి రెండుసార్లు తనెదురుగ్గానే మాధవరావుని అతను చివాట్లు పెట్టటం గమనించిందామె. అప్పటినుంచీ మరింత వ్యాకులపాటు చెందసాగింది. అనుక్షణం అదే ఆలోచన అయిపోయింది. తనను అంత ప్రేమగా చూసుకొంటున్న మాధవరావుకి తనెలాగూ అన్యాయం చేసింది. అదిచాలనట్లు వర్ధనరావు కూడా అతనినో నౌకరులా ట్రీట్ చేయడం ఆమె గుండెల్ని పిండేస్తోంది.

ఓ రోజు మాధవరావుతో పాటు సీత




కూడా లొకేషన్‌కు బయల్దేరింది. అక్కడి పరిస్థితులు చూసేసరికి ఆమె మనసు ఉక్కిరి బిక్కిరయి పోయింది. మాధవరావు ఎంత నికృష్ట పరిస్థితుల్లో ఇరుక్కొంది తెలిసి పోయిందామెకి. అతనితో పాటు పని చేసే యూనిట్ అంతా అతని గురించి హేళనగా మాట్లాడుకోవడం, అతనితో ద్వంద్వార్థాలతో సంభాషించడం, అతను చూడకుండా కలసి నవ్వుకోడం – అన్నీ గమనించిందామె.

ఆమె కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగాయి.

ఆ మాటలు మాధవరావు చెవిన పడకుండా ఉంటాయా? ఆయనకి తన మీదా, వర్ధనరావు మీదా అనుమానం కలగకుండా ఉంటుందా? అసలు ఆయన అలాంటి అవమానాలనూ, అవహేళనలనూ ఎలా సహించ గలుగుతున్నాడు? వాటి మధ్య ఆ ఉద్యోగం ఎలా చేయ గలుగు తున్నాడు.

హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చిందామెకి.

'ఒకవేళ ఆ కంపెనీ ఉద్యోగం కూడా ఇలాంటి పరిస్థితుల వల్లే మానేశాడా?' గుండె ఝల్లు మన్నదామెకి.

ఆదే నిజమయితే ఆయన తన మీద ఇంకా ఆంక్షలు ఎందుకు విధించ లేదు. తననీ, వర్ధనరావునీ ఎప్పటి లాగానే ఎందుకు మసలనిస్తున్నాడు? ఒకవేళ తమని కని పెడుతున్నాడా? తమకు తెలీకుండా తమని అబ్జర్వ్ చేస్తున్నాడా?

ఆమె శరీరమంతా భయం ఓ కెరటంలా ప్రవహించింది.

మాధవరావు నెత్తి మీద టోపీ సర్దుకొంటూ ఆమె దగ్గర కొచ్చాడు.

"ఎండ చాలా ఎక్కువగా ఉంది – నీకు బోర్ కొట్టడం లేదూ?" అడిగాడు నవ్వుతూ.

సీత అతి కష్టం మీద చిరునవ్వు పెదాల మీదకు తెచ్చుకొంది.

"హోటల్ కెళ్ళిపో సీతా! ఇక్కడ ఇంకాసేపాగితే విసుగు పుట్టుకొస్తుంది నీకు! వెళ్ళి మన పాపతో ఆడుకుంటూ కూర్చో!"

"సరే" నెమ్మదిగా అంది సీత.

ఆయనకి పాపంటే ఎంత ఇష్టమో తనకు తెలుసు. తనకున్న ఇతర వ్యాపకాల వల్ల పాపని తను నిర్లక్ష్యం చేస్తోంది. అందుకే తల్లిగా తనివ్వలేని ప్రేమని మాధవరావు ఇవ్వడానికి ప్రయత్నం చేస్తూ వచ్చాడు. అనుక్షణం పాపనే అంటిపెట్టుకొని కూర్చోడం ఆయనకి అలవాటయి పోయింది. పాపకీ, తనకీ మధ్య తల్లీ – పిల్లల మధ్య ఉండే ప్రేమానురాగాలు నశించి పోతున్నాయని ఆయన ఆవేదన. అందుకే వీలు దొరికినప్పుడల్లా తనను కూడా పిలిచి పాప దగ్గర కూర్చోబెట్టి ఆటలాడిస్తుంటాడు.

సరిగ్గా అప్పుడే వర్ధనరావు వచ్చాడక్కడికి.

"నేను హోటల్ కెళ్తున్నాను. నువ్వు కూడా వస్తావా సీతా!" అడిగాడతను.

"ఊఁ!" అంది సీత లేచి నిలబడుతూ.

అక్కడున్న వారందరి కళ్ళూ తామిద్దరి మీదే కేంద్రీకరింపబడి ఉండటం గమనించి కృంగి పోయింది సీత.

ఇద్దరూ అతని కారు దగ్గరికి నడిచారు. ఫ్రంట్ సీట్లో అతని పక్కనే కూర్చుంది సీత.

కారు వేగంగా మద్రాస్ వేపు పరుగెత్తసాగింది.

అదివరకు కార్లో ప్రయాణమంటే ఎంతో ఆనందంగా ఉండేది తనకు. ఎంతో సంతోషం అనుభవించేది. కానీ ఇప్పుడు కారుని చూస్తేనే అశాంతిగా ఉంది.

"ఏమంటున్నాడు మాధవరావు ?" నవ్వుతూ అడిగాడు వర్ధనరావు.

సీత మాట్లాడలేదు. భర్త విషయం-ఏదయినాసరే వర్ధనరావు దగ్గర చర్చించడం ఆమెకేమాత్రం ఇష్టం లేదు.

"అన్నట్లు - నీ కారు మరో రెండు రోజుల్లో వస్తుందట. నిన్న ఆ డీలర్ కనిపించి చెప్పాడు"

సీతకు గుర్తుకొచ్చింది. అంతకు ముందు మద్రాస్ వచ్చినప్పుడు తన కోసం కారు కొంటానని చెప్పాడు వర్ధనరావు. కానీ తమకు కావలసిన మోడల్ లేనందువల్ల కొద్ది రోజులు ఆగాల్సి వచ్చింది. ఇప్పుడు ఆ కారు మీద మనసు లేదామెకి. తనకు కారు వద్దనీ, ఆ ఆర్డరు కాన్సిల్ చేయమనీ చెప్దామనుకొందామె. కానీ పైకి మాట్లాడ లేక పోయింది.

హోటల్ చేరుకొన్నారిద్దరూ.

తన గదిలోకి చేరుకొని మంచం మీద వాలిపోయింది సీత. పాప మర బొమ్మలతో ఆడుకొంటోంది. పనిపిల్ల సీతను చూడగానే పాపను పక్కగదిలోకి తీసుకెళ్ళింది.

"సీతా!" తలుపు తట్టాడు వర్ధనరావు.

తలుపు తెరిచింది సీత.

"నా గదిలో కూర్చుందాం రాకూడదూ?"

మారు మాట్లాడకుండా అతని వెంబడి నడిచిందామె. ఆమె లోపలకు రాగానే లోపల్నుంచీ తలుపుకి తాళంవేసి ఆమె భుజంమీద చేయివేసి సోఫాలో తన పక్కనే కూర్చొబెట్టు కొన్నాడతను.

"ఎందుకు ఇవాళ అదోలాఉన్నావ్?" అడిగాడు నవ్వుతూ.

"ఏమీలేదు" నవ్వడానికి ప్రయత్నిస్తూ అంది సీత.

"సరే నీ డల్‌నెస్ నేను పోగొడతాలే" ఆమెను తన కౌగిట్లోకి లాక్కొంటూ అన్నాడతను. సీత ప్రాణంలేనిదాన్లా అతని మీదకు ఒరిగి పోయింది.

అప్పుడే తలుపు తట్టిన చప్పుడయింది.

ఆమెను వదలి లేచినిలబడ్డాడతను. సీత బట్టలు సర్దుకొని మాగజైన్ చేతుల్లోకి తీసుకొని చూడసాగింది.

తలుపు తెరచాడు వర్ధనరావు.

"హలో! మీరా, రండి, రండి" బయట నిలబడ్డ ఓ అందమయిన యువతినీ, మరో వయసు మళ్ళిన స్త్రీనీ గదిలోకి ఆహ్వానిస్తూ అన్నాడతను.

వాళ్ళిద్దరూ గదిలోకొచ్చి సీత కెదురుగ్గా ఉన్న కుర్చీల్లో కూర్చున్నారు.

"ఈమె సీత! మా సినిమా రచయిత్రి! ఈవిడ పేరు కళ! సినిమాల్లో నటించే అవకాశం కోసం ప్రయత్నిస్తున్నారు. వీరు కళ తల్లి" వాళ్ళిద్దరినీ సీతకు పరిచయం చేశాడతను.

వాళ్ళిద్దరినీ పరీక్షగా చూసింది సీత. కళ మొఖం కళగానే ఉంది. అందం కన్నా అలంకరణ ఎక్కువగా ఉంది. అయితే వాళ్ళేమంత ధనవంతులు కాదని తల్లి దుస్తులు చెబుతున్నాయి.

"మీకు నాటకాల్లో కొంచెం అనుభవం ఉందన్నారు కదూ?" అడిగాడు వర్ధనరావు.

"అవునండీ" సిగ్గుపడుతూ అందామె.

"ఓ పని చేద్దాం! ఇవాళ మీకు స్క్రీన్ టెస్ట్ చేయిస్తాను. అన్నీ నచ్చితే ఇప్పుడు మొదలవుతున్న చిత్రంలోనే ఓ చిన్న పాత్ర వుంది. కొంచెం ముఖ్యమయిన పాత్రేలే అది. అది తీసుకొందురు గాని."

ఆమె ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిపోయింది.

"చాలా థాంక్సండీ!" మిలమిల లాడే కళ్ళతో అంది.

"మనం ఇప్పుడే వెళ్ళివద్దాం రండి! మీ మదర్ ఇక్కడే ఉంటారు" అన్నాడు వర్ధనరావు లేచి నిలబడుతూ.

"నేను ఇంటికెళ్తానులెండి! మీరూ అమ్మాయీ వెళ్ళిరండి..." తనూ లేచి నిలబడుతూ అందామె.

"సీతా, నేను స్టూడియోకెళ్ళొస్తాను" ఆమెతో చెప్పి బయటకు నడిచాడతను. సీత తన గదిలోకి వచ్చేసింది. కిటికీ దగ్గరకెళ్ళి హోటల్ ఆవరణలో కింద పార్క్‌చేసి వున్న కార్లవంక చూడసాగింది.

వర్ధనరావు, కళా రావడం - ఆమెను ఫ్రంట్‌సీట్లో కూర్చో బెట్టటం, తనూ ఆమె పక్కన కూర్చుని కారు నడుపు కెళ్ళడం కనబడుతూనే ఉందామెకి.

చాలాసేపు అలాగే కిటికీ దగ్గర నిలబడిపోయింది సీత.

కళ తనకన్నా అందమయిన

అమ్మాయి.

తనలాగానే అట్టడుగునుంచి పైకి రావాలని ప్రయత్నిస్తున్న అమ్మాయిలా ఉంది. అందుకు భగవంతుడు తనకిచ్చిన అందాన్ని సద్వినియోగం చేసుకోవాలనుకొంటోంది. అందులో తప్పేముందీ ?

ఎవరి ప్రతిభను వారు ఉపయోగించుకోవాల్సిందే.

తను రచనలు చేయగలదు. ఆ వరాన్ని ఉపయోగించుకొని నిచ్చెన లెక్కలేదూ? నిజంగా తను కేవలం రచనలవల్లే ఈనాడు ఈ స్థితి కెదిగిందా ?

మనసంతా కలచివేసినట్లయిందామెకి. ఆ ముసుగు వేసుకొని తను నీతిని అమ్ముకుంది. అందుకే తనకీ స్థితి.

మరి కళకు అందం ఉంది.ఆఅందాన్ని ఉపయోగించుకోడానికి సినిమాలు చక్కటి సాధనం. కానీ ఆ ముసుగులో నీతిని అమ్ముకోందే ఆమె పైకిరాగలదా? తన అభీష్టాన్ని నెరవేర్చుకోగలదా ?

అందాన్ని ఆరాధించే వర్ధనరావుని ఆమె ఆకర్షించదని నమ్మకం ఏమిటి? ఆకసానికెగిరాలన్న ఆరాటంలో ఆమె కూడా తనలాగానే అతనికి లొంగిపోదన్న గ్యారంటీ ఏముంది ?

అసహనంగా అటూ ఇటూ పచార్లు చేయసాగిందామె.

ఎందుకో ఆ ఆలోచన నచ్చటంలేదు ఆమెకి.

వర్ధనరావుకి తనూ, కళా ఒకటేనా? ఇద్దరికీ తేడా ఏమీ లేదా ? ఒకవేళ అతనికి అలాంటి ఉద్దేశం లేదేమో? తనే లేనిపోనివి ఊహించుకొంటోందేమో ! అయినా తనకెందుకు. అవన్నీ వర్ధనరావు స్వవిషయాలు. అతనిదగ్గర డబ్బుంది. తనలాంటి గొంతెమ్మ కోర్కెలు కోరే అమ్మాయిలను అమాంతం పైకి లేవదీయగల స్తోమతుంది. తాము కోరుకొంటున్న ఊహాసౌధాల్ని నిజం సౌధాలుగా మార్చగల ప్రజ్ఞ ఉంది. తమకి సహాయం చేస్తూనే తమని అతని స్వలాభంకోసం ఉపయోగించుకోగల నేర్పు ఉంది.

సాయంత్రంవరకూ గదిలోనే వర్ధనరావు కోసం ఎదుర్చూస్తూ అసహనంగా గడిపిందామె.

అతని జాడ ఎంతకూ కనిపించక పోయేసరికి ఆమె అనుమానాలు ధృవపడసాగాయి.



## 16

రాత్రి తొమ్మిది దాటాక మాధవరావు వచ్చాడు

"సీతా నువ్వు భోజనం చేయలేదటగా" ఆమె వంక ఆప్యాయంగా చూస్తూ అన్నాడతను.

"ఆకలిగా లేదు" నవ్వు తెచ్చుకొంటూ అందామె.

"అయినా కొంచెం ఎంగిలి పడకపోతే మరీ నీరసించిపోతావ్. పద' ఇద్దరం భోజనం చేద్దాం" ఆమెను భుజాలు పట్టుకొని లేపుతూ అన్నాడతను.

ఇద్దరూ సోఫాలో కూర్చుని, ప్లేట్లలో హోటలు వాడుంచిన భోజనం అయిందనిపించి లేచారు.

"మీకు ఈ ఉద్యోగం నచ్చిందా?" అడిగింది సీత.

అతను నవ్వాడు.

"మనిషికి నచ్చే ఉద్యోగాలు దొరకడం అనేది చాలా తక్కువ సందర్భాల్లో జరుగుతుంది!"

"అంటే.....మీకు అయిష్టంగానే ఉందన్నమాట. అంతేనా?"

"చేరి కొద్దిరోజులేగా అయింది. ఇప్పుడే మనం దాన్ని గురించి ఆలోచించడం ఎందుకూ?"

సీతకేం చెప్పాలో తెలీలేదు.

అతని నెలాగయినా ఆ ఉద్యోగం మానిపించాలని ఆలోచిస్తోందామె. తన కళ్ళెదురుగ్గా ఆయన ఎదుర్కొంటున్న అవహేళనలనూ, అవమానాలనూ చూడటం తనవల్ల కాదు. అయినా అతనంటే అందరికీ ఎందుకంత హేళనగా ఉంది?

తనకూ, వర్ధనరావుకీ సంబంధం ఉంది! నిజమే. ఆ విషయంలో తప్పు తనది. కానిపని చేసింది తను. అవినీతికి పాల్పడింది తను. తను చేసిన తప్పుకి అవమానాలు ఆయనెందుకు సహించాలి? అతన్నెందుకు హింసిస్తారందరూ? ఆయన ఏం చేశాడని? తనలాంటి స్త్రీకి భర్తగా ఉండటమే ఆయన చేసిన పాపమా? ఇదెక్కడి న్యాయం? తప్పు ఒకరిదీ, శిక్ష మరొకరిదీనా?

కళ్ళ వెంబడి నీళ్ళు తిరుగుతున్నాయి సీతకి. చాలాసేపు నిద్ర పట్టలేదామెకి. మాధవరావు పాపదగ్గర పడుకొన్నాడు. మర్నాడు ఉదయం మాధవరావు వెళ్ళిపోయాకగానీ సీతకు మెలకువ రాలేదు. ఆమె కాఫీ తాగుతూండగా వర్ధనరావు వచ్చాడక్కడికి.

"సారీ! నిన్నంతా ఆ కళతోనే తీరిక లేకుండాపోయింది. ఆ అమ్మాయిని మన సినిమాలోకి బుక్ చేసేశాను. చాలా ఫొటోజెనిక్‌గా వుంది ఫేస్. కెమేరాలో ఆమె అందం రెట్టింపు అవుతుందనుకో! కొంచెం నటన నేర్చుకోవాలి అంతే. అది కూడా చాలా తేలికగానే పికప్ చేస్తోంది" ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడతను.

"ఇవాళంతా లొకేషన్‌లోనే ఉండాలి నేను. రేపెలాగూ షూటింగు లేదు. రేపే మనవాళ్ళది శతదినోత్సవ సభ ఒకటి వుంది. దానికి మనిద్దరం వెళ్దాం. కారు ఇక్కడే ఉంచుతున్నాను. కావాలంటే ఊరంతా తిరుగు సర్దాగా! నేను వెళ్ళిరానా మరి?"

అయోమయంగా తలూపింది సీత.

అతను వెళ్ళిపోయాడు.

'కళ అదృష్టం పండింది'. నవ్వుకొంది సీత.

మధ్యాహ్నం భోజనం చేశాక కార్లో బీచికెళ్ళింది సీత. చాలాసేపు సముద్రం వంక చూస్తూ ఇసుకలో కూర్చుండిపోయింది.

సాయంత్రమవుతూండగా తిరిగి ఇంటికి చేరుకొందామె.

మర్నాడు వర్ధనరావుతోపాటు శతదినోత్సవ సభకి వెళ్ళడానికి తయారయిందామె.

మాధవరావు పాపతో ఆడుకొంటున్నాడు.

"మీరుకూడా రాకూడదూ?" అడిగింది సీత.

"నేనెందుకూ?" అయిష్టంగా

అన్నాడతను. ఈ లోగా వర్ధనరావు వచ్చేశాడక్కడికి.

"మాధవరావుగారూ! మీరుకూడా రండి!" మాటవరసకన్నాడతను.

"రండి! ప్లీజ్" బతిమాలుతున్న ధోరణిలో అంది సీత.

తనూ రెడీ అయాడు మాధవరావు.

వర్ధనరావు కార్లో కూర్చుని ఫ్రంట్ డోర్ తెరిచాడు సీతకోసం. సీత ఖంగారు పడింది. భర్త పక్కనుండగా తను అతని పక్కనెలా కూర్చుంటుంది? ఈ మాత్రం తెలీకపోతే ఎలా అతనికి.

"మేమిద్దరం వెనుక కూర్చుంటాం!" అంది గుండెలు వేగంగా కొట్టుకొంటూ వుండగా.

"మాధవరావు మినీ బస్‌లో వస్తాడు లెండి. మనకి త్రోవలో వేరే చోట్లకు వెళ్ళాల్సిన పనికూడా ఉంది" విసుగ్గా అన్నాడతను.

"సరే!"

మాధవరావు గిరుక్కున వెనక్కు తిరిగి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

సీతకు కోపం ముంచుకొచ్చింది. అక్కడేమీ మాట్లాడలేక కారెక్కి అతని పక్కన కూర్చుండిపోయింది.

కొద్దిదూరం వెళ్ళాక ఆమె భుజం మీద చేయివేసి నొక్కుతూ "మాధవరావుని మనతో రావద్దన్నానని కోపం వచ్చిందికదూ?" నవ్వుతూ అడిగాడు వర్ధనరావు.

"అవును" కోపం అణచుకొంటూ అందామె.

"అబ్బ! ఆ మాత్రానికే ఇంత కోపమా?" గట్టిగా నవ్వేశాడతను.

"ఆయన్ని అలా అవమానపర్చడం నాకు నచ్చలేదు" అతనివంక చూడకుండానే అంది సీత.

అతను సిగరెట్ వెలిగించుకొని అన్నాడు.

"ఇందులో నీకు కోపం రావాల్సిన పనిలేదు సీతా! అతను నా ఆఫీసులో పని చేస్తున్నాడు. యజమానికీ, ఉద్యోగస్తునికీ ఎప్పుడూ కొంత దూరం ఉండాలి. లేకపోతే అది ఓ విధమయిన ఇబ్బందిని తెచ్చిపెడుతుంది. అతనూ నాతోపాటు ఇదే కార్లో ప్రయాణం చేస్తే అతనికి తెలీకుండానే నేనంటే ఓ విధమయిన లోకువ ఏర్పడుతుంది. నా ఉద్దేశం ఏమిటంటే యజమాని యజమానిలాగానే ఉండాలి. గుమాస్తా గుమాస్తాగానే వుండాలి!"

సీత ఏమీ మాట్లాడలేదు.

ఏమ్మాట్లాడాలో కూడా తెలీలేదు ఆమెకి. మాధవరావు అతన్ని బతిమాలి ఈ ఉద్యోగం చేయటంలేదు. అసలతనికి ఉద్యోగం చేయాల్సిన అవసరమే లేదు ప్రస్తుతానికి. తనకు అంత డబ్బుంది బాంకులో ఇప్పుడు. అదీగాక అతను ఉద్యోగంలేకకాదు ఇక్కడ పనిచేస్తోంది. కేవలం తనకు దగ్గరగా ఉండవచ్చనే అభిప్రాయంతోనే అందుకు ఒప్పుకొన్నాడు. అదీ వర్ధనరావు కూడా అభ్యర్థించబట్టి!

"యజమాని యజమానిలాగానే ఉండాలి. గుమాస్తా గుమాస్తాలాగానే" అన్న వర్ధనరావు మాటలు ఆమెకు అశాంతిని కలుగజేస్తున్నాయి.

కారు ఓ పెద్ద ఆవరణలో ఆగింది.

ఎవరో వచ్చి వారిద్దరకూ నమస్కరించి లోపలకు ఆహ్వానించారు.

ముందు వరుసలో వారి కోసం ఏర్పాటయినసీట్లలో పక్కపక్కనే కూర్చున్నారిద్దరూ. సినీ ప్రముఖులంతా ఒక్కరొక్కరే చేరుకొంటున్నా రక్కడికి. అందరూ కలుసుకొని నవ్వుకొంటూ మాట్లాడుతున్నారు. ఒకరినొకరు ఆదరంతో పలుకరించుకొంటున్నారు.

స్టేజిమీదకు నటీనటులంతా వచ్చేశారు. చాలా సందడిగా ఉందక్కడ. వర్ధనరావు సీతతో తమ తరువాతి చిత్రం గురించి మాట్లాడుతున్నాడు. కళను హీరోయిన్‌గా పెట్టి సినిమా తియ్యాలనుందట. అంచేత హీరోయిన్ ప్రాముఖ్యత ఉన్న కథ రాయాలట తను.

అన్నిటికీ "ఊ" కొడుతోంది సీత.

వర్ధనరావు కారు డ్రైవరు హడావుడిగా వచ్చాడక్కడికి.

"సార్!"

"ఏమిటి ?"

"అమ్మగారొచ్చారు. బయట కార్లో ఉన్నారు"

"అదేమిటి రేపటిగ్గాని మద్రాస్ చేరుకోమన్నారుగా ?"

"ఏమోసార్"

"ఇప్పుడే వస్తాను సీతా" బయటకు నడిచాడతను. అయిదు నిమిషాల తర్వాత డ్రైవరు మళ్ళీ పరుగుతో వచ్చాడు సీత దగ్గరకు.

"అమ్మా! మీరు ఆ వెనుక ఉన్న సీట్లల్లో కూర్చోండి! అయ్యగారూ, అమ్మగారూ ఇక్కడ కూర్చుంటారట" నెమ్మదిగా చెప్పాడతను.

సీత మొఖం పాలిపోయింది. అవమానంతో కుంచించుకు పోయింది.

ఆ క్షణంలో ఆ చుట్టు పక్కవాళ్ళందరి దృష్టీ తన మీదే కేంద్రీకరింపబడి ఉండటం గమనించిందామె.

అది మరింత బిడియాన్ని కలుగజేసింది.

'అవును! ఈ స్థానం ఎప్పుడూ అతని భార్యదే! తనెలా కూర్చోగలదు ఇక్కడ ?'

ఆమె అతని భార్య!

తను అతనికేమవుతుంది?

ఉంపుడుకత్తె?

ఛీ! అదేమిటి ?

కాక ఇంకేముందీ? అంతకంటే మంచి పదం ఇంకేమయినా ఉందా ?

ఆమె అతని ఇల్లాలు కాబట్టే ఆమెకా గౌరవం!

తను అతని ఉంపుడుకత్తె కాబట్టే తనకీ గౌరవం!

తనస్థానం తన భర్త పక్కనుంది. అలాంటి ఉన్నతమయిన స్థానాన్ని, గౌరవమయిన స్థానాన్ని కాదని ఇలాంటి అవమానాలు, అవహేళనలు ఎదురయ్యే చోటుకోసం పాకులాడింది. గేట్లోంచి వర్ధనరావు, అతని భార్యా, పిల్లలూ లోపలకొస్తూ కనిపించారు. ఒక పాపాయిని ఆమె నడిపించుకొస్తోంది. మరో బాబుని అతను ఎత్తుకొన్నాడు. భార్యతో ఏదో నవ్వుతూ చెప్తున్నాడు వర్ధనరావు.

అది అతని కుటుంబం. తన కుటుంబమంటే అతనికెంత ఇష్టమో, ఎంత ప్రాణమో సులభంగా తెలిసిపోతోంది.

అతనికెన్ని వ్యాపకాలున్నా, ఎన్ని, అడ్డంకులున్నా అవన్నీ అతని భార్యా పిల్లలకూ, అతనికీ మధ్య ఉన్న అనురాగాన్ని తగ్గించటం ఆతను సహించాడు. ఎన్నోసార్లు గమనించింది తనీ విషయం.

అవుట్డోర్ షూటింగ్‌లో ఉన్నా రెండు మూడురోజులకోసారయినా ఇంటికెళ్ళి ఓ రోజు ఆనందంగా గడిపిరావడం, లేదా వారినే తనున్న చోటుకి తీసుకురావడం, ప్రతిరోజూ కొద్దిసేపయినా ఫోన్లో మాట్లాడడం-

తన కుటుంబం విషయం వచ్చేసరికి అతను ఏ మాత్రం రాజీ పడడు. మరి తను ?

అతని మాయలోపడి, సినిమా ప్రపంచంలో మునిగిపోయి, భర్తను నిర్లక్ష్యం చేసింది. తన పాపను పెంచడానికి ఓ పని పిల్లను ఏర్పాటుచేసి అసలు పాప సంగతి పట్టించుకోడమే మానేసింది.

తనకో ఇల్లు ఉందన్న విషయమే మర్చిపోయినట్లు ప్రవర్తించింది. సీత ఆలోచనలో ఉండగానే వర్ధనరావు, అతని భార్యా దగ్గరగా వచ్చేశారు.

వర్ధనరావు తనవంక చూస్తున్నాడు. తన స్థానంలోనుంచి ఇంకా ఎందుకు లేవలేదా అన్న చిరాకు అతని కళ్ళల్లో కనబడుతోంది.

చటుక్కున అక్కడి నుంచి లేచి నెమ్మదిగా బయటకు నడిచింది సీత.

రోడ్డు మీదకొచ్చి ఖాళీగా పోతున్న ఓ టాక్సీని పిలిచి లోపల కూర్చుంది. కొద్ది నిమిషాల్లో హోటల్ ముందాగింది టాక్సీ.

"ఇక్కడే వుండు ! మళ్ళీ వెళ్ళాలి మనం..." టాక్సీవాడితో చెప్పి లిఫ్ట్‌లో నిలబడింది. లిఫ్ట్ పైకిపోతోంటే అసహనంగా చూస్తోందామె.

ఇంత ఆలస్యమా! ఆరు అంతస్తులు దాటడానికి ?



# 17

వెళ్ళేసరికి తమ గది తలుపులు తెరచే ఉన్నాయి. మాధవరావు గది మధ్యలో చేతులమీద పాకుతున్నాడు. పాప అతని వీపు మీద కూర్చుని స్వారీ చేస్తోంది.

"చల్ చల్ గుర్రం - చలాకి గుర్రం-"

సీతను చూసి ఆశ్చర్యపోయాడతను.

ఆ దృశ్యం సీత చూడలేక పోతోంది. కళ్ళ వెంబడి ఉప్పెన విరుచుకు పడేలా ఉంది.

తన భర్త —

తనను అమితంగా ప్రేమించే భర్త-

తను నిజంగా కాలు జారినా ఆ విషయం తనే చెప్పినా నవ్వి ఊరుకునేటంత ధృఢమయిన నమ్మకంగల మహోన్నతుడతను-తనకేం తక్కువని?

తనను కంటికి రెప్పలా చూసుకొనే భర్త —

నవ్వుతూ తుళ్ళుతూ గడిపే సంసారం—

ఇల్లూ—

పాపా—

అన్నీ ఉన్నాయి—

తిండికీ, కట్టుకొనే బట్టకూ లోపం లేదు. అయినాగాని అత్యాశలకు పోయి, అవినీతికి పాల్పడింది తను.

తనకంటే పాపిష్ఠి స్త్రీ మరెవరేనా ఉంటారా ?

"పచ్చేశావేం?" ఆశ్చర్యంగా అడిగాడతను.

ఏం చెప్పాలో తెలీలేదు సీతకు.

"పదండి! మనం త్వరగా హైదరాబాద్ వెళ్ళిపోదాం! బయట టాక్సీ ఉంది" బట్టలు హడావుడిగా సర్దుతూ అందామె.

"అదేమిటి?"

ప్రవాహంలా కారిపోతున్న కన్నీటిని తన పైట చెంగుతో తుడిచేసుకొంటూ "దయచేసి నన్నేమీ ప్రశ్నించకండి! మీరు త్వరగా తయారవండి!" అందామె.

మాధవరావు నెమ్మదిగా లేచినుంచుని ఆమెకు దగ్గరగా వచ్చాడు.

"సీతా ఏం జరిగింది ? ఎవరేమన్నా అన్నారా?" ఆమెని దగ్గరకు లాక్కుంటూ అడిగాడు.

ఇంక దుఃఖాన్ని ఆపుకోవడం ఆమెకు సాధ్యం కాలేదు. అతని గుండెల మీదకు ఒరిగిపోయి వెక్కి వెక్కి ఏడ్చేయసాగింది ఆమె.

"ఎవరూ ఏమీ అనలేదండీ! నా కళ్ళు ఇప్పుడే తెరచుకొన్నాయి! నేను చేసిన పాపాలన్నీ నన్ను పరిహసిస్తున్నాయి. ఇంకొక్కక్షణం కూడా ఇక్కడ వుండొద్దండీ! నాకింక ఈ సినిమాలూ, మేడలూ, కార్లూ – ఇవేమీవద్దు! మీరే పాడు ఉద్యోగమూ చేయవద్దు. మనం మొదట్లో ఉన్న చిన్న ఇల్లు లాంటిది చూసుకొని వెంటనే ఆ మేడలోనుంచి మారిపోదాం! మన మధ్య ఉన్న అనాటి అనుబంధం, అనురాగం నేను మళ్ళీ పండించుకోవాలి. ఇన్ని రోజులుగా దూరం చేసుకొన్న నా స్థానాన్ని నేను మళ్ళీ పొందాలని ఉంది !"

పిచ్చిదానిలా మాట్లాడేస్తోన్న సీతను చూసి చలించిపోయాడు మాధవరావు.

"సీతా ! నాక్కావలసింది నీ ఆనందం! అంతే! నీ ఆనందం కోసమే నువ్వు చెప్పినట్లల్లా చేశాను. ఇకముందు కూడా చేస్తాను ..." ఆమెను మరింత గాఢంగా తను గుండెలకు హత్తుకొంటూ అన్నాడు మాధవరావు.

కొద్ది నిమిషాల తర్వాత అతను సామానంతా సర్ది హోటల్ బోయ్‌తో టాక్సీలోకి చేర్పించాడు. అతని వెనుకే తనూ పాపనెత్తుకొని బయటకు నడిచిందామె. అలా అతని పక్కన నడుస్తోంటే ఆనందం, దుఃఖం పొంగుకొస్తున్నాయామెకి. ఇదే! తను కోరుకొంటోందీ ఆనందమే! ఇంకేమీ కోరికల్లేవీ జీవితానికిక !

గతం అంతా ఓ పీడకల!

మేడలూ, కార్లూ, సినిమాలూ, వర్ధనరావూ– అన్నీ పీడకలలో భాగాలే! ఆ కలని తను మర్చిపోతుంది. మరోసారి గుర్తుకి రానంతంగా మర్చి పోతుంది. జాగ్రత్త పడుతుంది.

మరి తన కంటిన కళంకం మాటేమిటి ?

ఉక్కిరిబిక్కిరయిందామె.

ఏం చేస్తుంది తను! తను తప్పు చేసిన మాట నిజమే! అలా అని తెలుసుకొన్న మాట నిజమే ! కాని ఆ తప్పు చెరిపేసుకోడానికి తనేం చేయగలదు ?

పశ్చాత్తాపం అన్ని పాపాలకూ పరిహార మంటారుగా! తన మనసు పశ్చాత్తాపంతో కాగిపోతోంది! తన పాపాలు ఆ అగ్నిలో దహింపబడకుండా ఉంటాయా ?

టాక్సీ సెంట్రల్ స్టేషన్ దగ్గర ఆగింది.

"దిగు సీతా!" టాక్సీ డోర్ తెరుస్తూ అన్నాడు మాధవరావు.

దిగి నిలబడిందామె.

"పద" సామాన్లు కూలీకిచ్చి ఆమె వీపు మీద చేయివేస్తూ అన్నాడతను.

అతనితో పాటు స్టేషన్లోకి నడిచిందామె.

ప్లాట్ఫారమంతా రద్దీగా ఉంది. ప్లాట్ఫారం మీదకు రావల్సిన రైలు కోసం ఎదురు చూస్తున్నారందరూ.

పాప నవ్వుతోంది. దూరంగా నిలబడ్డ మరోపాపను చూసి పిలుస్తోంది.

సీత ఆలోచనల్లో నుంచి బయట పడలేక పోతోంది.

మాధవరావు ఆమెతో ఏదో నవ్వుతూ చెప్తున్నాడు. సీతకతను చెప్పేదేమీ వినిపించటం లేదు.

ఆమె మనసంతా మొద్దుబారి పోయింది.

ఎంత త్వరగా హైదరాబాద్ చేరుకొందామా, ఎంత త్వరగా వర్ధనరావు మేడ ఖాళీచేసి ఓ మారుమూల ఉండే చిన్న ఇంటికి చేరుకొందామా అనే ఉందామెకి.

మధ్య మధ్యలో అనాలోచితంగా మాధవరావు మాటలకు 'ఊ' కొడుతోందామె.

మాధవరావు అదేమీ గమనించటం లేదు.

ఎంతో ఉత్సాహంతో తన మనసులో పేరుకు పోయిన ఆలోచనలన్నీ ఆమె ముందుంచుతున్నాడు.

చేజారి పోయాయనుకొన్న అనురాగం, ఆనందం మళ్ళీ తన జీవితంలో హఠాత్తుగా జొరబడినందుకు పరవశంగా ఉందతనికి.





# కోరిన చోటుకి పరుగెత్తే ఇళ్ళు!

అమెరికన్‌లలో చాలామంది నివశించేది ఇళ్ళల్లో కాదు, వాహనాల్లో. రోజంతానో, కావలసినప్పుడో ఇష్ట మొచ్చిన చోటుకి నగరమంతా చుట్టి వచ్చే బస్సుల్లా ఉండే గృహాలన్నమాట! అన్ని విషయాల్లోనూ గృహ తుల్య సౌకర్యాలతో ఏ మాత్రం తీసిపోని ఈ వాహన గృహాలు ఎక్కడికి బడితే అక్కడికి తిరుగుతుంటాయి.

తమ 'వాహన గృహాలు' ఉన్న చోట పొరుగు వారితో సఖ్యత కుదరకపోయినా, అక్కడి వాతావరణ పరిస్థితి బాగోకపోయినా ఆ గృహాన్ని మరో చోటుకి నిక్షేపంలా తరలించుకుపోవచ్చు.

ఈ ఇళ్ళు పార్కింగ్ చేసుకునేందుకు పెద్ద పెద్ద మైదానాలున్నాయి.

వాహన గృహ యజమాని కొంత ఛార్జీ చెల్లించి, తన ఇంటికి కావలసిన విద్యుత్తు, మంచి నీరు, వంట గ్యాసు లాంటివి పొందవచ్చు. ఈ తిరుగుడులో కొత్త కొత్త స్నేహితులు కూడా కలుస్తూంటారు.

వీరికోసం ఏర్పాటయిన కొన్ని సంస్థలు ఈ వాహనాలు నగరమంతా తిరిగి వచ్చేందుకు "రోడ్ రాలీ"లను తరచు నిర్వహిస్తుంటాయి. తమ సభ్యుల సంక్షేమాన్ని పర్యవేక్షిస్తూండే ఈ సంస్థల్లో ఎంతో మంది చేరుతుంటారు.

ఇలాంటి వాటిలో ఎక్కువమంది సభ్యులతో ప్రఖ్యాతిగాంచిన పెద్ద సంస్థ "ఫామిలీ మోటార్ కోచ్ అసోసియేషన్" తమ సంస్థలో సభ్యులైన ప్రతి

కుటుంబం నుంచి ఏడాదికి 25 డాలర్ల చొప్పున 31,000 డాలర్లు వసూలయినట్లు ఈ సంస్థ సగర్వంగా చెప్పుకొంటోంది.

దీన్లో సభ్యునిగా చేరదలచిన వారికి కనీసం 18 అడుగుల పొడవుండే స్వంత 'వాహన గృహం' ఉండి, దాన్ని స్వయంగా నడిపేశక్తీ ఉండాలి. ఆ గృహంలో చక్కని పారిశుద్ధ్య వసతులూ, జనరేటర్ సౌకర్యం, డ్రైవరు సీటు నుండి వెనుకకు నడిచి వెళ్ళేందుకు తలకు తగలనంత ఎత్తు కలిగిన పైకప్పు ఉండి, ఎయిర్ కండిషన్డ్, సి.బి. రేడియో, ఐస్‌మిషన్ తదితర ఏర్పాట్లూ ఉండాలి.

"ఫామిలీ మోటారు కోచ్ అసోసియేషన్" ఇటీవల 'మిన్నేహాహ' నగరం బయట ఓ మైదానంలో 'గ్రాండ్ నేషనల్ రాలీ' నిర్వహించింది. ఈ పరుగెత్తే గృహాల చోద్యాన్ని చూసేందుకు జనం విరగబడ్డారు. 7,500 మంది ప్రజానీకాన్నీ, 2,078 మంది వాహన గృహ యజమానుల్నీ ఈ రాలీ అమితంగా ఆకర్షించింది.

ఆకాశమార్గం నుంచి క్రిందికి చూస్తే ఆగిపోయిన ఆ ట్రాఫిక్, టాంకుల యుద్ధరంగమా? అనిపింపజేసిందట. ఒకదానికొకటి ఎదురెదురుగా నిలబడ్డ ఆ వాహనాలు రెండువర్గాల సైన్యం ఒకదాన్నొకటి ఢీకొన్నట్లుండి 225 ఎకరాల మైదానాన్ని ఆక్రమించుకుంది. 'మిన్నేహాహ'లోని పచ్చని ప్రాంతమంతా మోటారు వాహనాల మ్యూజియమా? అనిపించేట్లు కనుపించిందట.

మర్నాడు తమ వాహన గృహాలకు కావలసిన మరమ్మత్తులు చేసుకుని, మైదానాల్లో వేగంగా పరుగులు తీయించేరు యజమాన్లు.

అమెరికాలోని వివిధ రాష్ట్రాలనుంచే కాక, కెనడా నుంచి కూడా వాహనాలు వచ్చి ఈ పోటీలో పాల్గొన్నాయి.

# చతురప్రపంచం

## పురుషస్వేచ్ఛ

అమెరికాలో సరికొత్త తరహా స్త్రీ ఉద్యమం మొదలైంది. ఇంత వరకూ స్త్రీ స్వేచ్ఛలోని ఆనందాన్ని జుర్రుకున్న మహిళలు, పురుషుల్ని త్రోసిరాజని తాము జీవితంలో ఎంత మాధుర్యాన్ని, సుఖాన్ని పోగొట్టు కున్నారో గుర్తించి ఈ ఉద్యమాన్ని ప్రారంభించారట.

ఇప్పుడిప్పుడే మహిళా లోకంలో వేళ్ళూను తున్న ఈ ఉద్యమ వ్యాప్తికి 'మార్బెల్ మార్గన్' అనే 40ఏళ్ళ మహిళ వ్రాసిన "టోటల్ ఉమెన్" పుస్తకం 40 లక్షల కాపీలకు పైగా అమ్ముడై స్త్రీ స్వేచ్ఛవల్ల కలిగే దుష్ఫలితాల్ని తెలియ జెప్పింది.

పతి దేవుళ్ళ ఇష్టాయిష్టాలతో ఏకీభవించడంలో ఎంతో ఆనందం ఉందనీ, పాత పద్ధతుల ప్రకారం భార్యలపై అధికారం చెలాయించే హక్కు, మందలించే చనువు భర్తలకు ఇచ్చి, వారిని ప్రస్తుతిస్తూ, అభినందిస్తూ ఆహ్లాదంగా ఉంచడానికి ప్రయత్నిస్తే అదే సుఖ సంసారానికీ, ఆనంద జీవనానికీ రాచబాట అని ఆమె ఆ పుస్తకంలో పేర్కొన్నది.

ఆమె స్వానుభవాల్ని వివరిస్తూ తను చార్లీని పెళ్ళాడిన కొత్తలో ఇద్దరి మధ్యా సరైన అవగాహనలేక జగడాలు, స్పర్థలు పెరిగి, ఎవరికి వారు విడిపోవలసిన పరిస్థితులు ఏర్పడగా తనే పరివర్తన చెంది, భర్త అభిరుచులూ, అభీష్టాలు తెలుసుకుని అనుకూలంగా వ్యవహరిస్తూ అతన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించటంతో, అతనూ తనకు ఎంతో చేరువ అయ్యాడనీ, ఇరువురూ



పరస్పరావగాహనకు వచ్చి సుఖ జీవనానికి సూక్ష్మ మార్గాన్ని తెలుసుకున్నామనీ" వెల్లడించింది.

'ఆవిడ గారు ప్రతి స్త్రీ తమ భర్తలను ఆనందంగా,ఉల్లాసంగా ఉంచేందుకు కృషి చేయాలని శలవిచ్చింది. శుభం.పురుషులు మళ్ళీ స్వేచ్ఛా వాయువులు పీల్చ నున్నారన్నమాట!

## ముఖాలప్రపంచం

ప్రఖ్యాత ఆంగ్ల నాటక కర్త 'బెర్నార్డు షా'ని "మీరు అంత పొడుగాటి గడ్డం ఎందుకు పెంచారని" అడిగితే

"స్త్రీ వ్యామోహం నుండి ఈ గడ్డం నన్ను రక్షిస్తుంది" అని జోక్ చేశాడట.

గడ్డం మీసాలు పౌరుషానికీ, గౌరవానికీ చిహ్నాలు. అవి మనిషిలోని



గొప్పదనాన్ని వ్యక్తం చేస్తాయంటూ హిట్లరు, స్టాలిన్‌లను ఉదహరించాడో మానసిక శాస్త్రవేత్త. అసంఖ్యాకులైన యూదుల్ని అమానుషంగా తుదముట్టించిన 'హిచ్‌మన్'కి గడ్డంలేదా! గడ్డంలేని వారిలోనూ అసాధారణ వ్యక్తులుంటారని మరో శాస్త్రకారుని వాదన

ఒకప్పుడు యూరప్‌లో షార్క్ చేప పళ్ళను గడ్డం చేసుకునేందుకు వాడితే, మరొకప్పుడు రోమన్ సైనికులు రాతితో చేసిన పదునైన కత్తుల్ని ఉపయోగించేవారట.

గడ్డం మీసాలున్న వారిలో అధిక సంఖ్యాకులు స్త్రీ ద్వేషులు, సంఘవిద్రోహులు ఉంటారని ఓ మానసిక శాస్త్రవేత్త ఉవాచ.

ఆస్ట్రేలియాకి చెందిన 'డాక్టర్ పార్కర్' చక్కని మీసకట్టు ఉన్నవాళ్ళు, అస్తవ్యస్తమైన మీసాలవాళ్ళు అని రెండు విభాగాలుగా చేసి, మొదటి తరహావారిలో సాహస ప్రవృత్తిగలవారు, రెండో తెగలో పిరికితనంగలవారు ఉంటారని చెప్పాడు. మీసాలున్న 25 మంది యువకుల తత్వాలను పరిశీలించగా వారిలో 22 మంది కామాతురత, ధీరత్వం గలవాళ్ళే ఉన్నట్లు తేలిందట.

## పక్షిఘాతం

విమానాశ్రయాల వద్ద ఎగిరే పక్షులు పైలట్లను భయభ్రాంతుల్ని చేస్తున్నాయట.

భారత వైమానిక శాఖ దర్యాప్తులో గత ఏడాది 85 పైగా విమానాలు పక్షి ఘాతాలకు గురైనట్లు తేలింది. 1973 నుండి ప్రతి ఏడాదీ ఈ కారణంగా పాడయ్యే విమానాల సంఖ్య పెరుగుతూనే ఉంది. ఈ ఏడాది ఇప్పటికే 30 విమానాలు పక్షుల తాకిడులకు ఫ్యాన్ బెల్టులుతెగి, విమాన నాశిక పైభాగాలు చొట్టలు పడినట్లు ఫిర్యాదులు వచ్చాయిట.

ఉదయమూ, మధ్యాహ్నం సమయాల్లోనే ఈ పక్షి రాజాలు విమానాశ్రయాల చుట్టూ షికార్లుచేస్తూ, విమానాలు భూమ్మీద దిగేప్పుడూ, బైలుదేరేటప్పుడూ దాడిచేసి, వాటిని ధ్వంసం చేస్తున్నాయట.

రోజూ కనీసం 30 పక్షులు విమానాల్ని ముక్కులతో పొడిచి పలకరిస్తున్నట్లు విమాన సంరక్షణ సంస్థఅంచనా. అన్ని దేశాల వైమానికశాఖలు ఈ సమ

స్యను ఎదుర్కొనే మార్గాలు యోచిస్తున్నాయి.

పక్షులు గ్రుడ్లు పెట్టి, పొదగడానికి వీల్లేకుండా, విమానాశ్రయాల చుట్టూ



మొలిచే గడ్డిని కురచగా కత్తిరించి' చెట్లనరికివేసి, ఆ ప్రాంతాల్లో చిన్నచిన్న నీటి మడుగుల్ని ఏర్పరచి పక్షుల్ని తరిమికొట్టే కుందేలు, ఎలుకలాంటి మినీ జంతువుల్ని కూడా అక్కడ తిరిగేట్టు చేశారు. ఫలితంగా ఖగేంద్రుల బారి నుండి విమానాల్ని రక్షించి, ప్రయాణాల్లో ఆలస్యాన్ని అరికట్టారు. పైలట్లకు గుండె బెదురూ తగ్గించారు.

## బీరుబోటు

ఉత్తర ఆస్ట్రేలియాలో 'బీరు' బలు లెక్కువట. 1975లోనే అక్కడివారు ఒక్కొక్కరు సరాసరి 52గ్యాలన్ల బీరు బిగించి చరిత్ర సృష్టించారట,

అరగ్యాలను పట్టే బీరు డబ్బాలను ఖాళీ అయిన తర్వాత వ్యర్థంగా పారేయక, వాటితో ఓ బోటుని తయారుచేసి సముద్రయానం చేయొచ్చని ఒక జర్మని ఇంజనీరు 'ఫ్రాంకెన్ ఫీల్డ్' ఆలోచించేడు. డ్యారిన్ పట్టణానికి చెందిన 'స్కిప్పర్ క్లెమ్ జోన్స్', 'పాల్ హార్డింగ్' అనే మరో ఇద్దరూ అతన్తో కలిసి, బీరు డబ్బాలతో ఒకబోటును రూపొందించారు.

7.6మీటర్ల పొడవు, 4 టన్నుల బరువుగల 'కేంటకీ' అనే ఆ బోటుని 15,500 బీరు డబ్బాలతో నిర్మించి, 50 హార్స్ పవర్ గల ఇంజన్లను అమర్చి, ఉత్తర ఆస్ట్రేలియా నుండి సింగపూర్ కి 4వేల కిలోమీటర్లు ప్రయాణం చేశారు.

మొదట్లో సముద్రంలోకి దింపగానే మునిగి పోయిన ఆ బోటుకు ఆస్ట్రేలియా ప్రభుత్వం సముద్రయాన సిఫార్సు పత్రం ఇవ్వ నిరాకరించింది. నావికశాఖ రక్షణ వసతులు కల్పించ తిరస్కరించింది.



ముగ్గురూ చివరికి బోటును సముద్రంలోకి దింపి, దాని వెనుక చిన్న

నావను కట్టి, దాన్లో ఆహార పదార్థాలూ, నీరూ తీసికెళ్ళారు. ప్రయాణంలో నిప్పు రాజేయకుండా వారు పెట్రోలు-నీరూ మధ్యే రోజులు గడపాల్సి వచ్చిందట.

తెరచాప దీపం లేనందున, 4టన్నుల బరువు మాత్రమే వున్న ఆ బోటును ఏక్షణంలో ఏ స్టీమర్ వచ్చి ఢీకొంటుందో అనే భీతితో ముగ్గురూ వంతుల వారీగా రోజూ మూడు గంటలు మాత్రమే నిద్ర పోతూ ప్రయాణం చేశారు. మధ్యలో రెండు ఇంజన్లు చెడిపోతే, మిగిలిన రెండు ఇంజన్లతోనే మిగతా 12రోజుల ప్రయాణాన్ని పూర్తిచేసి, సింగపూర్ చేరి, అనుకున్నది సాధించ గలిగారు. భవిష్యత్తులో బ్రాందీ సీసాలతోనూ విచిత్రాలు చేస్తారేమో చూద్దాం.

## ప్రాచీన గ్రంథాలు

'చెదల' బారిపడకుండా రక్షించిన 4 వేల ప్రాచీనగ్రంథాలతో కలకత్తాలో నేషనల్ లైబ్రరీ ఓ గొప్ప ప్రదర్శన ఏర్పాటు చేసింది. అరబ్బీ, పర్షియన్ భాషల గ్రంథాల వ్రాత ప్రతులేకాక 1700వ సంవత్సరానికి ముందు ముద్రితమైన 350 గ్రంథాలు, 17వ శతాబ్దికి చెందిన 300 గ్రంథాలు, 18వ శతాబ్దానికి సంబంధించిన వెయ్యి ప్రాచీన గ్రంథాలూ ఆ ప్రదర్శనలో ఉన్నాయి.

'డాంటే' గారి 'కమేడియా' (1536) అరిస్టాటిల్ వ్రాసిన 'ఒపేరా' (1588)లతో పాటు అన్నిటికంటే అతిప్రాచీనమైన గ్రంథం గ్రీకు రచయిత ప్లినీస్ లాటిన్‌లో పెద్దపెద్ద రక్తవర్ణాక్షరాలతో వ్రాసిన 'నేచురల్ హిస్టరీ' (1481) కూడా ఉంది.

1923 లో పోర్చుగీసు మిషనరీల



వల్ల ప్రచారంలోకి వచ్చి, భారతదేశంలోనే ముద్రణ పొందిన తమిళ గ్రంథం 'బైబిలియా దాములికా'ను ప్రత్యేకంగా పేర్కొనవచ్చు.

హిందీలోని లల్లూరామ్ "ప్రేమ్ సాగర్" (1810), బెంజిమెన్ "గ్రమెటికా హిందుస్థానికా" (1745), బెంగాలీలో ప్రథమంగా ముద్రణ ముఖం చూసిన థరియల్ హాలెడ్‌గారి "ఎగ్రోసెస్ ఆఫ్ ది బెంగాలీ లాంగ్వేజ్" అంతే కాకుండగా ప్రథమంగా భారతీయునిచే రచింపబడి ముద్రణ పొందిన ఆంగ్లనాటకం 'ది ప్రాస్పెక్టివ్' కృష్ణమోహన్ బంధోపాధ్యాయ గ్రంథం ఈ ప్రదర్శనలో చెప్పుకోతగ్గవి.

మొఘల్ కాలంలో ఫిరదౌసి వ్రాసిన "షహనామా" పారసీక భాషా వ్రాత ప్రతి ఇందులో ప్రత్యేక ఆకర్షణ.

## టెర్రరిస్టులు

టెర్రరిస్టు సంస్థలు పాశ్చాత్య దేశాల్లో విరివిగా వ్యాపిస్తున్నాయి. ఇటీవలే ఇటలీ మాజీ ప్రధాని 'ఆల్డోమోరోని' దారుణంగా హత్యచేసిన 'రెడ్ బ్రిగేడ్' ప్రముఖంగా వార్తలకెక్కింది.



ఒక సాయుధ దుండగుడు ఇటలీ పోలీసుల చేత గాయపడి బందీ అయ్యాడు. ఎంత హింసించినా తమ రహస్యాలేవీ బైట పెట్టలేదు. అయితే రోమ్‌లోని 'టెంపో' అనే వార్తా పత్రిక విలేఖరి ఆ ఖైదీని కలసి కొంత సమాచారం రాబట్టాడు.

పట్టుబడ్డ సాయుధ దుండగుడి పేరు 'పియాన్ కోన్'. 1500 మంది సభ్యులున్న రెడ్ బ్రిగేడ్‌లో నాలుగు విభాగాలుండి, వేటికవే ప్రత్యేకంగా 'పని చేస్తాయి. సభ్యులందరికీ గృహవసతి, ఇత్యాది సౌకర్యాలుంటాయి. సంస్థలో చేర్చుకునే ముందు అభ్యర్థులకు నేరాలు చేయడంలో గల సామర్థ్యాన్ని పరీక్షించి, నెగ్గిన వారిని శిక్షణ నిమిత్తం వేరేదేశం పంపిస్తారు. అయితే 'పియాన్ కోన్' ఆ దేశం పేరు మాత్రం బయట పెట్ట లేదు. బహుశా అది జెకొస్లవేకియా అయి వుండొచ్చని పరిశోధకుల ఊహ.

తమ కార్యకలాపాల్ని రహస్యంగా సాగించే ఈ సంస్థలో చేరాలనుకొనేవారు కనీసం కారు దొంగిలించటం లాంటి చిన్న చిన్న నేరాలనయినాచేసి ఉండాలి. సుశిక్షితులైన సభ్యులకి తోడు, దాదాపు పదివేల మందికి పైగా సామాన్య పౌరులూ ఆ రెడ్ బ్రిగేడ్‌కి దోహదం చేస్తున్నారు. ఆ పౌరులు సరిహద్దు ప్రాంతాల్లో తిరిగే టెర్రరిస్టులకి ఆశ్రయ మిస్తుంటారు. ఇటీవలనే వారికి సంబంధించిన కొన్ని పత్రాలు ఇటలీ పోలీసులకు దొరికాయి వాటిలో టెర్రరిస్టుల ప్రవర్తనా నియమావళీ, సంకేత భాషలో సూచనలూ ఉన్నాయి. టెర్రరిస్టు సభ్యులంతా నిరాడంబరంగా, స్వతంత్రంగా ఉండాలని ఆ నియమావళిలో సూచింపబడి ఉందట.

## కంప్యూటర్ కారు

కంప్యూటర్ సహాయంతో నడచేటకొత్త రకం కారుని త్వరలోనే ప్రపంచానికి అందించనున్నాడు న్యూపోర్టుకు చెందిన "ఆస్టన్ మార్టిన్ లగోండా"

మైక్ లస్బి అనే ఆయన తన మేధస్సుకు పదును పెట్టి ఇచ్చిన ఆలోచనని కార్యరూపంలోకి తెచ్చి, భారీ ఎత్తున

కంప్యూటర్ కార్ల వ్యాపారం చేయాలని 'లగోండా' యోచిస్తున్నాడు. 'ఆ కారు ఎప్పుడు రోడ్డు మీదికి వస్తుందా?' అని న్యూపోర్టు ప్రజలు ఆతృతగా ఎదురు చూస్తున్నారు.

కారు వెనుక డిక్కీలో అమర్చబడిన చిన్న ట్రాన్సిస్టర్ రేడియో సైజులో ఉండే ఎలక్ట్రానిక్స్ కంప్యూటర్ మొత్తం కారునే కంట్రోలు చేస్తుంది. సాధారణ కారుల్లో ఉండే బ్రేకులు, గేర్లు, యాక్సిలేటర్ లాంటివి ఏమీ ఉండవు. స్టీరింగ్, ఒక డాష్ బోర్డు మాత్రమే వుంటాయి. డ్రైవరు స్విచ్‌లను నొక్కుతూ కారు నడపవచ్చు.

ఎంతదూరం ప్రయాణించిందీ, మైళ్ళు కిలోమీటర్లు, టెంపరేచర్ టాలీ చేసే మీటర్లూ ఉంటాయి. వాతావరణ పరిస్థితులు, ట్రాఫిక్ నిబంధనల గురించిన



హెచ్చరికలు అన్నీ డాష్ బోర్డులో రంగురంగుల సూచనలు, డిజైన్లద్వారా వెల్లడిస్తుంది.

కారు ఆగిన వెంటనే తలుపు తెరచుకోవటం, దిగగానే తలుపులు వాటంతటవే మూసుకుపోవటం, కారులోని ఎయిర్‌కండిషనింగ్ ఆగిపోవటం జరుగుతాయి. డ్రైవింగ్ సీటులో సరిగా కూర్చోకపోతే హెచ్చరికలుచేసి దాని కదే సరిచేయటం దీనిలో ప్రత్యేకత.

షుమారు అయిదున్నర లక్షల రూపాయల ఖరీదు చేసే ఈ కారు మొదటి మోడల్ 1980లో తయారు కావచ్చునట.

## ప్రజల సొమ్ము

విద్యుచ్ఛక్తి పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నందున పశ్చిమబెంగాల్ పారిశ్రామిక రంగంలో వారానికి 10 కోట్ల రూపాయలు నష్టం వాటిల్లి, చిన్నతరహా పరిశ్రమలు మూతపడి, అసంఖ్యాకులు నిరుద్యోగులయ్యారు. ప్రైవేటు, ప్రభుత్వ సంస్థలు కూడా వారంలో నాల్గు రోజులు పనిచేయలేదు. విద్యుచ్ఛక్తి లేక ఫ్యాక్టరీలు, కోల్డ్‌స్టోరేజీలు, ఖరీదైన మెషినరీలు పాడయ్యాయి.

ఇదిలా ఉండగా శ్యామ్‌నగర్‌లోని ఎలక్ట్రిసిటీ గోడౌన్‌లోనూ కనీసం 2 కోట్ల విలువైన పరికరాలు, ఎండా వానలకు శిథిలమైపోగా మరో 3 కోట్ల ఖరీదైనవినిరుపయోగంగా తయారయ్యాయి. కలకత్తాలోగల ప్రధాన విద్యుత్ కార్యాలయం రెండు గోడౌన్లలో ఉంచిన 30 వేల రూపాయల "హైటల్టేజికేబుల్స్" ఎందుకూ పనికిరాకుండా పోయాయి.

పర్వత శ్రేణుల్లా పడిఉన్న ఈ కేబుల్స్ ప్రక్కనే ఒక్కోటి 6లక్షల

ఖరీదు చేసే ట్రాన్స్‌ఫార్మర్లు అనేకం తుప్పుపట్టి రంధ్రాలు పడిపోయాయి. గత పదేళ్ళుగా ఎవరూ వాటి ముఖం చూసిన పాపాన పోలేదట.



ఇక్కడే మరో 50లక్షల ఖరీదుచేసే దాదాపు 450 ట్రాన్స్‌ఫార్మర్లు వ్యర్థంగా పడిఉన్నాయి. గోడౌన్ల చుట్టూ ఎత్తైన గోడ లేనందున దొంగతనాలవల్ల కొన్ని పరికరాలు పోతున్నాయట. విద్యుచ్ఛక్తి శాఖలోని అధికార్లు, ఉద్యోగుల అశ్రద్ధ వల్ల ఈ శాఖకు మరెంత నష్టం వాటిల్లుతోందో. రాజులసొమ్ము రాళ్ళ పాలైతే, ప్రజల సొమ్ము మట్టిపాలా?

# నీలిమనుషులు

సహారా ఎడారి ప్రాంతం 'మొ రా కో' పట్టణంలో 1 1/2 కోట్ల జనాభాలో 30 వేలకు పైగా 'రేఖాబత్'లనే నీలిమనుషులుంటారు. చిన్న చిన్న గుడారాల్లో నివసించే ఈ జాతి పురుషులు మాత్రం సహారాకు పహారా ఇచ్చే గార్డ్స్‌గా వ్యవహరిస్తారు. దక్షిణ అల్జీరియా సరిహద్దుల్లో, స్పానిష్ సహారాలో రేఖాబత్ లున్నారు.

రేఖాబత్‌ల పూర్వులు నీలి రంగు దుస్తులనే ఇష్టపడే వారట. తీక్షణమైన ఎండలో చెమటకు ఆ దుస్తులు తడిసి, నీలిరంగు వారి శరీరాల్లో ఇంకిపోయి అలా తయారయిందంటారు. తరువాత తరువాత వారి సంతతి కూడా నీలి దుస్తులకే అలవాటు పడ్డారు.

మాడు పగిలే ఎండకూ, ఎముకలు కొరికే చలికీ తట్టుకోగల ప్రకృతిగల వారు రోజూ 3 పౌనులు ఫలాల్ని తింటారు. తమ బ్రతుకుల్ని ఒక్క ఖురాన్ గ్రంథమే శాసించి నడిపిస్తుందని వారి విశ్వాసం.

ఇటీవల వరకూ వారికి డబ్బు సంబంధమైన ఇచ్చిపుచ్చుకోవడాలు తెలీవు. ఒంటెలే వారి ఆస్తి. తుపాకులు ఇత్యాది




వస్తువులు కావాలనుకుంటే ఆ విలువకు ఒంటెలను బదులుగా ఇచ్చేవారు. పెళ్ళిళ్ళలో వరుడికి 40 ఒంటెలను

కట్నంగా ఇవ్వడం ఈ జాతి సాంప్రదాయం.

'రేఖాబత్' స్త్రీలకు విడాకుల స్వాతంత్ర్యం లేదు. భర్తలను తూలనాడితే భగవంతుని ముందు క్షమాపణ చెప్పించి ప్రమాణం చేయిస్తారు. అంచేత విడాకులకు ఎక్కువ అవకాశాలు లేవు.

పట్టణ జీవనమంటే గిట్టని నీలి మనుషులలో యువకులు బ్లూ యూనిఫారంలో, తుపాకీ తూటాలుగల పట్టీని తగిలించుకుని ఒంటెలపై సహారాలో పహారా ఇస్తూ తిరగటాన్ని ఎంతో ఘనంగా భావిస్తారుట.

# నదిమధ్య ఫ్యాక్టరీ

జపాన్‌లో తగినంత స్థలం లేదని సముద్ర మధ్యంలో హోటళ్ళు నిర్మిస్తున్నారు. ఇదేఅబ్బురంగా ఉంటే, ఇపుడు బ్రెజిల్ కోటీశ్వరుడు డేనియల్ కె. లుడ్విగ్ ఓ నదిపై తేలియాడే ఫ్యాక్టరీనే నిర్మించాడు. 350 మిలియన్ డాలర్ల ఖర్చుతో ఏడాదికి 750మెట్రిక్ టన్నుల పేపర్‌ను తయారుచేసే ఈ ఫ్యాక్టరీని అతను జపాన్‌లో నిర్మించి, హిందూ మహాసముద్రం, అట్లాంటిక్ మహా సముద్రాల మీదుగా 15వేల మైళ్ళ దూరాన్ని దాటించి బ్రెజిల్‌కు తీసుకువచ్చాడు.

అమేజాన్‌కి ఉపనది అయిన జరీనది మధ్య ప్రాంతంలో ఈ ఫ్యాక్టరీని స్థాపించారు. 4వేల స్తంభాలపై ఏర్పాటు చేసిన ఈ ఫ్యాక్టరీకి అవసరమైన 55వేల కిలోవాట్ల విద్యుత్ ఉత్పత్తికి ఏర్పాట్లూ జరిగేయి.

రెండు ఫుట్‌బాల్ ఆటస్థలాలంత పొడవు, పదహారు అంతస్తుల భవంతి కన్నా ఎత్తుఉండే ఈ బ్రహ్మాండమైన పేపర్ ఫ్యాక్టరీలో 1981నాటికి ఉత్పత్తి గరిష్ఠ స్థాయికి చేరుతుంది. ప్రస్తుతం ఉన్న కాగితం డిమాండ్‌ను బట్టి 1985 నాటికి ప్రపంచ వ్యాప్తంగా పెద్ద ఎత్తున కాగితపు కరువు రావచ్చు నంటున్నారు మరి.

బ్రెజిల్‌లో రోడ్డు సరిగాలేక, వస్తువుల రవాణాకు వీలులేనందున ఫ్యాక్టరీ



నిర్మాణం జపాన్‌లోనే చేయించినట్లు లుడ్విగ్ తెలిపాడు.

ఈ ఫ్యాక్టరీలో ఒక ఏడాదిలో తయారయే కాగితంతో ప్రపంచం మొత్తాన్ని ఆరున్నర సార్లు కప్ప వచ్చుట.







పశ్చిమ జర్మనీలోని లాండ్‌షట్ నగరంలో "ఈ ఏటి పెళ్ళి కూతురు"గా కాన్వెంట్ స్కూల్లో చదువుతున్న ఓ అమ్మాయి ఎన్నికయింది. పెళ్ళి కొడుకు కూడా విద్యార్థే.

మనకు నగరాల్లోనూ, పట్టణాల్లోనూ మునిసిపల్ కౌన్సిలర్లను, సహకారబ్యాంకు సెక్రెటరీలనూ, అధ్యక్షులనూ ఎన్నుకోవటం మాత్రమే తెలుసు. కాని లాండ్‌షట్‌లో ఏటా నూతన వధూవరుల ఎన్నిక జరుగుతుంది. ఈ ఆచారం గత 75 ఏళ్ళుగా అమలులో ఉంది. దీనికి 1475లో నాంది జరిగింది.

అప్పటి పోలండ్ రాజకుమారి జాడ్విగాకూ, బవేరియన్ యువ రాజు జార్జికి 1475లో వివాహమయింది. అప్పటికి పెళ్ళి కూతురుకు 18 ఏళ్ళు. పెళ్ళి కొడుక్కి 20 ఏళ్ళు. ఆ కళ్యాణానికి గుర్తుగా లాండ్‌షట్ నగర అధికారులు ఏటా "లాండ్‌షట్ రాచరిక వివాహ వేడుక" జరిపిస్తున్నారు.

ఈ వేడుకకు ముందు ఆ నగరంలోని యువతీ యువకులలో ఒక్కొక్కరిని ఎన్నుకొంటారు. ఈ ఏడు 16 ఏళ్ళ వయసు గల

# ఈనాడు జరిగే ఆనాటి పెళ్లి

బీట్‌రైస్ షీరర్ వధువుగానూ, 21 ఏళ్ళ వయసు గల జోసెఫ్ ఆబెర్‌మెయిర్ వరునిగానూ ఎన్నుకోబడ్డారు. షీరర్ ఓ కాన్వెంట్ స్కూల్లో చదువుతోంది. జోసెఫ్ కూడా వ్యాపార నిర్వహణాశాస్త్రాన్ని అభ్యసిస్తున్నాడు.

ఇలా వధూవరులుగా ఎన్నుకోబడటానికి అభ్యర్థుల జన్మ స్థలం లాండ్‌షట్ అయివుండాలి. దానితోపాటు వారు ఐశ్వర్యవంతులై కూడా వుండాలి: ఆ తరవాత జరిగే వేడుకలో అవసరమయ్యే రాచరిక దుస్తులు, ఆయుధాలు, గుర్రాలకు వగైరాలకు అయ్యే ఖర్చులు భరించవలసి వస్తుంది కనుక ఈ నిబంధన ఏర్పరిచారు. ఎన్నికలో పాల్గొన్న అభ్యర్థులలో సమాజంలో కలివిడిగా తిరగగలిగే మనస్తత్వం ఉన్నవారినీ, లాండ్‌షట్ రాచరిక వివాహ వేడుక గురించి పూర్వాపరాలు తెలిసున్న వారినీ, ముఖ కవళికలు ఫొటోజెనిక్‌గా ఉన్న వారినీ మాత్రమే ఎంచుకుంటారు.

ఈసారి కుతూహలపడిన 300 మంది అభ్యర్థులలో షీరర్‌ను ఎన్నుకోవటంలో ఓ విశేషం ఉంది. ఆమె కురులు నల్లగా నిగ నిగ లాడుతూ ఉంటాయి. మనిషి ఆకర్షణీయంగా, తెలివిగా, చలాకీగా

ఉంటుంది. తాను వధువుగా ఎన్నుకోబడినందుకు షీరర్ ఆనందంతో తబ్బిబ్బయింది. ఆ వేడుకలో ప్రవర్తించవలసిన తీరు గురించి ఆమెకు ఇద్దరు శిక్షణ ఇస్తున్నారు. ఆ కారణంగా షీరర్ తన స్కూలు దిన చర్యలను సక్రమంగా నిర్వర్తించలేకపోతోంది. వారానికి 3 రిహార్సల్సు ఉంటాయి. వాటికి సాయం పత్రికా విలేకరుల ఇంటర్వ్యూలు మొదలైన వాటివల్ల పాఠశాలకు సంబంధించిన దైనందిన వ్యవహారాల్లో శ్రద్ధ చూపలేకపోయింది.

"షీరర్ జన్మదినం ఆదివారం. ఆ రోజున పక్షులు శుభశకునాలు పలికాయి" అంటుంది ఆమె తల్లి. షీరర్ తల్లిదండ్రుల వద్దనే ఉంటున్నది. ఆమెకు 12 ఏళ్ళ తమ్ముడు కూడా ఉన్నాడు. గుర్రపు స్వారీ, వంట చేయటం ఆమె ముఖ్య హాబీలు.

ఇక జోసెఫ్ కూడా తన చదువు కుంటుపడుతున్నదనే భావించాడు. "ఆ సమయంలో నేను నేర్చుకోలేకపోయిన కొన్ని పాఠాలు తరవాత కొంచం శ్రమపడి చదువుకొంటాను. నా చదువు విషయంలో నాకేమీ భయం లేదు" అంటున్నాడతను. జోసెఫ్‌కు పాప్ సంగీతం అంటే చాలా అభిమానం. ఆ సంగీతానికి సంబంధించి అతనివద్ద లెక్కలేనన్ని రికార్డులున్నాయి. 5 శతాబ్దాల నాటి సంగీతానికి అనుగుణంగా నాట్యం చేయటం నేర్చుకుంటున్నా, అది అతనికి పెద్ద ఇబ్బందిగా లేదంటున్నాడతను. జోసెఫ్‌కు మోటార్ సైకిలు నడపడం చాలా ఇష్టం. భవిష్యత్తులో జరగబోయే "క్రాస్ కంట్రీ రేసెస్"లో పాల్గొనాలని అతనికి చాలా ఉబలాటంగా ఉంది.

---

## ఛాయాచిత్ర వివరణ:

1. రాచరిక ఆచార వ్యవహారాలలో సుశిక్షితులైన తరవాత వేడుక రోజున ఈ ఏటి వధూవరులు లాండ్‌షట్ నగర వీధులలో ఊరేగారు. ఈ వేడుకను దాదాపు ఆరు లక్షల మంది దర్శించినట్లు అంచనా.

2. ఊరేగింపు తరవాత సకల మర్యాదలతో సభికుల ఎదుట జోసెఫ్, షీరర్‌లు రాచరిక సాంప్రదాయ నాట్యం చేశారు.

3. వేడుక అనంతరం జోసెఫ్, షీరర్‌లు లాండ్‌షట్ రాచరిక వివాహ వేడుక గురించి ముచ్చటించుకున్నారు.

4. తాను రాకుమారునిగా ఎన్నికైన తర్వాత ఓ పక్క తత్సంబంధమైన శిక్షణతోనూ, ఇతర దైనందిన కార్యక్రమాలలోనూ తలమునకలవుతున్నప్పటికీ తండ్రికి పాలరాతి వ్యాపారంలో సహాయం చేసేవాడు జోసెఫ్.

5. లాండ్‌షట్ రాచరిక వివాహ వేడుకలలో రాకుమార్తెగా తాను ధరించబోయే కిరీటాన్ని, ఇతర దుస్తులనూ తన తమ్మునికి ముందుగానే చూపించింది షీరర్.

# స్నేహితురాలికి మీనా చేసిన సహాయం


















రోజుకు రెండుసార్లు న్యూట్రామూల్ తీసుకునే అలవాటువలన లాభిస్తుంది చివరికి. అందుకే దేశమందంతటా వేనవేలమంది బలాన్నిచ్చే న్యూట్రామూల్ వాడడం మొదలెట్టారు.

న్యూట్రామూల్‌లో బలవర్ధకమైన, మీగడగల అమూల్ పాలతోబాటు అసలైన కోకో, మాల్ట్, పంచదార ఉన్నాయి.

అరే ఆశ్చర్యం! న్యూట్రామూల్ ఖరీదులో తక్కువ! న్యూట్రామూల్ 500 గ్రాముల డబ్బా ధర కేవలం రూ. 11. పన్నులు అదనం. మీనాకే గాదు ఇంకా మరెందరికో న్యూట్రామూల్ అంటే ఎంతో ఇష్టం.





**అమూల్ వారి**

**న్యూట్రామూల్**

daCunha/L/EqR-1/Te

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : VIPULA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004.

